# ఉపోద్ఘాతము

ఈ యలంకారగ్రంథమును మాతాతగారు క్రీ. శ. 1892లో మొదటిమారు ముద్రించినారు. ద్వితీయముద్రణము 1909లో. మూఁడవమారు క్రీ. శ. 1929లో, మాతాతగారు గతించిన కొలఁదినెలలలోనే నేను ముద్రించుచు, అంతవఱకు ఏడుల్లాసములే మాతాతగారు ముద్రించియుండినందునను నేనింకను విద్యార్థిదశయందుండినందునను కీ. శే. శ్రీగన్నవరము సుబ్బరామయ్యగారి తోడ్పాటున తర్వాతి రెండుల్లాసములను కూడ చేర్చి ప్రకటించితిని. అదే మరల 1936లో పునర్ముద్రితమైనది. ఇప్పుడు విద్యార్థుల కనేకులకు ప్రతులు దొరకనందున మరల ముద్రింపవలసిన యావశ్యకత కలిగినది. దీనిని చక్కఁగా పరిశోధించి సంస్కృతాంధ్రవాఙ్మయములందలి యలంకారగ్రంథములతో తచ్చరిత్ర సమాలోకన పూర్వకముగా సరిచూచి వ్యాఖ్యతో ముద్రింపవలసిన యావశ్యకత ఎంతేనియుఁగలదు. పలువురు పరిశోధించి విశ్వవిద్యాలయముల బిరుదులకు ప్రయత్నించుచున్నారనియు విననగుచున్నది. ఆయాపరిశోధనాదికము లింకను వెలువడుట కాలస్యమగును గావున వట్టిమూలమును మాత్రమే పరీక్షలకు విద్యార్థులు త్వరగా కోరుచుండుటచేతను వారి యనుకూలము కొఱకు ముద్రించుచు ఆయావిషయములకు అర్థమగునట్లు,పద్యములకడనే సంఖ్యలు వేసి, దొరకిన పాఠాంతరములను అధోజ్ఞాపికలుగా సూచించుచు, విషయసూచికను చేర్చి ఒకపాటి కవిజీవితాదికములను గూడ నిబంధించితిని. ఇదివరలో పాఠాంతరములను ప్రత్యేక గ్రంథముగా ముద్రించిన ఆంధ్రసాహిత్యపరిషత్తువారి కృషి ఎంతయు తోడ్పడినది. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి గ్రంథభాండాగారములోని మూఁడు తాళపత్రప్రతులలో నొకటి వ్యాకరణాది నవమోల్లాసము మాత్రముకలది పెక్కు పాఠాంతరములతో కనఁబడినది. అందుపయుక్తములని తోఁచినవానినికూడ చేర్చితిని. ఇందులకు పైరెండు మహాసంస్థలవారికి ఇవె నాకృతజ్ఞతలు.

## కవి కాలాదికము

ఈయలంకారశాస్త్రకర్త విన్నకోట పెద్దయామాత్యుఁడు, ఎలమంచి పంచధారలప్రాంత దేశపాలకుఁడై క్రీ. శ. 1377 - 1407లకు ముందువెనుకల పాలించిన చాళుక్యరాజు విశ్వేశ్వరభూపతికి ఆశ్రితుఁడు; నియోగిబ్రాహ్మణుఁడు, శైవుఁడు (కాదా శివభక్తుఁడు), కాశికగోత్రుఁడు, గోవిందామాత్యుని కుమారుఁడు. గ్రంథారంభమున నిట్లు చెప్పుకొన్నాఁడు—

'నను గావ్యక్రమవేది నర్చిత బుధానందాదరాలోకితున్,
మనితశ్రీగిరిజేశపాదయుగళున్, మాన్యున్, గళాకౌశలున్,
వినుతుం గౌశికగోత్రుఁ బెద్దనసుధీవిఖ్యాతు రావించి స
ద్వినయం బొప్పఁగ నాదరించి తగ నావిశ్వేశ్వరుండిట్లనున్.'

ఆశ్వాసాంతములలో 'ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్య నందన వివిధ బుధనిధేయ విన్నకోట పెద్దయనామధేయ'యనియు చెప్పుకొన్నాఁడు. తాను 'చతురుఁడ' నని 'భావరస ప్రపంచమున...విద్యావిధి గానిపించుట గదా చతురత్వమనంగ మేదినిన్' అనుటచే ధ్వనింపఁజేసినాఁడు. ఈ యలంకారగ్రంథము తాను రచించుటకు కారణము ఇందలి విషయము లొక్కచోట కానరాకుండుటయని 'లలి నన్యోన్యముఖావలోకనము లీలం జేయఁగా లేని యావిలసత్కావ్యకళాచతుష్టయము లుర్విం బర్వ నేకస్థలిం గలిగించెం' అనుటచేతను—

'అచట నచ్చటనున్న కావ్యాగమములఁ
జెలఁగి సత్కవి సౌకర్యసిద్ధికొఱకు
ఒక్కచోటనె యొడగూర్ప నుత్సహించి,' అనుటచేతను తెలిపినాఁడు.

'కబ్బపుమణుల'ను 'ఘనరస రత్నాకరము' నుండి 'ఒడగూర్చియిత్తు' నన్నాఁడు. తన లక్షణవేత్తృత నిట్లు తెలుపుకొన్నాఁడు—

'చతురశ్రోత్ర సుఖాకరామృత పరిష్యందంబు నందంబునై
క్షితిఁగావ్య ప్రసరంబువోల్చు నిఖిలక్షేమంకర స్ఫూర్తితోఁ
బ్రతిభావంతులు మెచ్చ లక్షణము నొప్పం జెప్పెదుం బూర్వక
ల్పిత శాస్త్రానుగతంబు సంగతముగాఁ బ్రీతిప్రదవ్యక్తితోన్' (3-77)

ఈతని లక్షణాభిజ్ఞతను గణపవరపు వేంకటకవి ఇట్లు ప్రశంసించినాఁడు "అలవిన్నకోట పెద్దన లక్షణజ్ఞత, శబ్దశాసన కవి శబ్దశుద్ధి" ఇత్యాది (ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము). ఇతఁడింక నేమేని గ్రంథములు రచించెనో దీనివలన తెలియుటలేదు. ఈతఁడు ప్రద్యుమ్న చరిత్రమను ప్రబంధమును రచించినట్లు కుమారసంభవటిప్పణములో మానవల్లి రామకృష్ణకవిగారు రెండుపద్యము లుదాహరించినారు. ఆపద్యములు పొన్నాడ పెద్దరాజు రచించిన ప్రద్యుమ్నచరిత్రములోనివై యుండునని శ్రీ వీరేశలింగము పంతులవారి యభిప్రాయము.

కృతిపతియైన విశ్వేశ్వరభూపతినిగూర్చి విశేషము తెలియవచ్చుటలేదు. ఈతనింగూర్చి యీకావ్యాలంకారచూడామణియు దొరకిన కొన్ని శాసనములునే మనకు ప్రమాణము. ఈ రాజు వంశవృత్తము కావ్యాలంకారచూడామణిలో

'శ్రీకంఠచూడాగ్ర' పద్యమున వర్ణితము. కాని ప్రధానపురుషులుమాత్రమే పేర్కొనఁబడి యున్నందున పూర్తి వంశవృక్ష మిందు తేలదు. విశాఖపట్టణము నందలి సర్వసిద్ధికి ఈశాన్యముగా మూఁడుక్రోసుల దూరమునందున్న పంచధార అనుచోట శ్రీ ధర్మలింగేశ్వరస్వామికి విశ్వేశ్వరమహీపతి మండపమును కట్టించి చెక్కించిన శిలాశాసనమున వంశవృక్షము కలదు. దాని ననుసరించి శ్రీ వీరేశలింగముపంతులు గారు వంశము నిట్లు నిర్ణయించినారు - 'భీమేశ్వరుని కొడుకు విమలాదిత్యుఁడు. విమలాదిత్యుని పుత్రుఁడు రాజరాజనరేంద్రుఁడు, రాజనరేంద్రుని సుతుఁడు కులోత్తుంగ చోళుఁడు, కులోత్తుంగచోళుని తనయుఁడు విమలాదిత్యుఁడు, విమలాదిత్యుని యాత్మజుఁడు మల్లపదేఁవుడు, మల్ల పదేవుని సూనుఁ డుపేంద్రుఁడు, ఉపేంద్రుని నందనుఁడు కొప్పభూపుఁడు, కొప్పభూపుని తనూజుఁడు మనుమోపేంద్రుఁడు, మనుమోపేంద్రుని కుమారుఁడు విశ్వేశ్వరభూపుఁడు. దీనినిబట్టి చూడఁగా విశ్వేశ్వర భూపతి రాజనరేంద్రున కేడవ మనుమఁడైనట్లు తెలియవచ్చు చున్నది.' అనివ్రాసి (ఆం. క. చరిత్ర. పు 185) పురుషాంతరమునకు నలువదేండ్లు లెక్క వేసికొని విశ్వేశ్వరునికాలము క్రీ. శ. 1304 కు తరువాతగాని యారంభముకాఁదని తలంచినారు.

ఇది సరికాదనియు మఱియొక శతాబ్దము తర్వాతికి కుదురుచున్న దనియు కీ. శే. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలిపినారు. (చూ. విభవ భారతి) "శాసనమునుబట్టి విమలాదిత్యుని కొడుకు రాజరాజ నరేంద్రుఁడు, అతనికొడుకు కులోత్తుంగ చోడకేసరి. అతనివంశమున (కుమారుఁడు కాఁడు) విమలాదిత్యుని కొడుకు మల్లపదేవుఁడు, అతనిపుత్రుఁ డుపేంద్రుఁడు, ఉపేంద్రుని కొడుకు మల్లపదేవుఁడు(2), అతనికుమారు, డుపేంద్రుఁడు (2) అతని కుమారుఁడు కొప్పభూపతి, కొప్పభూపతి పుత్రుఁ డుపేంద్రుఁడు (3), అతనిపుత్రుఁడు మనుమోపేంద్రుఁడు, మనుమోపేంద్రుని కొడుకు విశ్వేశ్వరభూపతి అని తెలుచున్నది... శాసనమునసే విశ్వేశ్వరభూపతి మండపమును కట్టించిన సంవత్సరముకూడ నిట్లు తెలుపఁబడినది....

'శాకాబ్దే నవబాహురామశశి సంఖ్యాతే శుభే భాసితే
సప్తమ్యా మిన భారవాజి మహితః సంస్థాపితో మండపః
కల్యాణోత్సవ సిద్ధయే సవిభవః శ్రీపంచధారాపురీ
ధర్మేశస్య చళుక్య విశ్వధరణీభర్త్రా విచిత్రాస్పదమ్'

ఇందువలన శ్రీవిశ్వేశ్వరభూపతి మండపమును కట్టించినది నవ-బాహు-రామ-శశి సంఖ్య అనఁగా 1329. శ.సం. అని తెలుచున్నది. కావున విశ్వేశ్వరభూపతి శ. సం. 1329 అనఁగా క్రీ. శ. 1407 ప్రాంతమువాఁడు, క్రీ. శ. 1304 నకు వంద

సంవత్సరములు తరువాతివాఁడు. ఈశాసనముననే విశ్వేశ్వరభూపతి సర్వసిద్ధివద్ద చిత్రభానుసంవత్సరమునకు సరియయిన శకవర్షము 1324 ప్రాంతమున శత్రువుల నోడించెనని క్రిందిశ్లోకమున శ్లేషింపఁబడినది.

'గతిబాహు శక్తిభూమితి మవిగణయ త్సర్వసిద్ధి పదభగ్నం
సతిచిత్రభాను సాక్షిణి ధరణివరాహ దధావదాంధ్రబలమ్'

పైశ్లోకములోని కట్టకడటి భాగము నోబిల్ దొరగారు సంపాదించిన పాఠము. ఈ శ్లోకమునకు సరియైన తెలుఁగుసేతయే పెద్దన కావ్యాలంకార చూడామణి యేడవ యుల్లాసమున నిట్లుకలదు.

'చతురుపాయ బాహుశక్తి క్షమావళి బాఱవిడిచి చిత్రభానుసాక్షిఁ
బాతె సర్వసిద్ధి పదమేది ధరణీవరాహమునకు నోడిరాచకదుపు.'

ఈపద్యము కావ్యాలంకారచూడామణిలో కలదనియే మనకు తెలియును గాని ఇంత వఱ కిందలి విశేషమేమో మనకు తట్టలేదు. నోబిల్ దొరగారు...విశ్వేశ్వరభూపతి 1325 శకవర్షమున ఆంధ్రసైన్యమును ఓడించెనని చిత్రముగ దేల్చినారు. ఇది యొంతియు చక్కగనున్నది...' అని శర్మగారువ్రాసి 'గతి' ని దొరగారు 5-గా గ్రహించినది పొరబాటని నాలుగుగా శకము 1324గా దిద్ది శాసనరచయితకూఁడ పెద్దనయే యయియుండును, కావ్యాలంకారచూడామణి నాతఁడు శా.స. 1324 న చిత్రభాను సంవత్సరమునకుఁ దరువాత రచించి యుండుననియు తేల్చినారు.

విశ్వేశ్వరభూపతి చివరిశాసనము క్రీ. శ. 1407లో దొరకుటచేతను పైవిజయము 1402 నాటిది ప్రస్తావింపఁబడి యున్నందున నీచూడామణి రచన ఈ నడుమ జరిగి యుండును. ఇందు కవి ద్వితీయోల్లాసమున 'శ్రీనిండారఁగ' యను పద్యమున (2) 'నూతనత్న్మానాథుండగు విశ్వనాథునకు' అనుటచే ఈతఁ డప్పుడే 1400 ప్రాంతమున రాజ్యమునకు వచ్చెనేమో.

ఈకవి పురవర్ణన కుదాహరణముగా రాజమహేంద్రవరమును వర్ణించినందున, నీతఁడును రాజును రాజమహేంద్రపురవాసులని శ్రీ వీరేశలింగము పంతులవారు వ్రాసియున్నారు. కవి యింటిపేరు విన్నకోటవారు, విన్నకోట కృష్ణామండలమున కలదు. కాని విన్నకోటవారు నియోగులు, రాజాశ్రయమునుపొంది అమాత్యులై దూరదేశములకేగుట సహజమే. మఱి కృతిపతిని 'పంచధారాధురీణా' యనుటచే పంచధారల వానినిగా తెలిపినకవి పురవర్ణన కుదాహరణముగా ఎన్నఁడో తమచేయి తప్పిపోయిన రాజమహేంద్రవరమును వర్ణించుటయు, రాజధాని యేదో వాచ్యముగా చెప్పక పోవుటయు వింతగానున్నది. ఈ యనంతర చాళుక్యవంశీయులు ఎవరుగాని రాజమహేంద్రవరమున నుండినట్లు చెప్పుటకు ఎట్టి యాధారములును

దొరకలేదు. కాని రాజమహేంద్రవరమున వెలనాటి చోళరాజుల ప్రాభవముతగ్గి రెడ్డిరాజులు అధిపతులగునట్టి సంధికాలమున అత్యల్పకాలము విశ్వేశ్వరభూపతి రాజమహేంద్రవరము నాక్రమించి యుండెనేమోయనునది చక్కఁగా పరిశోధించినగాని తేలదు. కవియు సందిగ్ధముగా రాజును 'ఆంధ్రేశ్వరాభిరాముఁడు' అనియు, 'ఆంధ్రభూపాగ్రగణ్యుఁడు' అనియు చెప్పి రాజమహేంద్రవర వర్ణనలో 'అట్టి రాజనరేంద్రుని యనుఁగు మనుమఁడు' అనెనేగాని అది రాజధానియని యనకపోవుట బాధకముగా నున్నది. రాజును కవియును వీరశైవు లగుదురో కారో తెలియదుగాని పరమశైవులుగా మాత్రము కనఁబడుచున్నారు.

ఈతఁడు శ్రీనాథునికి సమకాలికుఁడు, పెదకోమటి వేమారెడ్డి కొండవీటి రాజ్యమందు సుప్రతిష్ఠితుఁడై శ్రీనాథుఁడు విద్యాధికారియైన (క్రీ. శ. 1402) సంవత్సరముననే విశ్వేశ్వరభూపతి సర్వసిద్ధిలో చిత్రభానుసాక్షిగాఁగ రాచకదుపు నోడించినట్లు కుదురుచున్నది. అట్టి యీకవి ఎచ్చటను పూర్వకవిస్తుతి చేయఁడు. నన్నయ తిక్కన ఎఱ్ఱనలుగాని నాచన సోముఁడుగాని కానరారు. షష్ఠ్యంతరచనయు, అంకితకార్యమును, గ్రంథమందు సప్తసంతానప్రశంసయు శ్రవ్యకావ్యోత్కర్షయును కనఁబడుచున్నవి. తన గ్రంథము దేనికి అనువాదమో చెప్పక తనదొక 'పూర్వకల్పితశాస్త్రానుగతియైన' స్వతంత్రరచనయైనట్లు వ్యవహరించినాఁడు. అట్లే ఇది దేనికిని అనువాదమైనట్లు కనఁబడదు. ఈతనికి దాదాపొక యేబది అఱువది యేండ్లు ముందుండిన విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణమును, దండికావ్యాదర్శమును, మమ్మటాదుల గ్రంథములును తప్పక మూలములై యుండును. ఛందోవ్యాకరణాదిభాగములకు సంస్కృతేతరగ్రంథములే యాధారములై యుండును. అవెట్టివైనను ఆయావిషయములు ఈతనిచేతఁబడి వశ్యవాక్కైన యీతని స్వకీయాభిప్రాయములతో తయారైన గ్రంథమిది. తన ప్రభువున కంకితమిచ్చుచు ప్రతాపరుద్రీయము వలెనే అన్నిటికిని ప్రభువునే విషయముగాఁజేసి లక్ష్యములను వ్రాసి 'విద్యావిధిగానిపించినాఁడు.' చక్కని శయ్యాసౌభాగ్యముగల కవిత్వ మీతనిది.

ఒక విశేషమేమనఁగా నీతఁడు కవిత్రయాదిపూర్వకవి స్తుతిచేయకపోవుటయే గాక, ఇంత లక్షణగ్రంథము వ్రాయుచు నన్నయవ్రాసిన యాంధ్రమహాభారతమును గాని, తిక్కన ఎఱ్ఱనలవానినిగాని ప్రమాణముగాఁ జదువుకొండని విద్యార్థులను హెచ్చరింపలేదు.

'తెలుఁగు దేశభాష తెలియుటొ మ్మనఁబోక
తెలియవలయు మించు తేటపడఁగ.'

అనియు, చివర,

'ఇది తెనుఁగునకెల్లను జన
పదవిదితంబైన తెలుఁగుప ట్టించుక యె
ల్లిదముగఁ జెప్పితి నంతయు
మది నెఱుఁగుం డరపి బుద్ధిమంతు లితరముల్.' ౯-౧౭౨

అనిమాత్రము వ్రాసినాఁడు. ఒకానొక చోట 'కవిత్రయ' మను మాటను వాడినాఁడు.

'అప్పుపరమైన పట్టునఁ బ్రాణిపదము
కర్మమగుచోటఁ దక్కు నుకారయుక్తి
వాడుకొనరు చకారభావమున దాని
ననుచరింపుదురు కవిత్రయానుమతిని.' ౯-౫౮

కాని ఈపద్యమును దీనితోఁగలసి అంతకుముందువి మూఁడుపద్యములును ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి తాళపత్రప్రతిలో లేవు. దీనింబట్టి చూడఁగా అప్పకవి

'ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేదివచింపఁగా బడియె నెందునుదానినెకాని సూత్రసం
పాదనలేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిగూర్చి చెప్పఁగా
రాదని ద్రాక్షవాటికవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్.'

అని చెప్పిన దానిని

'ఆమూఁడు పర్వములలో
నామాన్యుఁడు నుడువు తెలుఁగు లరసికొనికృతుల్
దాము రచించిరి తిక్కను
ధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్.'

అన్నవ్రాతను శంకింపవలసియున్నది. ఈద్రాక్షవాటి కవిరాక్షసుఁడు వేములవాడ భీమనయే యగునేని శ్రీనాథుఁడు 'వచియింతు వేములవాడ భీమనభంగి' యని చెప్పుటచేత అతఁడు శ్రీనాథునికి అనఁగా విన్నకోట పెద్దనకు పూర్వుఁడుగా నేర్పడుచున్నాఁడు. అట్టి నియమమేదైన నుండినను ఈపెద్దన యేల చెప్పఁడు 'అరసి యంతయు నెఱుంగుఁడు' అని గదా చెప్పెను. ఇతరకారణములచేత నన్నయ యాంధ్రశబ్దచింతామణిని వ్రాయలేదనియు ఈయప్పకవి వాక్యము లసత్యములనియు శ్రీ వీరేశలింగముపంతులవారు వ్రాసియే యున్నారు,

విన్నకోట పెద్దనవలన నొక విషయము స్పష్టముగా తెలియుచున్నది. 'కావ్యకళాచతుష్టయము' 'అన్యోన్యముఖావలోకము' చేయకయుండెడిదనియు

అట్టి వాని నీతఁ 'డేకస్థలిం గలిగించె'ననియు, చూడఁగా తెలుఁగులో మొట్టమొదట ఛందశ్శాస్త్రము ఏర్పడినది; తర్వాత వ్యాకరణమును అటు వెనుక నలంకార కావ్య మీమాంసాదికములును. దొరకినంతవఱకు కవిజనాశ్రయము ప్రాచీనతమము. దొరకిన ప్రతులనుబట్టి రేచన భీమనలను తత్కర్తలనుగా గ్రహింపవలసియున్నది. ఈభీమన ఉద్దండకవియైన వేములవాడ భీమకవియో కాఁడో సందేహము. తిక్కనాదులు లక్షణకర్తలని అర్వాచీనులు చెప్పినను ప్రాచీనులైన కేతనాదులు చెప్పనందునవారు వ్రాయనట్లే. తెనుఁగుకవిత గుణగవిజయాదిత్యునినాటినుండియు కనఁబడుచున్నది. రేనాటిచోళులది వచనముమాత్రమే; మనకు ఛందోగ్రంథములు వ్రాయవలయునని తోఁచునాటికే ఒకపాటి సంప్రదాయము కుదిరిపోయినది—సంస్కృతకర్ణాటాదులలో లేనిది యతియొకటి. దీనింబట్టి ద్రావిడప్రభావము నిశ్చయము. సంస్కృతమున కాన రాని మన యతిప్రాసలలో కన్నడమందు ప్రాసముమాత్రముండి మనకు 'వళియుం బ్రాసము నంతకగ్గలములై' ఉండుట యేలనో పరిశోధింపవలసియున్నది. కీ. శే. శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుగారు కొంత పరిశోధించినారు. ఆమార్గమున ఆంధ్రకర్ణాటద్రావిడభాషా ఛందోరీతులను పోల్చి పఠించినగాని మన కవిత్వపరిణామము తెలియదు. గురుపరంపరాప్రాప్తమైన మన ఛందస్సు సంస్కృతప్రభావమున కొంతమాఱినను తన ప్రాచీననైజ ద్రావిడస్వరూపమును కోలుపోలేదు. అట్లే వ్యాకరణాదికమునగూడ. మనకు సంస్కృతసంబంధము మొదట తక్కువయని 'యంధ్రభాషయుఁ బ్రాకృతాన్వయమకాన' యనియు

'తెలుఁగుం బ్రాకృతభంగిన
బలియుటచే నేకవచన బహువచన పదం
బులెకాని ద్వివచనంబులు
గలుగవు దత్క్రియలఁ గారకంబులయందున్.' 9 - 72

అనియు పెద్దన వ్రాయుటచే తెలియుచున్నది. నన్నయ భారతము వ్రాయునాఁటికి మనకు ఛందోగ్రంథముగాని వ్యాకరణగ్రంథముగాని లేదు. తత్పూర్వముండిన సకలసంప్రదాయములకు ఒక నియమన మీ నన్నయచేఁ గావింపఁబడినందున నాతఁడు 'విపుల శబ్దశాసనుఁ'డైనాఁడు. తర్వాతిది రేచన కవిజనాశ్రయము. కేతన తెనుఁగు వ్యాకరణములేని కొఱఁతను తీర్చినాఁడుగాని ఛందోగ్రంథములేని కొఱఁతనుగాదు. ఇట్లు ఛందోవ్యాకరణాదులైనంతట రసభావాదులు కావలసి వచ్చినవి. అవియు క్రమముగా చూడామణియందు వెలసినవి. సంస్కృతమందును ఇవి వేర్వేఱు గ్రంథములుగానే గదా వెలసినవి. అన్నిటిని కలిపిన కావ్యాలంకారచూడామణివంటి పాఠ్యగ్రంథము గీర్వాణమునకూడ లేదు.

ఎంతసేపైనను గీర్వాణలక్షణగ్రంథములపై నాధారపడుటచే మనప్రాచీనుల దంతయు ననువాదవాఙ్మయమేయైనది. ప్రబంధయుగము వఱకును మనవారు స్వాతంత్ర్యము వహింపలేదు. అట్లె ప్రబంధముల పరిణామములకు సమకాలికముగా నేయున్నది మన వీధినాటకకళాపరిణామముకూడ. ఏలయన నాటకలక్షణము తెలుఁగుది నాటికి లేదుగదా. యక్షగానలక్షణముకూడ చూడామణియందు కానరాదు. తెనుఁగున సంస్కృతనాటకముల వంటివి లేవుగాన వాని లక్షణమును అనవసరమే యయ్యెను. మఱి యక్షగాన శబ్దము అటనట వాఙ్మయమందు కనఁబడుచున్నది గాని దానికింకను ఒక రూపేర్పడక యుండుటచే తల్లక్షణము వ్రాయుతలంపు కలుగలేదు. ఉదాహరణాది క్షుద్రకావ్యముల ప్రస్తావమున్నదిగాని వానికి కవ్యుదాహరణములే గాని వాఙ్మయమందు ప్రాచీనములు ఒకటిరెండేకలవు. బసవోదాహరణము పెద్దనకు ముందుదేగాని త్రిపురాంతకోదాహరణము విషయము సందేహాస్పదము, అది సమకాలికమగునేమో! క్షుద్రకావ్యములపై మనకు చక్కనివిమర్శనగ్రంథము వెలువడలేదు. అసలు పరిశోధనయే జరుగలేదు. కావ్యభేదములను చెప్పుచు ముక్తకాది చాటుప్రబంధములలో 'ఉదాహరణము' 'బిరుదావళి' మొదలైనవానిని చేర్చి వీనికి సంగీతముతోఁగల సంబంధమును తెలుపుటయే గాక 'సురభాషాది ప్రాకృతపరిభాషలైన నితరభాషలనైనన్ విరచించుట యుక్త ముదాహరణ మిలాసురముఖాదులగు పుణ్యులకున్' అనుటచేతను 'బిరుశబ్దంబు విరోధోత్కరము మహారాష్ట్రిభాష' యనుటచేతను వీనిని 'సుమనోభాషం బొలుపుగ నమరింపుఁడు కవులు ప్రాకృతాదులనైనన్' అని చెప్పుటచేతను, బిరుదావళికూడ ఉదాహరణమువలెనే సార్వవిభక్తికముగా నుండవలెనని అప్పకవి చెప్పుటచేతను-చూడఁగా, ఇది తెలుఁగు ప్రక్రియకాదనియు మనము ఎరవుతెచ్చుకొన్నదనియు స్పష్టపడుచున్నది. క్షుద్రకావ్యాదులంగూర్చి విద్యానాథుఁడు లఘువుగా వర్ణించియున్నాఁడు. అతనిసమకాలికుఁడు పాల్కురికి సోమనాథుఁడు. శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు వ్రాసిన యుదాహరణ వాఙ్మయ చరిత్ర ఈవిషయములను చక్కఁగా వివరింపలేదు. సరియైన చారిత్రకదృష్టియు లోఁతైన పరిశ్రమయు లేనందున వారిరచన పరిశోధకులకు నిరుపయోగముగా నున్నది. మహారాష్ట్రి ప్రాకృతవాఙ్మయముల పరిచయముతో ఈవిషయమై చక్కని పరిశోధనకు ఎంతేని అవకాశము కలదు. అట్టే యక్షగానమునకును. పెద్దలాలోచింతురు గాక.

15-3-1964
మదరాసు-1.

వేదము వేంకటరాయశాస్త్రి.

# విషయసూచిక



PRINTED BY

Vedam Venkataraya Sastry & Bros.,
VEDAM PRINTERS, MADRAS—1

శ్రీ

# కావ్యాలంకారచూడామణి

## ప్రథమోల్లాసము

### ఆశీస్సు

శ్లో. శ్రీవాగాస్పదయోః పరస్పరయుజోః శ్రుత్యుత్సవశ్లాఘయోః
రాగాలాప నిరూఢయో ర్యతి గణ వ్యాపార పారీణయోః
సారస్య ద్గిరిజేశయో రివ సదా సంగీతసాహిత్యయో
ర్విద్వద్విభ్రమహేతుకం విహరతాం చాళుక్యవిశ్వప్రభౌ. * ౧

### కృతిపతిప్రశంస

ఉ. పంకజముగా దొలంగి, తదుపాంత చరన్మధుప ప్రసక్తికిన్
గొంకి, ఝషాదిరూపములకున్ జనునాథుని వింతయక్కుపైఁ
†గింకిరి గాఁగ లచ్చి తిలకించి, యజస్రము నుండుఁగాత ని
శ్శంకఁ జళుక్యవిశ్వమనుజప్రభు పుణ్యకటాక్ష దృష్టులన్. ౨

చ. వరచతురాననప్రతిభ వాసికి నెక్కఁ, బదక్రమంబులన్
దిరుగుచు, నంగవిభ్రమము ధీముకురంబులఁ గానిపించుచున్,
సరసవచస్పవిత్రి యగుచామ యలంకృతులన్ దనర్చి సు
స్థిరతఁ జళుక్యవిశ్వనృపుచిత్తమునన్ బొలుపారు చుండెడున్. ౩

సీ. శ్రీకంఠచూడాగ్ర శృంగారకరణ మే రాజున కన్వయారంభగురుఁడు,
చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువర్ధను డేమహీశుతాతలకుఁ దాత,
భృతకుమా రారామభీముండు చాళుక్యభీముఁ డేనృపకులాబ్ధికి విధుండు,
రాజమహేంద్రపురస్థాత రాజనరేంద్రుఁ డెక్కువతాత యేవిభునకు,

---

* పా. భౌ. † కింకఱఁగాక.

తే. నంద్రదళదానవోపేంద్రుఁ డగు నుపేంద్ర
ధరణీవల్లభుఁ డేరాజు తండ్రితండ్రి
ఘనుఁ డుపేంద్రాఖ్యుఁ డెవ్వని గన్నతండ్రి
యతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబసుతుఁడు. ౪

శా. సర్వశ్రీఁ దనపేరివాఁ డగుటచే సంతుష్టచేతస్కుఁడై,
సర్వజ్ఞత్వము రాజశేఖరతయున్ శంభుత్వము న్విశ్వనా
థోర్వీభర్తకు విశ్వనాథుఁడు శివుం డోజించెఁ, గా కున్న నీ
దుర్వార ప్రతిభాతిభాగ్య శుభదస్తుత్యత్వముల్ గల్గునే. ౫

ఉ. అశ్రుత వైరివర్గుఁడు, [1] సమాశ్రిత భర్గుడు, దివ్యవాహినీ
విశ్రుతకీర్తి పుణ్యగుణవేషవిభూషితమూర్తి, మానసో
న్మిశ్రిత రాజనీతి, యథమీకృత భూవరభూతి, సర్వలో
కాశ్రయచక్రవర్తి, సమదారిచమూ సమవర్తి నూరతన్. ౬

సీ. లక్ష్మీధరిత్ర్యుపలాలన[2]ప్రౌఢిమ [3]రాజనారాయణప్రథ వహించి,
హవ్యకవ్యార్థనిత్యప్రదానవ్యాప్తి సర్వలోకాశ్రయక్షమతఁజెంది,
త్రస్తశస్తాఖిలోద్ధరణక్రియాసిద్ధి ధరణీవరాహ శబ్దమునఁ బేర్చి,
గర్వితారాతి విఖండనోదారతఁ గరవాలభైరవఖ్యాతి వడసి,

తే. కదనభీతులఁ బులుమేపి కాచి, రాయ
గండగోపాలబిరుదసంగతిఁ దనర్చి,
యవనిఁ బొగ డొందు బహువిజయప్రవర్తి
చారు చాళుక్య విశ్వేశ చక్రవర్తి. ౭

ఉ. ఎందుఁ జళుక్యవిశ్వధరణీశ్వరు రాయకరారిసాళువ
[4]స్పందన మొప్పఁ జెప్పు, బహుపక్షబలంబునఁ గ్రందుఁ జెంది మి

---

[1] పా. సమర్చిత. [2] ప్రౌఢిమ — 'ఈ పదమునకు ఇమనిచ్ఛ అసాధువని వామనసూత్రము; ఇది ఆంధ్ర ప్రబంధములం గనఁబడుచున్నది' ఆముక్త, పీఠిక 43. సంజీవని. [3] 'రాజనారాయణ, సర్వలోకాశ్రయ, ధరణీవరాహ, కరవాల భైరవ, రాయగండగోపాల' — ఇవి చాళుక్యుల బిరుదులు. [4] పా. స్పందన నొప్పఁజెప్ప బహుపక్షబలంబునఁ గ్రందుఁజెంది.

న్నుందిన రాజహంస నివహంబుల ‡బట్టి వధించి, సన్నుతిం
బొందిన ధార్తరాష్ట్రకుల పూగములన్ గయణించు రాజులన్. ౮

వ. మఱియును;

సీ. వేదశాస్త్రరహస్య విధులెల్లఁ బరికించి, §సవిఁ జతుర్వర్గప్రశస్తి నొంది,
రాజవిద్యాతంత్రరక్తి సంభావించి, వర్ణక్రమంబుల వల నెఱింగి,
జ్యోతిషాయుర్వేద సంగతి నెగడొంది, సంగీత సాహిత్యసరణి నేర్చి,
తురగేభ రోహణాదుల విశ్రుతికి నెక్కి, యాయుధవిద్యల సతిశయిల్లి,

తే. యచట నచ్చట నున్న కావ్యాగమములఁ,
జెలఁగి సత్కవి సౌకర్యసిద్ధికొఱకు
నొక్కచోటనె యొడఁగూర్ప నుత్సహించి,
*సత్కళావర్తి విశ్వేశచక్రవర్తి. ౯

మ. ననుఁ గావ్యక్రమవేది, నచ్చితబుధానందావలోకితున్,
మనితశ్రీగిరిజేశపాదయుగళున్, మాన్యున్, గళాకౌశలున్,
వినుతున్, గౌశికగోత్రుఁ, బెద్దన సుధీవిఖ్యాతు, రావించి, స
ద్వినయం బొప్పఁగ నాదరించి, తగ నావిశ్వేశ్వరుం డిట్లనున్. ౧౦

ఉ. “భావరసప్రపంచమునఁ బర్వ నలంకృతి లక్షణంబు, ఛం
దోవిచిత్రప్రచారము, గుతూహల దస్ఫుర దంధ్రదేశభా
షావివిధ ప్రసంగముల చందము, నందముగా నొనర్చి వి
ద్యావిధి గానిపించుటగదా చతురత్వ మనంగ మేదినిన్.” ౧౧

క. అను నవ్విశ్వేశ్వరవిభు
ననుమతియను నూత్నపోత మాధారముగా,
ఘన రస రత్నాకరమునఁ
†గనుఁగొని యొడఁగూర్చి యిత్తుఁ గబ్బపుమణులన్. ౧౨

---

‡ గిట్టివధించు. § సరి. * కొన్నింట నీపాదము గీతములో మొదటిదిగా నున్నది. † కనిగొని.

ష ష్ఠ్యం త ము లు

క. లక్ష్మీపుత్త్రునకు, సుపేం
ద్రక్ష్మావరనందనునకు, ధర్మజ్ఞునకుఁ,
లక్ష్మవిభేదనలాఘవ
లక్ష్మణునకు, సర్వశాస్త్రలంపటమతికిఁ. ౧౩

క, సింధురసత్త్వునకు, మరు
త్సింధు రస క్రీడ దహిత తృప్తికరునకుఁ,
బంధుర శుభానుభవునకు
బంధురమావృద్ధికరణ బహువిభవునకుఁ. ౧౪

క. చాళుక్యవిశ్వధరణీ
పాలునకు, నమ న్నృపాల పరిపాలునకుఁ,
శ్రీలునకు, సమరవిజయ
శ్రీలల నాశ్లేషసౌఖ్యశీలున కెపుడుఁ. ౧౫

వ. అభ్యుదయ పరంపరల కకంపితస్థితి యావహిల్లునట్టుగా, మద్విరచనీయం
బగు కావ్యాలంకారచూడామణి యను నలంకార లక్షణంబునకుఁ
బ్రథమావతరణం బెట్టిదనిన: ౧౬

భా వ ప్ర క ర ణ ము

చ. సరళవిరాజదుచ్చరణశస్తము వర్ణము, వర్ణపంక్తివి
స్తరము పదంబు, తత్పదవితానము వాక్యము, వాక్యభేదసుం
దరతర మర్ధ, మర్థ[1]ఘనతత్త్వవిబుద్ధము భావ, మట్టి భా
వ రుచిర సుప్రసన్న విభవంబు రసం, బొడఁ గూర్ప నేర్చినఁ. ౧౭

భా వ ము

క. బహిరర్థాలంబనమై
విహరించు మనోవికార విలసితము సుమీ
విహితమగు భావమన; నది
మహివిజ్ఞానంబునా సుమతులం బరగుఁ. ౧౮

---

పా. 1. వళత త్త్వ.

క. ఘనవిజ్ఞానం బాత్మకు
మనసుననే కలుగు, నట్టిమనసున కబ్బుఁ
గనదింద్రియములచేతఁ
[1]వినఁగా వీనులకు నొదవు విషయప్రాప్తిఁ. ౧౯

భా వ భే ద ము లు 4

తే. అట్టి విజ్ఞానకలితమై [2]యమరుభావ
మాత్మఁ బ్రవ్యక్తమై (అ) విభా (ఆ) వానుభావ
(ఇ) సాత్త్విక (ఈ) వ్యభిచారి సంజ్ఞలఁ [3]దనర్చు
నాల్గుతెఱఁగుల రసనిదానం[4]బు గాఁగ. ౨౦

క. నవరసవిస్ఫుటకరణ
ప్రవణము లగు [5]నుచితరుచివిభావము లెల్లఁ
వివిధ స్త్రీపురుషులయం
దవిరళముగఁ బొడముఁ దెలియ [6]నగును గవీంద్రుల్. ౨౧

(అ) వి భా వ ము లు 2

ఆ. అవ్విభావ మొప్పు(1)నాలంబనంబు (2)ను
ద్దీపనంబు నాఁగ ద్వివిధ మగుచు
నిఖిల రస విబోధ నిర్మాణ కరణంబు
లిత్తెఱంగు లెల్ల నెఱుఁగ వలయు, ౨౨

(1) ఆ లం బ న వి భా వ ము

క. ఆలంబనంబు నాఁగ ర
సాలంబన మైనరూపయౌవనకాంతి
శ్రీలావణ్యాదిక; మది
మూలము తద్వ్యక్తికిఁ బ్రమోదప్రదమై. ౨౩

---

1. విను తేంద్రియములకు. 2. యలరు. 3. దనర్చి. 4. బనాఁగ, బునాఁగ. 5. నుచితరచిత. 6. నగుసుకవీంద్రుల్.

ఉ దా హ ర ణ ము

చ. నెలవుల నిండుచున్న(గవ నిక్కను, గామునితూపు కై వడి౯
వెలి(గెడు రూపవిభ్రమము, విద్యుదుదారత( దేజరిల్లు( జూ
పులజిగి సొంపు వెట్టనివిభూషణ మై మెయి నంతకంతకు౯
బలియు(, జళుక్యవిశ్వ*జనపాలునిమన్నన( గన్న యింతికి౯. ౨౪

(2) ఉ ద్దీ ప న వి భా వ ము లు 4

క. చలియింపక రస మింపుల
వొలయుచు నెవ్వానిచేత నుద్దీపించు౯
గల(గొన బుధులకు నవి యి
మ్ముల నుద్దీపనవిభావములు నా( బర(గు౯. ౨౫

క. (1)ఆలంబనో క్త గుణములు
(2)నాలంబన చేష్టితములు (3)హారాలంకా
రాళియు (4)నుత్సవలీలలు
నోలి౯ జంతురాహ్వయంబు లుద్దీపనముల్. ౨౬

సీ. (1)రూప లావణ్య తారుణ్యాది శారీర
గుణము లాలంబనగుణము లరయ.
(2)నంగ నోచిత భావ హావ హే లాది విం
శతియు( జేష్టితము లై సంచరించు.
(3)హార కేయూర మంజీర కంకణ కంఠి
కాదు లలంకరణాఖ్య( జెందు,
(4)నుపవన జల చంద్రి కోత్స వా ర్తవ లీల
లాత్మ విహారంబు లన(గ( బర(గు;

తే. నిట్టి యుద్దీపన విభావ హిత వినోద
విభవముల( బొందు( జాళుక్యవిశ్వవిభు(డు,
అలరువిల్తుని భంగి, జయంతు లీల,
భద్రు చందమున, నలకూబరుని పగిది. ౨౭

---

పా. * నరపాలుని.

### (అ) అనుభావము

శా. భ్రూతారానన రాగ దృగ్విలసనంబుల్, పాణిపాదాంగవా
క్చాతుర్యంబును, నోష్ఠకంపనము నాఁగం, బేర్చు చేష్టాసము
ద్భూతం బై యనుభూత మై రసము సొంపున్ జెందుటన్ జేపి, వి
ఖ్యాతం బై యనుభావ మొప్పు లలితవ్యక్తాకృతిన్ దోఁచుచున్. ౨౮

చ. వదనవికాసమున్ బొలయు వాలికచూపులు, లేఁతనిగ్గుతోఁ
బొదరెడితారకల్, బొమల పొల్పగుపోకలు, మోవికెంపుపైఁ
గదిరెడిచిన్ని నవ్వు, చెలికత్తెల కందము సేయుమాటలున్.
సుదతి చళుక్యవిశ్వనృపసుందరుఁ జెందుటఁ *జెప్పు నొప్పుగన్, ౨౯

### (ఇ) సాత్త్విక భావములు 8

తే. సత్త్వ మన మనోవృత్తి; తజ్జంబు లైన
భావములు సాత్త్వికము లష్టభావితములు -
[1]స్తంభ [2]రోమాంచ [3]బాష్ప [4]వైస్వర్య [5]కంప
[6]విలయ [7]వైవర్ణ్య [8]ఘర్మ సంజ్ఞలఁ దనర్చు. ౩౦

### 1 స్తంభము

క. మే నెఱుఁగ కున్నయునికిన
నానాభయ హర్ష దర్శన శ్రవణములన్
మ్రానువడి యునికి చేష్టా
హీన స్తంభంబు నాఁగ నెఱుఁగఁగ వలయున్. ౩౧

క. చాళుక్యవిభుని ఖేల
త్కోలధ్వజపటముఁ జూచి, క్రొవ్వటి, యని ను
త్తాల స్తంభస్థితికి
న్వాలుపడున్ బగఱ, సాలభంజిక పోలెన్. ౩౨

### 2 రోమాంచము

క. ఆనందాతిశయంబునఁ
గానఁబడుట రోమహర్షకల్పనము సుమీ,

---

పా. * జెప్ప నొప్పగున్.

మానితరోమాంచం బనఁ
గా నిష్టస్పర్శన ప్రకాశనవిధులఁ. ౩౩

క. మనమున విశ్వేశ్వరు నిడి
కొని, గాఢాలింగనములఁ గొఱలెడిచోటఁ,
దనువునఁ బొడమెడిపులకలు
వనితకు రాగాంకురముల వడువున నొప్పుఁ. ౩౪

3 అ శ్రు వు

క. అతిదుఃఖ హర్షణాదులఁ
బ్రతిపాదిత మైన నేత్రపాథఃకణసం
హతి యశ్రు వండ్రు, నఖముఖ
కృతమార్జనవిధులు దానిక్రియ లరయంగఁ. ౩౫

క. ఆలములో విశ్వేశనృ
పాలునికరవాలు మెఱయఁ బరనృపవనితా
లోలనయనాంబుదంబులు
వాలాయము గురియు నశ్రువర్షం బోలిఁ. ౩౬

4 వై స్వ ర్య ము

క. భయ రోష హర్ష ణాదుల
నియతంబగు గద్గదధ్వనితం బది ని
శ్చయముగ వైస్వర్యం బగు
రయవాగుచ్చరణసరణి రభసం బగుటఁ. ౩౭

క. రాగముగ నలుకఁ దేర్పఁగ
నాగతుఁ డగువిశ్వవిభుని యాలోకముచే
రాగాలాపక్రమము వి
రాగాలాపక్రమముగ రమణి కలంగెఁ. ౩౮

5 కం ప ము

క. ఆకస్మికభయ దయితా
లోకన హర్షాది రుజలు లో నగుదానఁ

జేకూఱుఁ గంప మంగ
వ్యాకుల చలనాది నెఱుఁగవచ్చుం దెలియన్. ౩౯

క. మృదులతర చంద్రహాసము
గదలించు చళుక్యవిభునిఁ గని భీరువు లై
మదవిమతులు వదవద వణఁ
కుదు, రాతఁ డుపేంద్రపుత్త్రికుఁడు గానఁ జుమీ. ౪౦

### 6 ప్ర ళ య ము

క. ప్రళయము నా సుఖదుఃఖా
దుల నింద్రియమూర్ఛనంబు *దొఱఁగుట; దానిన్
దెలియునది భూమిపతన
స్ఖలితాకారములచేతఁ గనుగొని చతురుల్. ౪౧

క. ఇమ్మహి నుపేంద్రపుత్త్రుఁడు
సమ్మోహనమూర్తి యగుట సత్యం, బతనిన్
నెమ్మిఁ గనుగొన్న యింతికి
నెమ్మది మూర్ఛిల్లి మేను నిలువక సడలున్. ౪౨

### 7 వై వ ర్ణ్య ము

క. మద రోష విషా దాదులఁ
గదిరెడు సహజాంగరుచివికల్పమునకుఁ బే
రొదవును వైవర్ణ్యం బన,
నది వర్ణవ్యత్యయమున నగుఁ దెలియంగన్. ౪౩

క. సారమతి విశ్వనృపతిని
గోరిన సమకూఱ కున్నె కోర్కులు ధరణిన్ ?
గౌరయశస్స్మరణంబున
సారూప్యపదంబు గలిగెఁ జామకు నొడలన్. ౪౪

---

పా. * దొడరుట.

### 8 స్వేదము

క. దయితాలింగన సురత
ప్రయాసకలనములఁ జెమరు వాటిల్లు మిథః
ప్రియదంపతులకు, నది గా
త్రయుతార్ద్రిత్వమునఁ దెలియఁ దగుఁ జతురులకున్. ౪౧

క. ఇల విశ్వనృపతిచంద్రుని
లలితకరస్పర్శనములఁ లలన గరంగెన్
దలపోయ దీనియొడ లి
మ్ముల నలవిధి చంద్రకాంతమునఁ జేసెఁ జుమీ. ౪౨

### (ఈ) సంచారిభావములు 33

తే. స్థాయిభావంబునందు నిత్యత్వ ముడిగి
వ్యభిచరించుచు నబ్ధిభంగాళివోలె
నోలిఁ బొడముచు నడఁగుచు నుంటఁజేసి
యెసఁగు సంచారిభావంబు లెఱుఁగవలయు. ౪౩

సీ. 1 గ్లాని 2 నిర్వేద 3 శంకా 4 మ 5 దాసూయలు
6 నాలస్య 7 దైన్య 8 శ్రమాహ్వాయములు
9 స్మృతి, 10 మోహ 11 చపలతా 12 చింతలును 13 విషాద
14 సుప్తి 15 విబోధ 16 కౌత్సుక్యములును
17 నావేగ 18 గర్వ 19 హ 20 ర్షామర్ష 21 నిద్రలు
22 మ 23 త్యపస్మార 24 కోన్మాదములును
25 త్రా 26 సోగత్రా 27 జడతా 28 వితర్కాంబులు
29 నవహిత్థ 30 ధృతి 31 మరణాభిధములు

తే. 32 వ్యాధియును 33 వ్రీడయును నన వరుసఁ గృతుల
సాగు ముప్పదిమూఁడు సంచారిభావ
చయము, వాని నెఱుంగక జరుగ దంద్రు
రసవివేచన చాతుర్య రంజనంబు. ౪౪

## 1 గ్లాని

క. మానస మెరియఁగ మేనికి
నానాదౌర్బల్య కారణంబై, యొంటన్
మానని పశ్చాత్తాపము
గ్లాని యనఁగఁ బరఁగుఁ సుకవి కల్పనవిధులన్. ౨౯

క. శ్రీకరుఁ డగు విశ్వేశ్వరు,
భీకర ధరణీవరాహ బిరుద భరాత్మున్,
జేకొని మది ధరియించిన
యీకోమలిక్లేశ ముడుప నింతుల తరమే? ౩౦

## 2 శంక

క. ఇదియును నదియును నట్లయి
యొదవెడునొకొ యనఁగఁ బొడము నూహాపోహా
స్పద మై చనుననుమానము
మది శంక యనంగ బుద్ధిమంతుల కెక్కున్. ౩౧

క. స్తనితము, తత్ప్రతినినదము,
విని ధాటీపటహనాదవిభ్రాంతి మెయిన్
వెనుకకు ముందఱిదెసకును
జన శంకింపుదురు విశ్వజనపతిశత్రుల్. ౩౨

## 3 నిర్వేదము

క. దుర్విఫలత నీర్ష్యాదుల
దుర్వారప్రతిభ గలిగి తోఁపమి మొదలై
పర్వెడుచిత్తవ్యథచే
నిర్వేదం బొదవు సోష్మనిశ్వసనంబై. ౩౩

క. ఈనోములేల నోమఁగ?
నీ నవశిశిరోపచార మేటికి? నెలఁతన్
మానుప విశ్వేశ్వరుఁడే;
నానాఁటికి మనుప రాజనారాయణుఁడే. ౩౪

4 మ ద ము

క. మదిరాకృత మోహము సం
పదుదితహర్షము గళాదిపాటవమును స
మ్మదమున కుదయింపఁగ నా
స్పదములు దెలియంగవలయు భావజ్ఞులిలన్. ౩౫

క. కించిత్కంప దవిద్యో
దంచిత మదిరా మదావిలాత్మల నేర్పల్
మించుఁ బెఱరాచకొలువుల
నించునె విశ్వేశమేది నీశ్వరు సభలోన్? ౩౬

5 అ సూ య

క. పరబల మద విద్యా సం
దరతలకు సహింపలేక తఱు చగుదోషా
చరణము గల్పించుటపే
రరయ నసూయాభిధానమై నెగ డొందున్. ౩౭

క. ఈమహి విశ్వేశ్వరుచే
శ్రీమహిమన్ గన్నకవిగరిష్ఠు లసూయల్
వేమఱు భావింతురు చిం
తామణి సురధేను కల్పతరువులతోడన్. ౩౮

6 ఆ ల స్య ము

క. పొందుగ నిజకృత్యంబుల
మందోద్యోగంబు చేసి మసలుటయ కదా
యెందును నాలస్యం, బీ
చందం బతి ప్రీతినెఱుఁగజనుఁ జతురులకున్. ౩౯

క. చాళుక్యవిశ్వవిభుతో
నాలమునకుఁ గడఁగువిమతు లలసు లగుటయున్;
జాలఁగ వన్నెలు వెట్టక
యాలస్యము చేసి రచట నమరాంగనలున్. ౪౦

### 7 దైన్యము

క. విపదాప్తి విత్తహరణ
స్వపతినిరాకృతుల నుద్భవంబయ్యెడు త
త్కృపణత్వము దైన్యంబగుఁ
గృప కాస్పదమగుచుఁ జూడఁ గృతపుణ్యులచేన్. ౬౧

క. పరగండభైరవుని యు
ద్ధురధాటీపటుత యెట్టిదో! రిపుభూభృ
త్పుర మాపురంధ్రిముఖముల
సరి నొక్కట దైన్య మంద్రు జను లరయంగన్, ౬౨

### 8 శ్రమము

క. సురతక్లేశాయాసా
తురనిర్గమనాదికములఁ దోతెంచు శ్రమం;
బరసి తెలియంగవలయును
దరళశ్వాసాది ఘర్మతనువిదళనలన్. ౬౩

క. అడవులకై యద్రులకై
యడుగడుగున నలఁత వొడమ నడలుచుఁ జని రీ
పడఁతుకలు పతులు మనుగడ
నడరఁగ గరవాలభైరవార్చులు సేయన్. ౬౪

### 9 స్మృతి

క. అమరఁ బురాకృతసుఖదుః
ఖములం దలపోసి పోసి, కనుఁగొనుటకు నై
నమితోన్నమితాననముగ
నెమకుట సంస్మృతి యనంగ నెలకొనుఁ దలఁపన్. ౬౫

ఉ. "ఈ సురచాపదీప్తులకు నీడు సుమీ మన సాలరత్న వి
న్యాసము, లీ తటిల్లతలయచ్చు గదా మన లాపికాతనూ
ల్లాసము, లీ ఘనోపలములం దెగడున్ మన మౌక్తికావళీ
భాసము," లంచు విశ్వజనపాలవిరోధి దలంచుఁ గానలన్. ౬౬

10 మో హ ము

క. భయ దుఃఖావేశ మహా
మయచింతనవిదుల మెఱయ మలఁగొను మూర్ఛో
దయ మది మోహం బనఁజను
నయుక్త మవివేకవరణి నగుఁ దెలియంగన్. ౬౭

ఉ. అద్దముఁ జూచి బి ట్టులుకు, నానతిఁ జేసిన సంచలించు, న
మ్ముద్దియ విశ్వనాథుపయి ముచ్చట చేసినయంతనుండి; యి
క్కద్ది నెఱింగి చందురునిఁ గానఁగ నీరు, పికంబు గూయ న
న్నిద్దపుమ్రోఁత మాన్పుదురు, నెచ్చెలు లిచ్చ యెఱింగి నిచ్చలున్. ౬౮

11 చ ప ల త

క. రాగ ద్వే షాదులచే
సాగెడు చంచలతపేరు చపలత, నిజనా
థాగోవిస్ఫురిత వికా
రాగతి నెఱుఁగంగవలయు నంద్రు రసజ్ఞుల్. ౬౯

ఉ. నెయ్యపుఁబోటి మున్ను చెవి నించినవార్త లెఱుంగకున్న యీ
తొయ్యలి విశ్వభూవిభుని దూరమునం గని రాగసక్తయై
తియ్యపునవ్వు వాతెఱకుఁ దెచ్చె, వడి గ్గుచమండలంబుపై
బయ్యెద చక్కఁ జేర్చెఁ, బొలపంబు నమర్చెఁ గటాక్షవీక్షలన్. ౭౦

12 చిం త

క. తనరు ననిష్టాగమనం
బున నగు తలపోఁతపేరు వో చింత యనన్;
మనసున నెలకొనుదానిన్
గనునది సంతాపహేతుక ధ్యానమునన్. ౭౧

చ. తిరముగ విశ్వభూవిభుఁడు దేర్చినఁ దేరక క్రోచి, పిమ్మటన్
దరుణి తదీశుతో వెస ముదంబునఁ జన్నమనంబుఁద్రిప్పఁగా
వెర వఱి చింతనొందు, పృథివీతల మూరక వ్రాయు, బోటులన్
బరువడిఁ జూచి సిగ్గుపడుఁ, బాయనిధీరత దూరు బుద్ధిలోన్. ౭౨

## 13 విషాదము

క. అబ్బెం దగులాభ మని మది
నుబ్బెడుచో నంతరాయ మొనఁగూడుటయున్
ద్రబ్బికొను వెఱగుపా టది
నిబ్బరపువిషాద మనఁగ నెగడుం జూడన్. ౨౩

క. 'ఇనుఁ డరిగెఁ, దిమిర మదె కను
కని పర్వెడు, విశ్వనాథుకడ కేఁగెద నే'
నని యొకమానిని దలఁపఁగ,
ఘనకరములు నిగుడ ధవళకరుఁ డుదయించెన్. ౨౪

## 14 సుప్తి

క. లీనేంద్రియ మై విషయ
ధ్యానంబునఁ గొఱలునంతరంగములోనన్
గానఁబడు కలల కెల్ల ని
దానం బగు సుప్తి దానిఁ దగు దెలియంగన్. ౨౫

క. నుత్యచరిత విశ్వేశ్వర
కృత్యము సంకల్పసుప్రకీర్ణ ము నగుసా
హిత్యమును మరగి సుప్తికి
నిత్యత్వము గలుగఁ గోరు నెలఁతుక యెపుడున్. ౨౬

## 15 బోధము

క. ఇంద్రియములు చిత్తమున క
తంద్రత లో నగుటఁ జెప్పఁ దగు బోధముగా,
రుంద్రవికారవిలోచన
సాంద్రవికారముల నెఱుఁగఁ జను దజ్జ్ఞులకున్. ౨౭

క. విశ్వేశ్వరుండు పాలిత
విశ్వంభరుఁ, డనుచు బుధులు వేదప్రముఖా
నశ్వరవిద్యలయందున్
శశ్వత్పరిబోధసిద్ధిఁ జాటిరి జగతిన్. ౨౮

16 ఔత్సుక్యము

క. గురుబంధు ప్రియ ధరణీ
వర వనితాలోకనాది వాంఛలచేతన్
బరు వగు నౌత్సుక్యము త
త్పరత విలంబమునఁ గానవచ్చున్ దెలియన్. ౭౯

క. ధరణీవరాహలక్ష్మణుఁ
డరిలక్ష్మి వహింప వచ్చునప్పుడు నగరీ
తరుణులు తొడవులు వీడ్వడఁ
బొరిఁదొడిగెడు కౌతుకంబు పొల్పగుఁజూడన్. ౮౦

17 ఆవేగము

క. అమిత విచిత్రాలోకన
సమయంబుల సంభ్రమించుసంభ్రమ మావే
గము నాఁబడు; ననుచిత ని
ర్గమనస్థలనాదికములఁ గనుఁగొనవలయున్, ౮౧

క. సొబగారు విశ్వభూవరు
ప్రబలజయశ్రీలఁ జూడఁ బఱతెంచు తఱిన్
గబరీకుచజఘనంబుల
నిబిడత నసియాడెఁ బురమునెలఁతల నడుముల్. ౮౨

18 గర్వము

క. రిపు తర్జన వాచాటము,
విపులాత్మోత్కర్ష కథనవికటము, రణలో
లుపమును నగుభుజదర్పము
నిపుణులు గర్వం బనంగ నెగడుచునుండున్. ౮౩

క. బాణకళాగర్వమునఁ గృ
పాణాహంకారగరిమఁ బాటియె సమర
శ్రేణీవిహరణవికట
క్షోణీశులు రాయగండగోపాలునకున్, ౮౪

## 19 హ ర్ష ము

క. దయితాలోకన విభవో
దయ కదన స్తుతులవలనఁ దగ నుదయించున్
బ్రియుతముదము హర్షం, బం
గయుతప్రస్వేదపులకకలితం బగుచున్. ౮౫

క. కరవాలభైరవాంకుని
కరవాలభుజంగి పోరఁ గడు హర్షించున్
బరువడిఁ బరభూపాలక
సరసప్రాణానిలముల సరిఁ జవిఁ గొనుచున్. ౮౬

## 20 అ మ ర్ష ము

క. అపరాధులపై మనమునఁ
గుపితాత్మున కుద్భవించుకోప మమర్షం,
బుపగతమత్సరపాప
వ్యపదేశంబులను నెఱుఁగ నగుఁ జతురులకున్. ౮౭

క. పరబలములఁ గనుఁగొని, జము
కరణిం గనుఁగొనల నగ్నికణము లురులు, నీ
పరగండభైరవుని భట
వరుల యమర్షంబు పొగడవశమే పోరన్. ౮౮

## 21 ని ద్ర

క. అలవున నలసత సురతా
కులతన్ బ్రణయోపపన్నకోపాదులచే
నలవడు నిద్దుర, యది యి
మ్ముల ముకుళిత నయనమాత్రమున నెఱుఁగఁబడున్. ౮౯

చ. చెలువ చళుక్య విశ్వనృపుచే మరుతూపుల నెల్ల గెల్చి, యొ
ప్పుల సుఖనిద్ర సేయుతఱి; బోఁటులచూపుల కిం పొనర్చె, న
య్యలికముమీఁద గ్రాలు నలకాళియుఁ దిన్ననియూర్పుతావికిన్
జెలఁగెడుతేం ట్లనన్ జెలిమి సేయుచుఁ గొందొకసేపు శయ్యపై. ౯౦

22 మ తి

క. సహజార్థ తత్త్వసంశయ
మహితవినిర్వహణశక్తి మతి యనఁ బరఁగున్,
ముహురుద్భూత ప్రతిభా
విహరణమున నెఱుఁగఁ దగు, వివేకప్రౌఢిన్. ౯౧

ఉ. పాయక కొల్చువారల సుపర్వులఁ జేయుట, వైరులం బలో
పాయ సుదర్శనాంచల విభగ్నులఁ జేయుట, నుర్వి రాజనా
రాయణుఁ డంట నిశ్చయము, యంచు సుధీంద్రులు విశ్వమేదినీ
నాయకు సత్ప్రభావకథనంబు మహిన్ బచరింతు రెప్పుడున్. ౯౨

23 అ ప స్మా ర ము

క. భూతావేశ క్లమ మో
హాతుర వికృతులఁ దనర్చి, యాత్మలయందు
ద్భూత మగు నపస్మారము;
చేతోగతి నెఱుఁగవలయుఁ జేష్టాదులచేన్. ౯౩

క. భేరీరావంబులు విని
వైరులు కలవాలభైరవభ్రాంతి నప
స్మారులగతిఁ బొగలుచుఁ దల
చీర లెఱుంగరు భయోపచితి యెట్టిదియో. ౯౪

24 ఉ న్మా ద ము

క. చిత్తప్రియ వనితాహృతిఁ
జిత్తోద్రేకమునఁ గలుగుఁ బృథులోన్మాదం,
బిత్తెఱఁ గెఱుఁగుఁడు దుల్యా
యత్తాచేతన సచేతనాదులయందున్. ౯౫

మ. హరిణశ్రేణిఁ దురంగమప్రతతిగా నర్పించి, మేఘంబులన్
గరులన్ జేసి, ద్రుమంబులన్ భటులఁగాఁ గల్పించి, పోరాటకున్
దిరుగన్ జాతురు భ్రాంతులై తఱుచు ధాత్రీ పాలు రున్మాదతా
తరబుద్ధిన్ బరగండభైరవునితోఁ దత్తత్ప్రదేశంబులన్. ౯౬

25 త్రాసము

క. చిత్తమున నున్నయునికిన
హత్తెడుభయకలన త్రాస మనఁ జనుఁ; గ్రూరో
ద్వృత్త నృప దర్శనాది ని
మిత్తంబులఁ బుట్టు నెఱిఁగి మెలఁగఁగవలయున్. ౯౭

క. ధర జీవ రాహు భేరీ
విరావ మాలించి, వైరివీరులు వికృతా
తురులై, సాగర గిరి సరి
దరణ్య దుర్గ స్థలముల కరుగుదు రోలిన్. ౯౮

26 ఉగ్రత

క. దండించుచోట నుండెడు
చండతపే రుగ్రతాఖ్యఁ, జనుఁ దెలియంగా;
ఖండన తాడన తర్జన
తుండనములచేత నెఱుఁగుదురు భావజ్ఞుల్. ౯౯

క. 'మ్రొక్కఁడు, బిరుదము లుడిగియు
మ్రక్కం; డటు సేయకున్న మనుజపతుల కా
యక్కజ మగువిశ్వేశ్వరు
దృక్కులఁ గమరిపోక ద్రిమ్మర వశమే.' ౧౦౦

27 జడత

క. జడత యది కడు ముదంబునఁ
బడు నిష్టానిష్ట కర్మభంజనములచో
నడరెడు భయ మోదాదులు
దొడరెడునెడఁ బనులవరుసఁ దోఁపింపనిదై. ౧౦౧

క. ప్రణయమున రాజనారా
యణుఁ *డతిశౌర్యముగఁ జేయునాదరణ శుభ

---

పా. * డతిశయితముగ

క్షణతృప్తి నఖిలనృపతులు
ప్రణతిప్రణుతులకుఁ జొరరు పరమోత్సుకులై. ౧౦౨

28 వితర్కము

క. గుణగణవిగుణోత్కర్షణ
గణన వితర్కంబు; దానిఁ గనుఁగొనఁ దగు నై
పుణమునఁ జతురులు తత్కా
రణకార్యవిభేదబుద్ధి రసికతచేతన్. ౧౦౩

క. శ్రీవిశ్వవిభుఁడు చేసిన
యావెరగుల కలుగవలయు, నలిగినపిదపన్
భావింప నతఁడు ధీరుఁడు
వావిరి నసుఁదేర్పఁ దతనువడిఁ బడవలయున్. ౧౦౪

29 అవహిత్థ

క. కడు హర్షంబున, మదిలో
నడరెడు ననురాగ మొప్ప నణఁచెడువెరవ
ప్పడఁతికి నవహిత్థ యనం
బడు, నాత్మవిచేష్టితములు పరికింపంగన్. ౧౦౫

క. అవిరళముగ విశ్వమహీ
ధవుగుణములు పొగడుచోటఁ, దద్గత మతియై
చెవిఁబెట్టుచు నొకముద్దియ
చవిచదువులుగఱపెఁ గీరశాబంబులకున్. ౧౦౬

30 ధృతి

క. ఎట్టిపదార్థము లబ్బిన,
నొట్టిడిన ట్లంట నోప నొల్లక, మదిలో
గట్టి యగు దిట్టతన మది
యిట్టలముగ ధృతియనంగ నెందునుఁ బరఁగున్. ౧౦౭

క. చాళుక్యవిశ్వవిభుచే
శ్రీలన్ దనరారుబుధులు చేకొన రవపీ

పాలాసీతపటీరదు
కూలాగురుచంద్రగంధకోటుల నైనన్. ౧౦౮

31 మ ర ణ ము

క. గర ళానల రో గాయుధ
విరహాదులవలన నగు వివేకింపంగా
మరణము, నయననిమీలన
విరళశ్వాసాంగవర్ణ విధిఁ దెలియ నగున్. ౧౦౯

క. కలవాలభైరవుని యని
నరి చావక చచ్చినట్లు యటు పడియుండెన్
పొరి నూర్పు లణఁచి తెప్పలు
మరలింపక గాజువాటి ప్రాన్పడి భీతిన్. ౧౧౦

32 వ్యా ధి

క. జ్వరమున నైనను విరహ
జ్వరమున నైనను దనర్చు సంతాపము వి
స్ఫురితవ్యాధి యనంబడు;
శరీరపాదాది విధులఁ జనుఁ దెలియంగన్. ౧౧౧

క. కేలెరియు నొడలుదడివినఁ
గోలంబము లూర్పులౌశిఖుల మండిపడున్,
చాళుక్యవిభునిఁ జూచిన
బాలికపరితాప మెన్నఁ బని లే దింకన్. ౧౧౨

33 వ్రీ డ

క. మెయిచెలువులు పరికించుచు
దయితునిఁ గట్టెదురఁ జూచి తలవంచిన ము
ద్దియసొబగు వ్రీడ, యెఱుఁగుఁడు
నయనచ్ఛదలీనదర్శన ప్రసరములన్. ౧౧౩

ఉ. వేడుక విశ్వనాథపృథివీవరసుందరు బిట్టు చూచి తో
డ్తోడన సిగ్గు డగ్గఱుడుఁ, దొంగలితెప్పలకప్పులోనఁ జి

ట్టాడెడుచూడ్కు-లొప్పెఁ గుసుమాయుధ తూణముఖంబునందు నా
టాడెడుపువ్వుఁదూపు లన నంగనకుం దరళంపుఁజాయలన్. ౧౧౪

స్థా యి భా వ ము లు ౯

తే. ఆత్మసంభావిత విభావ కానుభావ
సాత్త్విక వ్యభిచారి సంజ్ఞల దనర్చు
భావములచేత సువ్యక్తభంగు లైన
వాని రసికులు స్థాయిభావంబు లండ్రు. ౧౧౫

క. [1]రతి [2]హాస [3]శోక [4]రోషము
[5]లతులోత్సాహంబు [6]భయసమాఖ్య [7]జుగుప్సా
కృతి [8]విస్మయ [9]శమములు నా
సతత రస స్థాయిభావ సంపద నొందున్. ౧౧౬

1 ర తి

క. సంభోగావాప్తి కృతా
రంభస్పృహసొంపుపేరు రతి యనఁ బరఁగున్,
సంభృత చేతఃకుతుక వి
జృంభణమున నెఱుఁగఁదగు రసికముఖ్యులకున్. ౧౧౭

క. మంగళరూప విలాస జి
తాంగజుఁ డగు విశ్వనాథునంద మెలఁగు నీ
యంగనకోరిక సతతము
శృంగారస్థానజాతచేష్టాంగక మై. ౧౧౮

2 హా స ము

క. అతివికృతదర్శనాభా
షితచేష్టాగతులచేతఁ జేపడు హాస
ప్రతిపాదన; మెఱుఁగం దగు
జతురులు చేతోవికారసరసతచేతన్. ౧౧౯

క. చాళుక్యవిభునిఁ దలఁచిన
హేలలు నీనుదుటిచేత నెఱిఁగితి, మనుదున్

లీలాహాసమునకు నా
వాలము గావించె నింతి వదనోదరముఁ. ౧౨౦

3 శోకము

క. శోకం బనఁగను మదిలో
నాకస్మిక విపదవాప్తి నడరెడు దుఃఖ
వ్యాకులత, దాని నెఱుఁగుఁడు
చేకొని రసభేదసిద్ధి చేరుటకొఱకుఁ. ౧౨౧

క. ఈకోలధ్వజు [1]నని పెను
బోకులచే నఱ్ఱుఁగడుపుఁ బొలిపిన[2]యరినా
రీకులము [3]నెరయశోకం
బాకారము దాల్చి [4]నట్ల యంగంబులతోఁ. ౧౨౨

4 రోషము

క. పరకృత ధిక్కారాదుల
నరుదగు కలుషంబు రోష మనఁగాఁ బేర్చుఁ;
బొరిఁబొరిఁ గనలుచునుండెడు
పరుసుననెఱుఁగంగవలయు భావజ్ఞులకుఁ. ౧౨౩

క. ఏపోరిలోన నైనను
నేపారుచళుక్యవిభుని యెసకపు రూపా
టోపము దీపించుఁ, గడుఁ
రూపింపఁగఁ గల్పసమయరుద్రాకృతియై. ౧౨౪

5 ఉత్సాహము

క. మత్సరమర్దనమును ద్రిజ
గత్సంకీర్తితము నైనకడిమి నడరు నా
సత్సాహసప్రయత్నం,
బుత్సాహం బనఁగఁ బరఁగు నురుతేజమునఁ. ౧౨౫

---

పా. 1 నని. 2 నరి. 3 లెరియు. 4 నట్టి.

క. శంకింపక సురవనితా
శంకరు లగువిశ్వవిభుని సమదభటులకుఁ
బింకముగ మేను లుబ్బినఁ
[1]గంకణములు విరిసె శౌర్యగరిమోత్పత్తిఁ. ౧౨౬

6 భయము

క. భయ మనగఁ బూరుషత్వ
వ్యయకరణం బగుచు నంతరంగమునందుఁ
క్షయమునకు వెఱచువెఱ, పది
నియతం బగుచుండుఁ బ్రాణినికరంబులకుఁ. ౧౨౭

క. కరవాలభైరవుని కర
కరవాలప్రభలసొబగు గలుగుటనె కదా
పంకింపఁగ నెచ్చటఁ బర
ధరణీశతమోగుణంబు తలచూప దిలఁ. ౧౨౮

7 జుగుప్స

క. హేయాపాదక వస్తుని
కాయ శ్రవణావలోక కథనంబులచే
నాయత మగురోఁత సుమీ
యేయెడలఁ జుగుప్స యనఁగ నింపులఁ జెఱుచుఁ. ౧౨౯

క. బిరుదములు పెట్టుకొని, తుది
బిరుదార్థము నిలుపలేని బిరుసునృపులకుఁ
బరికించి, రోయు ననిమొన
నరుదగు పరగండభైరవాంకుఁడు, లీలఁ. ౧౩౦

8 విస్మయము

క. శ్రవణాలోకాపూర్వ
ప్రవర చమత్కారమైన బంధురకృత్యం

1 గంకటములు పగులు.

జవని నగు విస్మయం బనఁ,
బ్రవీణు లెఱుఁగంగవలయుఁ బ్రచురప్రతిభన్. ౧౩౧

క. అసముఁ డగువిశ్వభూవిభు
నసిధారాపీతజలము లరినారీదృ
గ్విసరములఁ దొరుఁగుచున్నవి
కసుగందక, విస్మయంబుగాదె తలంపన్. ౧౩౨

9 శమము

క. దూరీకృత సంసార వి
కారము శమమనఁగ నిగమసారం బై పెం
పారు, నదిగలిగెనేని వి
చారము గడునొప్పు నెపుడు చతురులకెల్లన్. ౧౩౩

క. చాళుక్యవిశ్వవిభుఁడు మ
హీలలనాపాలనమున నెసక మెసఁగుచో
నోలి యతీంద్రులు మనముల
నాలవపురుషార్థసరణి ననిచిరి మిగులన్. ౧౩౪

మ. ఇది నానావిధభావబోధపద, మిం దేరాజు రాజత్కళా
సదనంబై విహరించు నాతఁడుగదా సంగీతసాహిత్యసం
పదత్రోవం జనఁ జాలుఁ, జాలిన భవాపాయంబుఁ దూలించు, స
మ్మదలీలన్ గృతకృత్యుఁడై నెగడు సమ్యగ్రాజతేజోనిధీ! ౧౩౫

ఉ. సోమకులాబ్ధిచంద్రుఁడు, యశోధవళీకృత దిగ్గజేంద్రుఁ, డు
ర్వీమహిలాభిరాముఁడు, నవీనభుజాబలరాముఁ, డంగనా
రామవసంతుఁ, డున్నమితరాజజయంతుఁడు, వైరిఘోరసం
గ్రామధనంజయుండు, రిపుకాననదావధనంజయుం డిలన్. ౧౩౬

క. కంఠీవశూరుఁడు, శ్రీ
కంఠపదస్మరణవిగతకల్మషుఁ డనుహ్వా
త్కంఠగ్రహాఖడ్గుఁడు, వై
కుంఠపరాక్రముఁడు, కదనకోవిదుఁ డెపుడున్. ౧౩౭

మాలిని.

అతులవిభవశక్రం, డర్థసంపన్నచక్రం
డతిసుగుణగరిష్ఠం, డాత్మవిద్యావరిష్ఠం
డతనుతనువిలాసుం, డంగనాళీవికాసుం
డితరనృపతిపూజ్యుం, డిద్ధరాజ్యుండు నీతిఁ. ౧౩౭

గద్యము

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయవిరచితం బైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబున
భావప్రపంచప్రకటనసముద్దేశ్యం బనఁ
బ్రథమోల్లాసము.



# ద్వితీయోల్లాసము

## రసప్రకరణము

క. శ్రీలుఁడు, ప్రణతావనిపతి
మౌళిమణిద్యుతిసమేతమంజీరుఁడు తే
జోలంకారుఁడు, ధృతిసుర
శైలుఁడు, చాళుక్యవిశ్వజనపాలుఁడిలన్. ౧

శా. శ్రీ నిందారఁగ లోకరక్షకొఱకై సిద్ధించుటంజేసి ల
క్ష్మీనాథుం డగునయ్యుపేంద్రుఁ డటు లేగెన్ గాన, నీనూతన
క్ష్మానాథుం డగు విశ్వనాథునకు శృంగారాధినాథత్వ మెం
తే నొప్పుం బ్రణుతింప నంచుఁ గవు లుత్ప్రేక్షింతు రెల్లప్పుడున్. ౨

క. కావున నుపేంద్రునకు, ల
క్ష్మీవనితకు దనయుఁ డైన విశ్వేశ
క్ష్మావరునకుఁ బ్రియకరముగ
భావితశృంగారరసముఁ బ్రణుతింతుఁ దగన్. ౩

### రసములు

క. ఉక్తవిభావాదులచే
భక్త నవస్థాయిరూపభావంబులు సు
వ్యక్తములై నిజగుణసం
సక్తములై రసము లన రసత్వమునొందున్. ౪

తే. స్థాయిభావంబులకు ననుసారు లైన
తద్విభావాదులను రసత్వంబు గలుగుఁ;
బరఁగ వెన్నకుఁ బాకసంప్రాప్తిఁజేసి
తగుఘృతత్వంబు గలుగుచందమున నెపుడు. ౫

క. వినువారికిఁ గనువారికిఁ
దనరువిభా[1]వానుభావ దర్శనచయముల్
ఘనరసపోషకములునాఁ
జనుఁ గవితానాట్యములఁ బ్రసన్నాకృతు లై. ౬

తే. ప్రోఢలకుఁ గావ్యములయందుఁ బొందు రసము
ద్రష్టలకు నాట్యములయందుఁ దనరు రసము,
స్ఫుటవిభావానుభావసంఘటనచేత
సాత్త్వికవ్యభిచారిసంస క్తిచేత. ౭

క. రస మారోప్యం బగుటన్
బొసఁగదు [2]నాట్యములయందుఁ, బొల్పగుఁ ద త్త
త్ప్రసరస్మరణముచేతన్
వెస సామాజికులయందు వేడ్కకు నెల వై. ౮

### శృంగారరసము (రెండు విధములు)

క. అతులానందాత్మిక యగు
రతియె విభావాదిభావరంజనముల సం
వృతయై శృంగారరసా
కృతిఁ జెందు మనోనురాగ కీలితగతులన్. ౯

క. ద్వివిధం బగుశృంగారం
బవిరళ [1]సంభోగసంభవాత్మకమును [2]గై
తవవిప్రలంభజము నన
యువతిప్రియజనులవలన నుదితం బగుచున్. ౧౦

### (1) సంభోగశృంగారము

క. అనులా పాలింగన ద
ర్శన చుంబన మోదన ప్రసాధన విధులన్

---

1 వాదిభావ. 2 నర్తకులయందు (మూఁడు ప్రతులయందును).

వనితలఁ బతులకా దమలోఁ
జెనయుట సంభోగజనితశృంగార మగుకా. ౧౧

మ. లలితస్విన్నకపోల మాననము, హేలాలోల మాలోకనా
వలనం, బుల్లసదంగ ముత్పులకసంవాసంబు, వృత్తస్తన
స్థలి మాల్యావృత, రంజితాధరము లజ్జాహాసభావంబు, నె
చ్చెలి కీసొంపు చళుక్యవిశ్వవిభుఁ డిచ్చెకా జూచితే నిచ్చలుకా. ౧౨

తే. పంచవిధభావకలితప్రపంచ మెల్లఁ
గలసి శృంగారరసపోషకంబ యండ్రు:
క్రమముతోడఁ బ్రయోగసంగతి యెఱింగి
కావ్యనాటకములఁ గూర్పఁ గనుట యొప్పు. ౧౩

తే. ఇందు శృంగారరసమును నెసఁగఁ జేయు
వివిధభావాదిక క్రియావింశతి (=౨౦) యును
నెఱుఁగఁబడు భావకుల మది కేర్పడంగఁ
గవిత లక్షణలక్ష్యప్రకారములను. ౧౪

శృంగార చేష్టలు 20

క. అంగనలకు యౌవనగుణ
శృంగారరసోపపన్న చేష్టలు నానా
భంగులయి యొప్పు నిరువది,
యింగితముగఁ దత్ప్రకార మెఱుఁగఁగవలయుకా. ౧౫

అంగ జాతములు 3

క. ఆ వింశతిలో [1]భావము,
[2]హావము [3]హేలాభిధయును ననియెడు మూఁడుకా
భావింప నంగజాతము;
లావిధ మెఱుఁగంగవలయు నయ్యాయి గతులకా. ౧౬

అయత్న సంభవములు 7

తే. అలరు [1]శోభయుఁ [2]గాంతి [3]దీప్తులును [4]మధుర
తయుఁ [5]బ్రగల్భత్వమును [6]సదోదారతయును

7ధీరతయు నాఁగఁ బేర్కొనుచెఱఁగు లేదు
పరఁగు సతుల కయత్నసంభవము లగుచు. ౧౭

నైసర్గికములు 10

తే. చెలఁగు 1లీలా 2విలాస 3విచ్ఛిత్తి 4విభ్ర
మాహ్వయంబులు 5గిలకించితాభిధంబుఁ
గొరలు 6మోట్టాయితంబును 7గుట్టమితము
నెసఁగు 8బిబ్బోక 9లలిత 10విహృతులు వరుస. ౧౮

క. పదియును నైసర్గికములు;
విదితము లన్నియునుగూడి వింశతి యయ్యెన్;
వదలక తల్లక్షణములఁ
దదుదాహరణములు నెఱుఁగఁదగుఁ దజ్జ్ఞులకున్. ౧౯

అంగసముద్భవములు-3. అందు 1 భావము

క. అతినిర్వికార చేతో
గతవృత్తివిశేష మరయఁగా సత్త్వము, త
త్ప్రథితిపాద్యక్రియ భావము
సతతాలంకారకారి, చనుఁ దెలియంగన్. ౨౦

ఉ. ఆళిజనోపభోగవచనార్థములం జెవిఁ బెట్టి, సిగ్గుతోఁ
గ్రాలెడువింతచూపు కడకన్నులయం దిడి, మున్నువోలె పై
మాళపుటాటకున్ జొరదు మారుఁడు గల్గుట లో నెఱింగి, యీ
బాల చళుక్యవిశ్వజనపాలునిఁ జూచుట నిక్కువంబ వో. ౨౧

2 హావము

క. భావము యించుక వదన
వ్యావళితవికాస మైన హావము, శృంగా
రావిర్భావనివాసము
భ్రూవల్లీ మందచలనమున నెఱుఁగఁ*బడున్. ౨౨

పా. * దగున్.

చ. అరవిరితమ్మిలో వెడలునమ్మధుపమ్ములఁ గ్రేణి సేయుచున్
గరపు విలోచనాంతములఁ గ్రాలెడుచూడ్కు-ల దందడించున
మ్మరుఁ డెడకాఁడుగా నొకతె మక్కు-వఁ గన్గొనె, సిగ్గు ముందఱన్
దిపగఁ, జళుక్యవిశ్వనృపతిన్ వెలిచాటుననుండి వేడుకన్. ౬౩

3 హేల

క. హావము సువ్యక్త విలా
సావహ మగునేని హేలయనఁగాఁ బరఁగున్,
భావింపఁగ శృంగారము
పై పాఱుచు నారఁబారఁ దనరుటచేతన్. ౬౪

శా. భ్రూతారావలనంబు ఘర్మపులకాభోగంబు రాగంబునున్
జేతోజాతుఁడు తన్ను జోకుటఁ బ్రశంసింపన్ బ్రసన్నోదిత
ప్రీతిన్ జూచెఁ బయోజనేత్ర కుతుకశ్రీపుష్టదృష్టిక్రియా
చాతుర్యంబ్బులు చంద్రికన్ దెగడఁగాఁ జాళుక్యవిశ్వేశ్వరున్. ౬౫

ఈమూఁడును అంగ సముద్భవములు.

అయత్నసంభవములు - 7. అందు 1 శోభ

తే. రూప యౌవన లావణ్యరూఢి సొబగు
సుందరుల కెల్ల రసికులు శోభ యంద్రు;
దనరు నన్యోన్యతుల్యగాత్రములయందుఁ
గడఁగి పెట్టని తొడవయి కానఁబడుచు. ౬౬

ఉ. కోరి చళుక్యనాథుకడకున్ జనునింతికి రత్నకాంచనా
కారము లైనభూషణనికాయములం దడవంగ నేల; యీ
సూరెలఁ గ్రాలునంగములసోయగ మెంతకు లేదు చూడుఁడా
మారునిపూవుఁదూపులకు మాఱటరూప మనంగ నొప్పెడున్. ౬౭

2 కాంతి

క. ఆశోభయ రంజనగుణ
పేశలమై మించుగలిగి బెరసిన విద్యా

కౌశలము కాంతి యంద్రు ప్ర
కాశప్రతిభాప్తి నెఱుఁగఁగా దగు బుద్ధిన్. ౨౮

చ. కలపపుఁబూఁతలోన వెలిఁ గ్రమ్ముచుఁ బయ్యెదచీరమీఁద ను
జ్జ్వల యగునంగకాంతి గరువంపునడం బొలుపారెఁ జూచితే
పొలఁతి కుపేంద్రపుత్త్రిపరిభోగమతిం జనుచోట నెంతయుం
బలుచనివారిదంబు వెలిఁబర్వు శశిప్రభతోడ సాటియై. ౨౯

## 3 దీప్తి

క. శస్తమగుకాంతికల్పిత
విస్తారము దీప్తియనఁగ విలసిల్లు, శరీ
రస్తుత గభస్తివిభవ ని
రస్తాలంకారకరణ యగు సతి కొప్పుం. ౩౦

మ. బలవద్విశ్వనరేంద్రుధాటి మదిలో భావించి యుగ్రాచలా
చలితధ్వాంతగుహాంతరంబులఁ బ్రవేశం బొప్పఁ గావింతు ర
స్ఖలితాంఘ్రిప్రసరంబులన్ బ్రియవధూశారీరభూరిప్రభా
వలనంబుల్ కరదీపికావళులుగా వైరిక్షమావల్లభుల్. ౩౧

## 4 మాధుర్యము

క. పొగ డొందనివస్తువుతోఁ
దగిలియుఁ గడు హృద్యమగుటఁ దా మాధుర్యం
బగు నప్రసిద్ధమండన
లగనంబున నెఱుఁగఁ దగు విలాసకరంబై. ౩౨

ఉ. లాలితసిందువారముకుళంబుల పేసలు కర్ణకీలితా
లోలశిరీషపుష్పములు లోధ్రరజంబును మేనఁ జెంది సు
శ్రీలఁ దనర్పఁ గ్రొవ్విరులఁ జేసినకానుక యిచ్చి సొంపుతో
బాల చళుక్యవిశ్వజనపాలుని మ్రోల వెలింగె సిగ్గునన్. ౩౩

## 5 ప్రాగల్భ్యము

క. వ్రీడోదితభయముం దగ
వీడుట ప్రాగల్భ్య మనఁగ వెలఁదుల కొనరుం

ప్రౌఢతనం బై విద్యా
ప్రేఢితసంక్రీడనముల మెలఁగెడు నెడలన్. ౩౪

మ. ఇల విశ్వేశ్వరచక్రవర్తిసభలో నీముగ్ధ భావింప ని
శ్చలలజ్జావతి యయ్యునుం దగునెడన్ సంగీతసాహిత్యవి
ద్యల విద్వన్నుతి కెక్కినట్టిదికదా తర్కింప సత్యాశ్రయ
స్థలదత్యాతతసిద్ధులన్ విధికళాచాతుర్య మొప్పుం జుమీ. ౩౫

## 6 ఔదార్యము

క. అలి సురతాయాసాదుల । నలసియు విలపిల్లు కణఁక యౌదార్య మగున్,
లలనకుఁ దగ మగుడని వే । డ్కల నొసఁగున్ దయిత కౌతుకప్రదచేష్టన్. ౩౬

ఉ. కన్నులచెన్ను హల్లకవికాసముతోఁ బురణింప, బింకపున్
జన్నులమీఁది పెంజెమరు సాలమి నెన్న, మృదుప్రచారము
ప్పన్నపుసోలముం దెలుప, భామకు లోఁ దమకం బొకింతయున్
సన్నముగాక విశ్వనరనాథునిపైఁ దగులంబు చూపెడున్. ౩౭

## 7 ధైర్యము

క. రూపింపఁ జిత్తసంభృత । చాపల్యముచేతఁ బుష్పచాపాదులచే
నేపఱక యుండుతాలిమి । చూపట్టును ధైర్యమనఁగ సుస్థిరబుద్ధిన్. ౩౮

మ. పతి విశ్వేశుఁడు నాకు; నవ్విభుఁడు చెప్పన్ సర్వలోకాశ్రయుం;
డతఁ డేలాగుదలంచినన్ దలఁపనీ; ప్రాణంబు నిత్యంబె? మా
రుత మాకంద మనోజ మాధవ మహారోషంబు వైరింప సం
స్తుతి సామాన్యమె? మాన మాభరణ మై శోభిల్లవే యెల్లెడన్? ౩౯

ఈ యాఱునొకటియు అయత్నసంభవములు.

## నైసర్గికములు 10. అందు 1 లీల.

క. గతి వచ నాలోకన మి । శ్రితచేష్టలఁ బ్రియుని ననుకరించుటయ కదా
మతిఁ దలఁప లీల యనఁ జను । సతతమనోరంజనప్రసాదం బగుచున్. ౪౦

ఉ. చేరి చళుక్యవల్లభుని చెప్పినయట్లన సేయు నుత్తమ
శ్రీరమణీసరస్వతులచేఁతలు చిత్రము; లన్న రేంద్రుఁ డె

వ్వారికి నేపదార్థము లవారిగ ని మ్మను నట్లు యిత్తు; ర
న్నారులకుఁ బ్రియానుకరణం బురుధర్మము కాదె యెప్పుడున్. ౪౧

## 2 విలాసము

క. బిట్టు నిజప్రియు నంగన। కట్టెదురఁ జూచి యంగకంబులమీఁదఁ
బుట్టించిన యొయ్యారము। చిట్టాడుట యది విలాసచిహ్నం బరయన్. ౪౨

ఉ. పయ్యెదఁ జక్కఁ దీర్చుకరపల్లవముం, గడచూడ్కిలోన నిం
పయ్యెడుసిగ్గుఁ, గుంతలము లల్లన వీనులపొంతఁ జేర్చున
త్తియ్యపుఁ జెయ్వు, మన్మథునితేజపుబీజము లై తనర్పఁగాఁ
దొయ్యలి చూచెఁ గోరికలు దొట్రిల విశ్వనరేంద్ర చంద్రునిన్. ౪౩

## 3 విచ్ఛిత్తి

క, సురతాదులయెడ నల్పా। భరణం బై మెఱయుచున్న భావము తగ సుం
దరులకు విచ్ఛిత్తియనం। బరగు నిజప్రథమరసవిభావక మగుచున్. ౪౪

ఉ. మంచి విభూషణావళులు మాని, నవారుణశాటకంబునుం
గొంచెపుహారముల్ చెలువుఁ గోరి ధరించినయింతి కామినీ
పంచశరాంకు విశ్వజనపాలునిఁ జూచి తనర్చెఁ జూడ్కికిన్
బంచషపల్లవప్రసవభాసిని యయ్యెడు తీఁగచాడ్పునన్. ౪౫

## 4 విభ్రమము

క. కడుఁ గౌతుకాతిశయమునఁ। దొడవులుఁ బూఁతలును దప్పఁ దొడుగుటచే న
య్యెడు సంభ్రమంబు విభ్రమ। మడరుం బ్రియదర్శనాదులం దెల్లపుడున్. ౪౬

మ. ఒక నేత్రంబునఁ గజ్జలంబు నిడి, వేఱొక్కంట నర్పింప నొ
ల్లక, యొక్కర్తు జయాంగనాపరిణయాలంకారవిశ్వక్షమా
పకునిం జూచె, విలోచనప్రభలు విభ్రాజిల్ల, నిద్దంబులై
వికచేందీవరపద్మతోరణగతిన్ విప్పారి యొప్పారుచున్. ౪౭

## 5 కిలకించితము

క. లలనునిదెసఁ బ్రియ కబ్బెడు। నలుకయు నెలనగవు గద్గదాలాపములున్
గలరుదితము ననియెడునివి। కిలకించిత మనఁగ బరఁగుఁ గేళీగతులన్. ౪౮

చ. అలుఁగు, విలోకనాంతముల నశ్రువులం బరఁగించు; చిన్నిన
వ్వులు చిలికించి చేరి చనవుం దగవుం దళుకొత్త గద్గదో
క్తులు నిగుడించు, నిక్కమునకుం బులకించుఁ జెమర్చుఁ, జూడుఁ డ
న్నెలఁతకు విశ్వనాథుపయి నెక్కొనుకూరిమిచంద మెట్టిదో! ౪౯

## 6 మోట్టాయితము

క. పతికిం దనపైఁ దలఁప । ద్భుత మని విని వనితమేను పొంగుట మోట్టా
యిత మండ్రు భావసూచన । గతులం దెలియంగవలయుఁ గాముకు లెల్లన్.

మ. ప్రమదం బారఁ జళుక్యవిశ్వవిభుకుంభద్దానధారాజలౌ
ఘముచేఁ బొంగుచు నంబరాభరణరంగత్కీర్తులం దాల్చుచున్
సుమనో విస్ఫురదుత్తమాంగరుచులం జూపట్టు భూదేవి ని
త్యము; నాథుం డభిగామి యైన వలదా తత్తద్విజృంభక్రియల్. ౫౧

## 7 కుట్టమితము

క. పరిరంభ ణాధరక్షత । పరిపీడాదుల సుఖంబు పటుదుఃఖముగా
దురపిల్లుట కుట్టమితం, । బరయఁగ నుపచారవిధుల నగుఁ దెలియంగన్. ౫౨

మ. వనితా, నేఁడు చళుక్యనాథుని మరున్ వారించుటన్ బీవర
స్తనకుం బాధరబింబమధ్యమున నా సౌగంధిక శ్రేణిచేఁ
జన నర్చించెదు నీకు నీసుభగతాసంధాత విశ్వేశ్వరుం
డనియో కాక యుపేంద్రపుత్త్రుఁ డనియో, యాచందముం జెప్పుమా. ౫౩

## 8 బిబ్బోకము

క. రాగమున నొందె, గర్వా । భోగంబున నొందె, మొఱఁగిపోవుట నొందెన్,
వేగాదరణము పతిపై । సాగమి బిబ్బోక మనఁగఁ జను నంగనకున్. ౫౪

ఉ. బుద్ధి మహీరమాసతులపొత్తున నుండక సత్ప్రతాపసం
బద్ధసఖిత్వ మొప్పఁ జని భాసురకీర్తి దిగంతరంబులన్
వృద్ధగుణానురక్తుఁ డని విశ్వనృపాలు నుతించు నెప్పుడున్;
శుద్ధపతివ్రతాత్మికల కోఁకునె యెందు ననాదరక్రియల్. ౫౫

### 9 ల లి త ము

క. వికసితవ ర్తనమున సే। వకవ ర్తనమునను రచితవచనములయెడన్,
సుకుమారాంగన్యాసము। ప్రకటితముగ లలిత మండ్రు భావజ్ఞు లిలన్. ౫౬

చ. కనుగొన నొప్పుకంఠమున గానముఁ, బాణులఁ మంజులార్థక
ల్పనమును, దృగ్విశేషమున భావములుం, జరణక్రమంబులన్
దనరు లయప్రపూర్ణ మగుతాళముఁ, గ్రాలఁగఁ బాత్ర యొ ర్తు రం
జనముగ నాడె నింపు వెదచల్లుచు విశ్వనృపాలుసన్నిధిన్. ౫౭

### 10 వి హృ తి

క. చెప్పఁ దగుమాట సిగ్గున। జెప్పక, వెడ గప్పిపుచ్చు చేష్టాదులచే
నొప్పునది విహృతి; రసికుల। కప్పుడు తగుఁ దెలియ నింగితాకారములన్.

ఉ. దెందము విన్న నయ్యెఁ, నొకడిల్లఁదనం బొడఁగూడె మోముపై,
ముందఱిలాగు గాఁ దొడలు, ముచ్చటమాటల కాస చేసె, దీ
చందముఁ జెప్పు మన్న వెడసన్నపుసిగ్గున మ్రొగ్గుచూడ్కిచే
సుందరి చెప్పె విశ్వవిభుఁ జూచినకాముఁడు తన్ను సోఁకుటల్. ౫౯

ఈపదియును నైసర్గికములు.

### (2) విప్రలంభశృంగారము (దానికి 12 దశలు)

క. లలిత శ్రవ ణాలోకన। కల హాసూయా ప్రవాసకలనల చేతన్
గలిగెడు దశావిశేషము। చెలువారఁగ విప్రలంభశృంగార మగున్, ౬౦

సీ. అదియుఁ 1 చక్షుః ప్రీతి యన, నంతఁ 2 చి త్తసం
గంబునా, మఱియు 3 సంకల్ప మనఁగ,
నటఁ 4 బ్రలాపంబు నా, నవల 5 జాగర మన,
నటుమీఁదఁ 6 గార్శ్యసమాఖ్య మనఁగ
వెండియు 7 విషయవిద్వేషంబు నాఁ 8 త్రపా
సంత్య క్త మనఁగ, 9 సంజ్వర మనంగ,
10 నున్మాద మనఁగ, 11 మూర్ఛాపగమం బన,
12 మరణంబు నా, నిట్లు మానినులకు

తే. ననుగతద్వాదశావస్థ మైతనర్చు;
బదియ దశలంద్రు కొందఱు ప్రౌఢజనులు;
పరఁగు లక్షణములు నుదాహరణములును
వరుసఁ జెప్పుడుఁ దెలియంగవలయు నిందు ౬౧

## 1 చక్షుః ప్రీతి

క. చక్షుఃప్రీతి యనం జను। నక్షీణ విలాసగుణసమగ్రునిఁ బ్రీతిన్
వీక్షించుకుతుక; మది మరు। నిషధనుర్దండమునకు నెక్కెక్కించున్. ౬౨

ఉ. ఉల్లముఁ జూపుచూపు, లన నొల్లనియుగ్గులు, విచ్చుపిగ్గలున్
దెల్లగఁ జేరుకోరికలుఁ, బెక్కులు మక్కువచక్కడంబులున్,
మెల్లనె జాఱుపయ్యెదయు, మిం చొలయం బులకించుమేను, రం
జిల్లఁ జళుక్యవిశ్వనృపశేఖరుఁ గన్గొనుపువ్వుఁబోఁడికిన్. ౬౩

## 2 చిత్తసంగము

క. చిత్తాసంగం బన నా। యత్తం బగుఁ బ్రతికృతి ప్రయత్నాదిసుఖో
త్పత్తికి నెల వగుచింతన,। మత్తెఱఁగు మనోవికీర్ణమై విలసిల్లున్. ౬౪

ఉ. మానినిచూపులం దొరలి మానుగ విశ్వనృపాలుఁ దేపుతో
నానఁగఁ గారుకొన్న మనమా మన మాదట నాదరింప మిం
పూన నుపేంద్రపుత్త్రిఁ దత డున్నపదం బని కాదె యక్కునన్
సూనపటీరపంకములు సొం పలరాడెడు సారెసారెకున్. ౬౫

## 3 సంకల్పము

క. చిత్తములో ననిశంబును। మొత్తము లగుతలఁపుఁగూటములఁ బొందెడిచో
జొత్తిల్లు చెమరుపులకల। యొత్తుడు సంకల్పదశకు నొనరినచిన్నెల్. ౬౬

చ. అకట తలంచి చొక్కఁదగ దక్కలయిక్కల నున్న నున్నగా
లికి నెల వైనపువ్వుఁబొదలే పొద లే పులకింప నేల మి
న్నక యెలనాగ నాగరజనప్రియుఁ డయ్యెడు విశ్వనాథు శ
య్యకుఁ జనవచ్చు వచ్చుమరునమ్ములు వమ్ములు చేసె దంతటన్. ౬౭

### 4 ప్ర లా ప ము

క. ఇంతికిఁ బ్రలాప మనఁగాఁ। గాంతగుణాలాపకథనకల్పన; యదియుం
సంతసము చేయు నుచితా। ర్థాంతరరచనావిశేష ణాదులచేతన్. ౬౮

ఉ. ఈగతిఁ జూతురే। తగులరే తగులే తగులేమ లీధరన్?
రాగదుఁ దైనవిశ్వనృపురాకయ వో తగురాక నాకు, లో
లో గమిగొన్న చూపుఁదొగలున్ దొగ లై విలసిల్లు; దానిచే
సాగెడు నన్నరేంద్రునకు సద్ద్విజరాజకళాధరత్వమున్. ౬౯

### 5 జా గ ర ము

క. వల్లభుఁ డెట్లును నబ్బమి।
మొల్లం బగుచింతఁ గన్ను మోడ్పక మదిలో
నల్లల నుడుకుచునుండెడు।
తల్లడ మది జాగరాభిధానం బయ్యెన్. ౭౦

చ. నెలగలమేలురేలు చెలినిద్దురకుం బగ లయ్యెఁ, బెల్లువె
ల్లులఁ గొనువేడ్క లీనుపగలుం బగ లయ్యెను, దాన దీనికిం
గలువలు కన్ను లంటయును గైవడి విశ్వనృపాలచంద్రు నిం
పలరఁగఁ జూచుటం గువలయప్రియుఁ డంటయు నిక్క మిక్కడన్. ౭౧

### 6 త ను కా ర్శ్య ము

క. అంగనకు నెట్లు ప్రియుదెన। సంగతి।యరు దైనఁగామసంతాపముచే
నంగములు డస్సిపోయిన। భంగి తనుత్వంబు నాఁగఁ బరగుం జూడన్. ౭౨

చ. అటమట మేల? యేలికొాను మంగన; నంగదభంగు లయ్యె న
క్కట కటకంబు లింతి। కెడక త్తెలు నీకడ నాడి పాడిరే
విటతతివింటదూపడనువింటఁ దొరంగుట నీగుణంబు లిం
తటఁ జల మేది మేదినిఁ బొదల్పుము విశ్వనృపాలమన్మథా। ౭౩

### 7 వి ష య ద్వే ష ము

క. సద్వస్తువు లొల్లక, విల। సద్విద్యావిహరణంబు చాలించి వివే
కద్వారము గానమి, విష। యద్వేషము తెలియవలయు నప్రీతిమెయిన్. ౭౪

ఉ. గీకనురాగ ముప్పతిలఁ గీరమణీ రమణీజయంతు పైఁ
గూరిమిఁ గూరి మిక్కుటపుఁగోరిక లీరికలెత్తఁ బల్కు తిం
పార, నపారధీరగుణుఁ డారయ నాపతి విశ్వనాథుఁ డా
మారుఁడు మారుతంబు నెలమావియుఁ గ్రించుల మించు లేటికిన్. ౪౫

8 త్ర పా నా శ ము

క. పౌలఁతుక నిజదయితునికై ।
కలమానధనంబు చాల గజిబిజి గాఁ దా
నిలువడియును గులగతియును।
దలఁపమియ త్రపావినాశదశ యనఁ బరఁగున్. ౪౬

ఉ. క్రొన్ననగొన్న సిగ్గుదలకొన్న తలంపు నలంపకున్న నీ
నన్నుఁ జళుక్యవిశ్వ నరనాథుఁడు మన్ననలం బొదల్చు నీ
ప న్నొడఁగూడినం జెలుల పా టొడఁబా టటుగాక యెట్లు నే
వెన్నెల విల్తు గెల్తు ననవిల్తుఁ నదలుఁ బికాదిసేనలన్. ౪౭

9 సం జ్వ ర ము

క. శీతకరమదనకృతమును। శీతలకరణోపచారజృంభితమును నై
యేతెంచు తాపభరమది। నాతికి సంజ్వర మనంగ నలు వెడలించున్. ౪౮

ఉ. వే చని విశ్వనాథు గుణవిశ్రుతుఁ దోకొని వత్తు మంచు ము
న్నీ చెలు లెల్ల నన్న పలు కెల్లగఁ జూచితి, నో మి దేల, నా
కీ చలిమందు లేమిటికి, నీవల నావలఁ దావలంబులై
త్రోచి మొగంబుపైఁ దిరుగుతుమ్మెద లూరడుఁగాక యితటన్. ౪౯

10 మో హ ము

క. విరహావశ వికలచేత। శ్చరితోన్మాదంబు మోహసంజ్ఞం బరయన్,
నొరిది నచేతనచేతన। పరిచితి సరి యగుట నెఱుఁగఁబడుఁ జతురులకున్ ౫౦

ఉ. ఆతురపాటుతో నిలువుటద్దముదీప్తులు మాటుసేయుచో
నాతరుణీలలామ మనయాసలు గన్గొని 'వట్టిజాలి యీ
గోతుల కేల కేలఁ గొని క్రొన్నెల మూయు టొప్పునే
యీతటి' నన్నచిన్నిపలు కెన్నరు విశ్వనృపాలుసన్నిధిన్. ౫౧

## 11 మూర్ఛ

క. అసయము నెమ్మనమునఁ బా
యని సొమ్ముల పేరు మూర్ఛ యనఁగాఁ బరఁగున్,
దనరెడు నింద్రియగుణవ
ర్తన వైకల్యమున నెఱుఁగఁ దగుఁ దజ్జ్ఞులకున్. ౮౨

చ. మృదులత నెన్ని యన్నమును మెచ్చఁడు విశ్వనరేంద్ర శేఖరుం
డదె యొకతేఁటిజోటి నడయాడెడు నింతియ యింతిమోమునన్
వదలక నోమి నోమి యదనం గడ గానఁగ లేమ లేమకై
మదిఁ బడదే కదే కరుణ మారుఁడు మారుఁడు కాఁడె యెప్పుడున్. ౮౩

## 12 ద్వాదశదశ

క. ద్వాదశదశయుం గలుగుఁ ద
లోదరికిం బ్రియుఁడు బహువిధోపాయములన్
సాదరుఁడు గాక తక్కిన
నాదశ యున్నట్లు చెప్పి రార్యులు కృతులన్. ౮౪

చ. తలిరులు తమ్ములుం గలువదండలు మాటికిఁ బాటి పేసె నా
వల వలరాజుతూపు లనవచ్చుట యెచ్చటఁ దోఁప దక్కడన్
జిలికిన చందనద్రవము చిక్కఁగ నిక్కడ కేఁగుదెంచితిన్
జలముల మేల మేల సతిచక్కటి విశ్వనృపాల యిత్తఱిన్. ౮౫

చ. పొలఁతుక చూచురా యబలపోకులు తేకులు విచ్చి చన్నుఁగ్రే
వలఁ బలుమాఱు గప్పెడు, నవస్మిత మొప్పఁగ దర్పణంబులోఁ
దొలుచులలాటరేఖ గని బొట్టిడి నోలెడుఁ, గ్రాలువాలుఁజూ
పుల మరుతూపులం దెగడఁ బూనెడు విశ్వనృపాలుఁ బ్రాపునన్. ౮౬

ఇది విప్రలంభశృంగారదశకము.

క. ఇప్పుడు చెప్పిన వన్నియు
నొప్పగు శృంగారరస సదుపకరణము లై
చెప్పఁబడుచుండుఁ బలుకుల
చొప్పున భావములు గవితఁ జొనుపఁగవలయున్. ౮౭

### నవరసములు

క. క్రమమున [1]శృంగారము [2]హా
స్యముఁ [3]గరుణము [4]రౌద్ర [5]వీర సంజ్ఞంబులు [6]ఘో
రము [7]బీభత్సము [8]నద్భుత
సమాఖ్య [9]శాంతములు నవఁగఁ జను నవరసముల్. ౮౮

తే. అందు శృంగారరసవిశేషాంతరములు
వితతములు గాఁగ మున్నె భాషితము లయ్యెఁ;
నింక హాస్యాదిరసముల నెనిమిదింటి
వరుసఁ జెప్పుదుఁ, దెలియంగవలయుఁ గవులు. ౮౯

### 2 హాస్యము

క. దృష్టవిభావాదులచేఁ । బుష్టం బగుహాస మందముగ హాస్య మగున్
శిష్టాలంబన మరయ । విశిష్ట విదూషక జనాదిచేష్టిత మగుచున్. ౯౦

ఉ. కల్పకుజంబులం దెగడుఁ, గామగవిం బ్రహసించు, వట్టిసం
కల్పపురాయి నవ్వు, శిబి కర్ణులచాగము నేవగించు, న
స్వల్పవదాన్యవిశ్వజనవల్లభుచే సిరి నొందు యక్షరా
ట్కల్పవిదూషకప్రతతి గర్వితరాజసభాంతరంబులన్. ౯౧

తే. రూప భాషిత వికృతు లుద్దీపనములు
ముఖ వికాసాదు లనుభావములు దలంప
నశ్రు వైవర్ణ్య విస్వర తాదికములు
సాత్త్వికంబులు నాఁగ హాస్యమున కమరు. ౯౨

తే. అశ్రుసంపాత చపలతా హర్షణాదు
లడరు సంచారిభావంబు లనుసరించి;

### ౬ హాస్యభేదములు

హాస్య మాఱుప్రకారంబు లైతనర్చు;
తత్స్వరూపంబు లెఱిఁగింతుఁ దగు నెఱుంగ. ౯౩

క. [1]స్మితమును [2]హసితము నను నీ
ద్వితయము ముత్తమము నాఁగ దీపించుఁ దగన్;

స్మితము వికాసికపోలము,
మితదర్శితరదన మైన మెఱయు హసిత మై. ౯౪

క. ³విహసితమును ⁴ప్రహసితము
న్మహి రెండును మధ్యమములు మదిఁ బరికింపన్;
విహసితము మృదులనినదము,
ప్రహసితము శిరఃప్రకంపపరిమిత మరయన్. ౯౫

క. ⁵అపహసితము ⁶నతిహసితము
నెపుడును నధమంబు లనఁగ నేపారు; శిర
శ్చపలము నశ్రుయుతంబును
నపహసితము, మేను గదల నతిహసిత మగున్. ౯౬

3 కరుణము

క. శోకము విభావముఖభా । వాకలనము చేతఁ గరుణ మను రస మయ్యెన్
జేకూడిన యతులితవిప । దాకులితాలంబభావ మనఁగా బరఁగున్.

మ. తనరం బుత్త్రకళత్రమిత్రమిళితార్థస్వాంతుఁ డై శాత్రవుం
డని భక్తిన్ బ్రణమిల్లినన్ బ్రకటరాజ్యశ్రీలు ప్రాపించుఁ జ
క్క_ని విశ్వేశ్వరచక్రవర్తికరుణం; గాకున్న నవ్వైరి మా
త్స్వ్యనిచందంబునఁ బాండ్యుభంగి ద్రవిడక్షోణీశుభావంబునన్
జను దీనుం డయి హీనుఁ డై కృపణుఁ డై సంతప్తుఁ డై లుప్తుఁ డై.

తే. అనిశకృత ఖేద పర్యటనాదికములు
వరుస నుద్దీపనవిభావపరికరములు;
రూఢ పరిదేవన శ్వాస రోదనములు
పరఁగు ననుభావములు గాఁగఁ గరుణమునకు. ౯౯

తే. స్తంభ వైస్వర్య బాష్పము ల్సాత్త్వికములు;
మరణ సంభ్రమ దీనతో న్మాదములును
జాడ్యచింతాదులను నపస్మారగతియుఁ
బటువిషాదంబు సంచారిభావదశలు. ౧౦౦

### 4 రౌద్రము (రెండు విధములు)

క. క్రోధము రౌద్రరసం బగు
సాధువిభావాదికముల సంపుష్టం బై,
ద్వైవిధం బగు [1]మాత్సర్య [2]వి
రోధంబులఁ; దెలియఁ దగు నిరూపణవిధులన్, ౧౦౧

### (1) మాత్సర్యరౌద్రము

మ. అని రోషించిన వీరభద్రుకరణి న్వాపించుఁ, బ్రాపించి చ
య్యన రుద్రోద్ధతిఁ జెందుఁ, జెంది వికటోగ్రాటోపమున్ జూపుఁ, జూ
పి నటత్త్ర్యంబకుకేళిఁ బేర్చుఁ, బిదపన్ భీమాకృతిన్ జేకొనున్;
జను నే మార్కొన మత్సరాహితులకుం జాళుక్యవిశ్వేశ్వరున్. ౧౦౨

### (2) విద్వేషరౌద్రము

శా. దృక్కీలిం గరవాలభైరవుఁడు విద్వేషించి విద్వేషులన్
జెక్కున్, జక్కడుచున్, బలంబు నెఱపుం, జెండాడు, ఖండించు, ను
ప్పెక్కించుం, బడవైచు, నెంచుఁ, బొడ మాయించున్, బిశాచావలిం
జొక్కించున్ భటఘోటకామిషకృతస్థూలోపహారంబులన్. ౧౦౩

క. క్రమమున మాత్సర్యద్వే। షము లాలంబన మనంగఁ జనుఁ, దద్భాషా
సముచితచేష్టాదికములు। రమణీయోద్దీపనములు రౌద్రంబునకున్. ౧౦౪

క. అనుభావంబులు వికృతన। యనరాగాధరవికంప నాదులు; ఘర్మ
స్వన గద్గద వైవర్ణ్య చ। లనములు సాత్త్వికము లండ్రు లక్షణవేదుల్. ౧౦౫

క. ఆయత మద చాపల్యా। సూయా గర్వములు హర్ష సులభోత్సాహ
స్థేయో భావోగ్రతలును। బాయక సంచారు లనెడు భావము లరయన్. ౧౦౬

### 5 వీరము (మూఁడు విధములు)

క. విహితవిభావాదులచేఁ
బ్రహితోత్సాహంబ వీరరస మనఁ బరఁగున్,
[1]బహువితరణ[2]కరుణా[3]రణ
మహిమంబులఁ ద్రివిధ మగుచు మలయుం గృతులన్. ౧౦౭

(1) దా న వీ ర ము

క. అతివితరణశూరతచే । నతులబహిఃప్రాణమైనయర్థము నర్థి
ప్రతతికి నొసఁగెడుసద్గుణ । చతురత యిల దానవీరసంజ్ఞం బడయున్. ౧౦౮

శా. అల్పార్థిం బొడచూచినంతటనె విశ్వాధీశ్వరుం డిచ్చు సం
కల్పార్థంబులకంటె నర్థము నసంఖ్యాకంబుగా నున్నమ
త్కల్పానోకహ కామధేనువులకుం గల్పించు జల్పాకవా
క్స్వల్పఖ్యాతి నడంచి యల్పమని యౌదార్యం బవార్యంబుగన్. ౧౦౯

(2) ద యా వీ ర ము

క. అసువిలయంబున నైనను । బస గల్గు నుదారసారభాషాదుల సా
హస రచనయ కరుణాత్మక । రసవీరం బనఁగఁ బరఁగు రసికోత్సవ మై. ౧౧౦

చ. చతురచళుక్యనాయకుని చారుతరత్తరవారిధార న
ద్భుతపద మొంద వల్లభుఁడు పోయెడుఁ దోడనె కూడఁబోయెదన్.
సుతు లనిశ స్తనంధయులు సు మ్మని దాదికిఁ జెప్పి ప్రజ్వల
చ్చితిశిఖియంకపీఠమును జెందె నరాతివధూటి పోరిలోన్. ౧౧౧

(3) యు ద్ధ వీ ర ము

క. పేరుకొని పోరిలోన న । పారపరాక్రమము నుభయబలములు వొగడన్
దోరంబుగ విహరించు ను । దారత రణవీర మనఁగఁ దనరుం గృతులన్.

మ. అరుదారం బరగండ భైరవుఁడు వీరాకారుఁ డై వైరిభూ
వరుఁ దుండించి ఘృతాచికిం బ్రియునిగా వాలించు, విద్వేషము
ష్కరు దూలించి తిలోత్తమావిటునిఁగాఁ గల్పించు, నత్యంతమ
త్సరు రంభారమణీయుఁ జేయు నసిచే సంగ్రామరంగంబునన్. ౧౧౩

ఆ. దానవీరమునకుఁ దగుపాత్రమును, దయా । వీరమునకు దీనపూరుషుండు,
యుద్ధవీరమునకు బద్ధవైరంబు నా । లంబనములు భూతలంబునందు. ౧౧౪

క. దాన స్తవనంబులుఁ బటు । దీనాలాపములు సమరదృప్తపటహ ని
స్వానంబులు వరుసను సం । స్థానోద్దీపన విభావసంజ్ఞము లరయన్. ౧౧౫

ఆ. పటుముఖప్రసాదబాష్పశస్త్రాదులు । వరుసఁ దదనుభావవర్గ మండ్రు;
సాత్త్వికములు పులకసంఘాత వైవర్ణ్య । ఘర్మబిందువితతి క్రమముతోడ.

క. క్షితి దానదయారణ సం। గతులకు సంచారికములు గర్వ సదైన్యా
కృతి హర్షంబులు మొదలగు। వితతయథోచితవియోగవిధినెఱుఁగఁదగున్. ౧౧౭

## 6 భయానకము

క. ఉక్తవిభావాదులఁ బ్ర। వ్యక్తం బగుభయమయగు భయానక, మహితో
ద్రిక్తవ్యాఘ్రాదులు ని। ర్ణిక్తాలంబనము లనఁగ నియతము లయ్యెన్. ౧౧౮

చ. వితతభయానకం బయినవిశ్వనృపాలుపతాకవోలె మ
త్పృతియు వరాహలాంఛనము దాల్చిన నున్నతి కెక్కి దండభా
సతయును నంబరాభరణసంపదయు న్గని యెల్లవైరులన్
మతి దెరలించు నంచు వెతమాయ లొనర్తురు భీరు లద్రులన్. ౧౧౯

తే వలయునుద్దీపనవిభావవర్గ మరయ
సత్త్వగజహయపటహనిస్వనము లంద్రు
కలుగు ననుభావములు సాత్త్వికములు దలఁప
భయ విమోహాదిసంచారిభావచయము, ౧౨౦

## 7 బీభత్సము (రెండు విధములు)

క. వరుసవిభావాదులచేఁ। బెరుఁగు జుగుప్సయ తలంప బీభత్స మగున్;
బరువడి రెండగు [1]హేయా। చరణమున [2]విరక్తివలనఁ జను నెఱుఁగంగన్.

### (1) జుగుప్సా బీభత్సము

చ. జరపక విశ్వనాథునకు సత్యము దప్పినరాజు రాజ్యసం
హరణము నొంది దీనుఁ డయి యార్తి పెనంగొను, మేనిపుండ్లనుం
బురు వగురక్తపూరముల బ్రుంగి పయింబయి నంతకంతకున్
దొరఁచెడిపుర్వులం గెలికి తోడుచు వేఁడును రచ్చపట్టులన్. ౧౨౧

### (2) వైరాగ్య బీభత్సము

ఉ. ఎప్పుడుఁ గాఱుచొంగలకు నెత్తినచిప్పయుఁ బోని మోవియున్
జిప్పిలి రోతఁగాఁ గడుపుచీలినకప్పయుఁబోని యచ్చటున్
దప్పక సొమ్ముగాఁ దనర దప్పుల మాటల కర్దమంచు నో
రొప్పులు వల్కు శాత్రవుల నొల్లఁడు విశ్వవరేంద్రు డూఁకొనన్. ౧౨౨

తే. అతిజుగుప్సితములు నప్రియంబులును నా। లంబనములు, మదికి లాగు గాని
పూతిగంధవర్గములు తదుద్దీపనా। ఖ్యములు నాఁగ నెందు నతిశయిల్లు. ౧౨౪

క. వద నాక్షి ఘ్రాణ రద।చ్ఛద కూణన విధులపేరఁ జను నను భావా
స్పదము లనంగాఁ, దదుచిత। సదమలపులకాదికములు సాత్త్వికము లగుఁజా.

తే. అందు సంచారిభావంబు లనఁగఁ బరఁగు
సముచితోద్వేగనిర్వేదశంకనములు
భయ విషా దామయాహ్వయప్రభృతికములు
చతురు లెఱుఁగంగఁ దగు నంద్రు గృతులయందు. ౧౨౬

8 అద్భుతము

క. జనితవిభావాదులచే। ననుగత మగు విస్మయంబ యద్భుత మనఁగాఁ
జను, నాలంబన మశ్రుత। వినుతచమత్కార మనఁగ విశ్రుత మయ్యెఁజా. ౧౨౭

మ. శశికాంతంబులు సంతతార్ద్రితఁ గనుం జక్రాచలాగ్రంబునఁజా,
బ్రశమం బొందు నితాంతసంతమసముం బాతాళగేహంబునఁజా,
భృశసంపుల్లతఁ జేకొనుం గుముదినీబృందంబు మందాకినిఁజా,
విశదంబైన చళుక్యభూవిభు యశోవృద్ధిప్రభావంబునఁజా. ౧౨౮

తే. వరుస నుద్దీపనవిభావవర్గ మంద్రు। మేదురాశ్చర్యతర వర్ణనాదికములు,
చక్షు రానన గండ విస్ఫారణాదు। లడరు ననుభావములు నాఁగ నభిమతములు.

క. పులక స్వేద ప్రమదము। లలవడు సాత్త్వికము లనఁగ, హర్షావేగా
దులు సంచారులు గాఁ జను,। నలవడ యోజింపవలయు నయ్యైగతులఁజా. ౧౩౦

9 శాంతరసము

క. శమము విభావాదులచే। నమరం బరిపుష్టమైన నది శాంత మగుఁజా,
సమకొను నాలంబన మన। నతులము శాశ్వతము నైన యజపద సురయఁజా.

శా. డంభాచారము లుజ్జగించి, రిపుగాఢక్రీడ నిర్జించి, లో
కుంభద్విద్యలఁ జేర్చి, సద్గుణములఁజా శోభిల్లి, శక్తిత్రయా
రంభం బొప్పఁగ రాజయోగవిదుఁడై బ్రహ్మప్రబోధ స్థితిఁజా
శంభుశ్రీచరణార్చలం బ్రబలు విశ్వక్ష్మావరుం డెప్పుడుఁజా. ౧౩౨

క. హేమంతచతురసంఘా । షోదిత కౌతూహలంబు లుద్దీపనముల్
ఘేపేతర సమదర్శన । వాదము లనుభావములు శివప్రసరంబుల్. ౧౩౩

క. రోమాంచ స్తంభాదులు । నేమపు సాత్త్వికము లండ్రు, నిర్వేదము వి
ద్యా మతి ధృత్యాదులు నభి । రామ వ్యభిచారిభావరచనం జెందున్. ౧౩౪

నవరసాదుల యధిదైవతములు

సీ. శృంగార ముత్పలాంచితము విష్ణుఁడుగర్త,
తెలుపుహాస్యము గణాధిపుఁడుజేఁడు,
కరుణ కాషాయంబు కాలుఁడు పతి,
రౌద్ర మవ్యక్త రక్తంబు హరుఁడు విభుఁడు,
వీరంబు గౌరంబు వృత్రారి పతి,
భయానకము ధూమ్రము మహాకాలుఁ డీశుఁ,
దసితంబు బీభత్స మధిపతి నంది,
యద్భుతము హేమాభ మంబుజభవుండు

తే. భర్త, శాంతంబు నిర్మలస్ఫటికనిభము
పరఁగు నధిదైవతము బరబ్రహ్మ మండ్రు:
వివిధరసశాస్త్రవేదులై వెలయునట్టి
కవుల కివి యెల్ల నెఱుఁగుట కర్జమెపుడు. ౧౩౫

ఆ. ప్రథమరసము సామభవము, వీరంబు ఋ
గ్వేదసంభవంబు, వెలయురౌద్ర
రస మథర్వనిగమరచితంబు, బీభత్స
మది యజుఃప్రసూత మండ్రు బుధులు. ౧౩౬

తే. ఆది శృంగారజాతంబు హాస్యరసము,
రూఢరౌద్రోద్భవంబు కారుణ్యరసము,
పుట్టె వీరంబువలన నద్భుతసమాఖ్య.
మదరు బీభత్సమునకు భయానకంబు. ౧౩౭

క. శాంతము సర్వోత్తరరుచి । మంతం, బట్లగుట వైరమైత్రులు లే. వీ
చింతన మెఱుఁగనికవి కవ । గంతవ్యం బగునె రసవికాసప్రతిభల్. ౧౩౮

తే. మున్ను శృంగారబీభత్సములకు నొంట;
దరులు తమలోన వీరభయానకములు,
సమవిరోధంబు రౌద్రాద్భుతముల కెపుడు;
హాస్యకరుణంబులకుఁ బగ యనుదినంబు. ౧౩౯

చ. తమతమవంగడంబులకుఁ దప్పని భావకదంబకంబుచే
నమరు రసంబు; లంగకము లన్నిటికం బెఁ బరిస్ఫుటాకృతి౯
బ్రమద మొనర్చు నెద్ది యది ప్రత్యయ మంగి; రసప్రవృద్ధికి౯
గ్రమమున నిత్తెఱం గెఱుఁగు కల్పన మొప్పుఁ గవిత్వసిద్ధికి౯. ౧౪౦

క. సుఘటితపదార్థభావా । లఘుతరరసవత్ప్రబంధలంపటుఁ బతి భూ
మఘవుఁ డని మతి యొనర్తురు । రఘురామునిఁబోలెఁ బరశురాముంబోలె౯.

ఉ. తోయజమిత్రతేజు, గుణదోషవివేక నవీనభోజు, వి
ద్యాయన కంటకారసికహార్త, మహారథినీవిహార్త, గో
పాయితబంధువర్గు బలభగ్నపరాచలదుర్గు, నున్నమ
ద్రాయకటారిసాళువధురంధరు సత్ఫలవద్వసుంధరు౯. ౧౪౨

క. నారీజనమారుఁ జమూ । వారీవినిపతితవైరివారణు నానా
సూరీహితవితరణగుణు, । గౌరీపతిచరణకమలగంధానందు౯. ౧౪౩

మాలిని.

సకలనిగమవేది౯ జారుసంగీతమోది౯,
సకరుణదృఢచిత్తు౯ సత్త్వసంజాతవృత్తు౯
నికటనిధిసమాజు౯ నేతృసంపద్బిడౌజు౯
సుకవిజనవిదూరు౯ గుంఠితారాతివారు౯. ౧౪౪

## గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవింద వందన గోవిందామాత్య నందన
వివిధ బుధ విధేయ విన్నకోట పెద్దయ నామధేయ రచితంబైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబునందు
రసప్రపంచప్రకటన సముద్దేశంబన్నది
ద్వితీయోల్లాసము.



# తృతీయోల్లాసము



## నాయికానాయక ప్రకరణము

క. శ్రీలోలాక్షీలాయత । కోలధ్వజుఁ గుపితయువతికుసుమధ్వజుఁ జి
న్మూలస్థితి వృషభధ్వజుఁ । బాలధ్వజు నుగ్రసమరతత్పరకేళిన్. ౧

శా. శృంగారాదిరసోదయంబునకు సంసిద్ధాస్పదం బైన త
ద్రంగన్నాయకనాయికావిషయముం దత్తద్గుణశ్రేణిచేఁ
బొంగార వ్వివరింతు నేర్పడ సముద్భూతప్రబోధాత్ము లె
ల్లం గేడింపక యాదరింపుఁడు, దృఢోల్లాసంబు శోభిల్లెడున్. ౨

### నాయకుఁడు

సీ. శిష్టకులీనత, శీలంబు, శాస్త్రార్థ వేదిత, ప్రజ్ఞావివేకబుద్ధి,
యౌవన, ముత్సాహ, మాత్మదృఢత్వంబు, వినయంబు, దక్షత, వితరణంబు,
శౌచంబు, శౌర్యంబు, జనతానురాగంబు, సత్యంబు, ధైర్యంబు, సత్ప్రియోక్తి
మానంబు, తేజంబు, మాధుర్యవృత్తంబు, వాగ్మిత, బహుకలావాసనాప్తి,

తే. స్మృతి, కృతజ్ఞత, దూషణ మేళనంబు
ధార్మికత్వంబు, సౌభాగ్యదశ, యనంగ
వెలయుగుణములు విశ్వేశవిభుఁడవోలెఁ
దనరుభూపతి నాయకత్వము వహించు. ౩

### 4 నాయకభేదములు

క. [1]ధీరోదాత్తుండును మఱి । [2]ధీరోద్ధతసంజ్ఞితుండు [3]ధీరలలితుఁడున్
[4]ధీరప్రశాంతుండును బెం । పారెదు నాయకులు నలుగు రత్యుగ్రగతులన్. ౪

## (1) ధీ రో దా త్తుఁ డు

క. ధీరుఁడు గంభీరుఁడు స। త్కారుణ్యుఁడు నస్వయంకృత స్తుతి నిరహం
కారుఁడు నగునాయకుఁ డిల। ధీరోదాత్తుండు నాఁగ ధృతిఁ బెంపారున్. ౫

ఉ. క్రోయనివార్ధి, నెత్తురుల గ్రుంగనిరాముఁడు వంకవిల్లుగాఁ
జేయనికొండ, తనుఁ జెప్ప మదింపనిపెద్ద, యెట్టిచోఁ
బాయనినిక్కువంబులకుఁ బట్టు ధరిత్రిఁ జళుక్యవిశ్వభూ
నాయకుఁ; డమ్మహాగుణసనాథు నుదాత్తత యొప్పు నెప్పుడున్. ౬

## (2) ధీ రో ద్ధ తుఁ డు

క. అతికోపనుఁ, డతిమత్సరుఁ। డతిగర్వసమేతుఁ, డత్యహంకారబలా
న్వితుఁ, డాత్మశ్లాఘోదయ। చతురుఁడు, ధీరోద్ధతుండు చంచలుఁడు మతిన్. ౭

మ. ధర సర్వంకషగర్వముం, బిరుదమాత్సర్యప్రవిధ్వంసమున్
బరభూపాలపలాయనప్రకటన ప్రౌఢంబుఁ, గ్రోధోదయా
కరముం గ్రూరమునై చళుక్యవిభు నుగ్రవ్యగ్రకేతుస్థితాం
బరఖేలత్కరవాలపై రవసురూపం బొప్పుఁ బోరాటలన్. ౮

## (3) ధీ ర ల లి తుఁ డు

క. స్మరభీతుఁడు, మానవతీ। పరవశుఁడును, భోగలోలుపవ్రతుఁడును, సుం
దరుఁడును నయ్యెడునాయకుఁ। డరయంగా ధీరలలితుఁ డన విలసిల్లున్. ౯

చ. అరు దగురాజ్యతంత్రము నయప్రియుచేతికి నిచ్చి విశ్వ భూ
వరుఁ డఖిలాంగసుందరియు వారణయానయు నిత్యపుజ్మనో
హరయును నై తనర్చువిజయాంగనతోడిద లోక మై నిరం
తరము సుఖించుచుండు నవదర్పకుఁ డై సుభగత్వ మేర్పడన్. ౧౦

## (4) ధీ ర శా ం తుఁ డు

క. సుభగుఁడు, శుచియు, వివేకియు
నభిమానియు, మృదువు, సద్ద్విజాతులవంశ
ప్రభువుండున్ను నగునాయకుఁ
డభిమతముగ ధీరశాంతుఁ డనఁబొగడొందున్. ౧౧

ఉ. శ్రీయుతు లై యశేషసమచేతను లై వివిధాగమాదివి
ద్యాయతనంబు లై రసికు లై సుఖులై తరుణీవిహారపు
ష్పాయుధు లై చరింతురు ధరామరు; లట్టుల కాదె, రాజనా
రాయణదేవుచేఁ బడిన నచ్చెరువే యభిరామసంపదల్. ౧౨

శృం గా ర నా య కు లు 4

క. ఈనలువురు రసనవకస । మానస్థానముల జననమహిమంబులకున్
మానుగ శృంగారరసా । ధీనులు మఱి నలుగు రండ్రు తెలియఁగ వలయున్.

క. వనితావిహరణదళలం । [1]దనుకూలుఁడు [2]శఠుఁడు [3]దక్షిణాఖ్యుఁడు[4]ధృష్టుం
డును నన నలుగురు నాయకు । లనయము శృంగారమునకు నష్టలు చెప్పన్.

(1) అ ను కూ లుఁ డు

క. ఏకవధూరక్తుండై । యేకొఱఁతయు లేక సమసమీహితగతులన్
గై కొనిమెలఁగెడు నాతఁ డ । నాకులుఁ డనుకూలనాయకాఖ్యం బడయున్. ౧౩

శా. సద్రాగాన్వితగా నొనర్చుఁ గరసంచా రోపచారంబులన్,
భద్రశ్రీపరిలిప్తఁ జేయు సుమనఃపర్యాప్తఁ గావించు యు
క్తద్రవ్యప్రతిపత్తిచే, వసుమతింగాఁ జాలఁ బాలించు, ని
ర్ణిద్రప్రీతిఁ జళుక్యనాథుఁడు ధరిత్రీకాంత నెల్లప్పుడున్. ౧౪

(2) శ ఠుఁ డు

క. ఒరు లెఱుఁగకుండ నప్రియ
కరుఁడు శఠుం డనఁగ బరఁగుఁ, గడుఁ గపటకళా
కరుఁడు నిజప్రియవనితా
పరితాపప్రదుఁడు క్రియలఁ బరికింపంగన్. ౧౫

ఉ. వల్లభ యైనకీర్తిసతివార్తల నిమ్ముల వించు విశ్వభూ
వల్లభుఁ డర్థ మర్థులకు వావిరి నిచ్చుట కీరసంబు నం
దిల్లదు లచ్చి కేయెడలఁ దీయపుఁజూపులలోనఁ గెంపు రం
జిల్లిన కాక; ధీరలకుఁ జిత్తమునం దొకవింత కల్గనే. ౧౬

(3) దక్షిణుఁడు

క. పెక్కండ్రు ప్రియలయందుం
జక్కనిమొగమోట యొక్క చందంబున నిం
పెక్కిన దక్షిణనాయకుఁ
డక్కజ మెఱుఁగంగవలయు నది చతురులకున్. ౧౯

మ. అరు దెం దైనఁ జళుక్యవిశ్వవిభు నెయ్యం బొక్కచందంబునం
గర మొప్పారుచు నుండు సైంధవివయిన్ గాంధారిపై నించు
ఘూర్జరిపై మాళవిపై వరాళికపయిన్ సౌరాష్ట్రిపై గౌడిపై
సరి నీమాట లరాతిరాజతనయా శంకామతిం జేయుచున్. ౨౦

(4) ధృష్టుఁడు

క. స్పష్టాపరాధపిశునుఁడు, । దృష్టాన్యారచితరతుఁడు ధృష్టుం డగు; సం
దష్టాధరాదిదర్శన । పుష్టవధూకోపుఁ డభయభూతుం డెపుడున్. ౨౧

చ. ఒరసి చళుక్యభూపతికి నోడినవైరికిఁ గాననంబులోఁ
గరిమదగంధము ల్గుటిలకంటక రేఖలు ఘర్మితాంగమున్
సురత వికారలీలఁ దలచూపినఁ దత్సతి యల్కఁ జెందెఁ; ద
ద్వరుఁడునుఁ దేటగాఁ దెలిపెఁ; వక్రత నమ్మద యెన్ని చెప్పినన్. ౨౨

శృంగారనాయక సహాయులు 4

తే. పృథివి నేతత్సహాయులు [1]పీఠమర్ద
[2]విట [3]విదూషక [4]చేటక విదితనాము
లోలి నలువురు; వీరి యయ్యుచితగతులు
వలయుఁ దెలియంగఁ దద్గుణవర్తనముల. ౨౩

తే. పీఠమర్దుండు దగుఁ గార్యపేశలుండు,
వాని కించుక తక్కువవాఁడు విటుఁడు,
తొడఁగి నవ్వించునేవి విదూషకుండు,
చేటకుఁడు సంధికల్పనసిద్ధికరుఁడు. ౨౪

## నా యి క లు 3

శా. శృంగారప్రథమప్రధానకము లై చెన్నారుశోభామలన్
బొంగారం బ్రకటిల్లు నాయికల యుద్భూతప్రకారంబులన్
రంగల్లక్షణలక్ష్యవృత్తిఁ గని లో రాగిల్లు చొప్పునన్; మద
త్వంగస్నీరసవాదరోషములచేతం గల్గునే సౌఖ్యముల్. ౨౭

క. నాయికలు [1]స్వకీయయుఁ [2]బర
కీయయు [3]సాధారణియును గీర్తిత లగుదుర్,
పాయక వారలవలన గు
ణాయత్తార్థములు గలుగు; నవి యెఱుఁగఁ దగున్. ౨౮

## 1 స్వీయ (స్వస్త్రీ)

క. సతియును శీలార్జవసం। గతయుం గులవతియు నఖిలకల్యాణగుణా
న్వితయును లజ్జాళువు నగు। నతివను రసికులు స్వకీయ యందురు కృతులన్.

*క. కులవతియును శీలార్జవ। కలితయు సతియును నశేష కల్యాణగుణో
జ్జ్వలయును లజ్జాళువు నగు। నలినీలకచన్ స్వకీయ యందురు కృతులన్

చ. అలఘుచరిత్రలున్ శుభగుణాన్వితలున్ గురుబంధుమిత్రవ
త్సలలును దర్పహీనలును ధర్మవిధిజ్ఞలు రూపసంపదా
కలితలు నైనదారికలఁ గానిక లిత్తురు సంధివేళలన్
నలినహితేందువంశనరనాథులు విశ్వనరేంద్రభర్తకున్. ౨౯

## 2 ప ర కీ య (అన్యస్త్రీ)

క. పరకీయ రెండుదెఱఁగులు,। కరపరిణీతయును బేరుగలకన్యయు నాఁ
బరిణీత రాగరసములఁ। బరికల్పిత గాదు సత్ప్రబంధములందున్. ౩౦

ఆ. కన్య పరిణయాభికాంక్షచే రాగాంగ
మగుట రసమునందు నగు నుతింపఁ;
బిన్నయయ్యుఁ దనకుఁ బెండ్లి యొమాట లా
లించు నౌలఁ గన్యలీలఁ బోలె. ౩౧

*ఇది పైదానికే పద్యాంతరముగా నున్నది.

ఉ. సాలకపాలభాగలును నంకురిత స్తనబింబలుఁగా వికల్పాలసబాలలీలలను నల్పవివేకలు నైనవైరిభూ
పాలురముద్దుఁగన్నియల భాగ్యము నెన్నుదు రర్థి విశ్వభూ
పాలుని రాజ్యలక్ష్మికి సపత్నిక లయ్యెద రంచుఁ బ్రాజ్ఞకుల్. ౩౨

3 సా ధా ర ణ నా యి క (సాధారణ స్త్రీ)

క. సాధారణి యన గణిక, క । ళాధౌరేయాత్మ కపటలంపట లీలా
మాధుర్యవిధాయిని దుర । గాధమనోవృత్తి దానిగతిఁ దెలియంగన్. ౩౩

చ. అనిఁ బరగండభైరవభుజాపివడిం బడి పుణ్యమూర్తు లై
వినుతగతిం జరించు బలువీరులఁ గైకొని యేపు మీఱ ము
న్ననఁగి పెనంగి కూర్చు సువిటావలులన్ దొలఁగించి రప్సరో
వనితలు; పైఁడిపెట్టి విలువం గలవే వెలయాండ్రకూరుముల్. ౩౪

స్వీ యా భే ద ము లు 3

క. చతురస్వకీయగుణనం
గతి [1]ముగ్ధయు [2]మధ్యయుం [3]బ్రగల్భయు ననఁగా
రతిపతితంత్రంబులచేఁ
బ్రతిపాదిత లైరి మూఁడుభంగుల వరుసన్. ౩౫

1 ముగ్ధ

క. జవ్వనములోన నడు గిడ । మవ్వపుమది సిగ్గుచేత మరుని గెలిచి లో
నివ్వటిలఁ, గఱదలెఱుఁగని । యవ్వెలఁదుక ముగ్ధయనఁగ నభినుత యయ్యెన్.

సీ. ఆత్మసేమంబున కట్టాడు చనుఁగవ
యలఁతిపయ్యెదచాటు నాసపడఁగఁ,
గన్నుఁగ్రేవలఁ గ్రాలఁగడఁగు వాలికచూడ్కి
సొబగారుసిగ్గుతో సుడివడంగఁ,
బోరిపోరి బొమలపైఁ బొలుపారునలకలు
చేతికెంజాయతోఁ జెలిమిసేయ,
పలుకనై తోఁచు నెన్నడు మించునూఁగారు
మాటున నొక్కింత మఱుఁగుపడఁగ,

తే. నంగజుఁడు వేడ్క లోనఁ జిట్టాడ నడరు
ముగ్ధ డెందంబుఁ గనుఁగొని ముదము నొనఁగుఁ
జతురలీలల విశ్వేశచక్రవర్తి
యూష్మశరదాగమంబుల నుచితగతుల. 30

## 2 మ ధ్య నా యి క

క. సంపూర్ణయౌవనోచిత । సంపత్తియుఁ గామినియును సమలజ్జయుఁ బ్రే
రింపగ మోహోత్తరరతి । లంపటయు న్మధ్య యనెడు లలన దలంపన్. 31

సీ. హ్రస్వోన్నత సమాయ తాంగవిస్ఫూర్తిపై
నిబిడలావణ్యంబు నిట్టత్రోవ,
నేపథ్యశృంగార నియమిత రచనపైఁ
దారుణ్య సంపత్తి దళుకులొత్త,
మిళితరాగాభోగ మృదుగల్లపాళిపై
సమ్మదోద్రేకంబు జాలువాఱ,
లాలితలజ్జావిలాసంబుపై సాంద్ర
కందర్ప దర్పంబు కందళింప,

తే. కొమరు మిగిలెడు మధ్యఁ గోర్కులకు నెల్ల
నెల్ల యై యొప్పు విశ్వేశవల్లభుండు
భావజక్రీడఁ గవఁ గూడి పరిణమించు
విమల హేమంత శిశిర కాలములయందు. 32

## 3 ప్ర గ ల్భ నా యి క

క. అతిరూఢ వయోభిమతయు । నతికామావేశ మతియు, నంగజవిద్యా
చతురయు, నతిలీనమనో । గతియును నగువనిత తగుఁ బ్రగల్భయనంగన్.

సీ. పయ్యెదకొంగులోపలఁ బిక్కటిల్లెడు
నెవ్వఁగుఁజన్నుల నింపుసొంపు,
తళుకుతో లజ్జకుఁ దల మీఱి క్రాలెడు
విడువాలుఁజూపుల నిశితగతియుఁ,

ప్రణయానులాపసంపత్తిలోఁ గొంకక
మున్నాడి యేతెంచు మొక్కలంబు
నొడికంపుఁజేఁతల యొఱ పెఱింగినవింత
పేశ్వాటుపనిగల పెడఁగుదనముఁ,

తే. గలిగి తమకించునెడలఁ బ్రగల్భఁ దగిలి
వేడ్క విహరించుఁ జాళుక్యవిశ్వవిభుఁడు
చారువర్షావసంతర్తు సమయములను
బాలితాఖిలరాజ్యవైభవ మెలర్ప. ౪౧

ధీరాదినాయికా భేదములు 3

క. అరయ ముద్దియ వెలిగా । గారవమున మధ్యయును బ్రగల్భయు వరుసన్
ధీరయు ధీరాధీరయు । ధీరేతరయును ననంగఁ ద్రివిధాఖ్య లిలన్. ౪౨

1 ధీర

క, తెల్లపుటపరాధము గల । వల్లభుఁ గని వినయమృదుల వక్రోక్తులచే
నుల్లసము దోఁపఁ బలికెడు । నల్లలనకుఁ బేరు ధీర యండ్రు రసజ్ఞుల్. ౪౩

చ. లసితము లైనలేఁజెమరులన్ జెలువారెడిమేనితావియున్
బొసఁగ విలోచనాంతములఁ బొంపిరివోయెడువింతరాగమున్
వసుమతి గారవించుచు శ్రమంపడ కుండిన నేల కల్గ నిం
పెసఁగఁగ నంచుఁ బల్కెఁ దర శేక్షణ యోర్తు చళుక్యవల్లభున్. ౪౪

2 ధీరా ధీర

క. నేరమి చేసినపతిఁ గను న్నారం గని లోచనముల నశ్రువు లొలుకన్
దోరపువక్రోక్తులఁ దగ । ధీరాధీరాఖ్య పలుకు ధృతి కడ కొదవన్. ౪౫

చ. చతురత విశ్వభూవిభుఁడు జాదులు మాళవి కిచ్చె, నిచ్చినన్
బ్రతిభ వహించి లాటి పిదపం దన కిచ్చినపాటలంబులం
బతిపయిఁ బాఱఁ జిల్కి దనబాష్పకణంబులు రాల రోషభా
షిత యగు చుండె; నత్తెఱఁగు చిత్తమునం బరికించెనో కదే. ౪౬

3 అధీర

క. అపరాధి యైనపతిపై । నుపచితరోషమున నశ్రు లొలుకఁగ నుద్య
ల్లపితము లల్లసములుగా । నెప మిడుచు నధీర వలుకు నెయ్యము కలిమిన్. ౪౭

చ. ఒదవెడువేడ్కఁ దన్ను మును నూఱడఁ బల్కి మొఱంగి చన్న చ
క్కదనములు రోషబాష్పకణగద్గదభాషలచేతఁ జెప్పుచున్
ముదిత చళుక్యవల్లభునిమ్రోలఁ దనర్చుట చూచి నెచ్చెలుల్
మదనునిచేఁతకుం దరుణిమానము లేఁతకు నొచ్చి రిచ్చలన్. ౪౮

1 ప్రగల్భధీర

క. అలుక దలచూపకుండెడు
పలుకులఁ జేఁతలును నచ్చుపఱచుచు దయితున్
కలితాపరాధు మదిలో
నలయించుఁ బ్రగల్భధీర యర్హక్రియలన్. ౪౯

చ. వెలి నపరాంగనాప్తుఁ డగువిశ్వనృపాలునిఁ బ్రీతిచూపు చూ
పుల నలరింపదయ్యె మణిపుత్రికఁ జూచుట గారణంబు గాఁ,
జిలుకకు నత్తఱిం జదువు చెప్పుకతంబునఁ బల్కదయ్యెఁ, దొ
య్యలి యెదు రేఁగదయ్యెఁ గలహంసికి నెన్నడఁ జూపు చుండుటన్. ౫౦

2 ప్రగల్భధీరాధీర

క. కినుకయుఁ దాలిమియును జెం । దిన మాటల నాప్రగల్భధీరాధీరాం
గన యుల్లసముల పెనఁకువ । తనముఁ బ్రసాదంబుఁ జూపుతగవరి దలఁపన్.

మ. అతివా నాకుఁ జళుక్యనాథచతురవ్యాపారముల్ విన్న సం
తతమోదంబు జనించు, నంతటన ధూర్తక్రీడ లాలించినన్
బ్రతిపన్నం బగుఁ గోప, మప్పు డటు సోత్ప్రాసోక్తికిం జొచ్చినన్
హితమందస్మిత మబ్బు మోమునకు ము, న్నీ కౌతుకం బెట్టిదో! ౫౧

3 ప్రగల్భాధీర

క. కూరిమిపతి తన కోపము । వారించినఁ ద్రోచి పిదప వచ్చి యతనిఁ దా
నూరార్చునది ప్రగల్భా । ధీర యనం బరఁగు రసిక దృష్టికి నరయన్. ౫౨

శా. ఆపంచాయుధు పెంపు, నాహిమకరాహంకార, మాకోకిలా
టోపంబుం దరియింప లేక సతి వింద్రుంగూర్మితో ధైర్యసీ
మాపర్యాప్తికి నెగుగా మణిరణన్మంజీరపుంజీకృత
క్ష్మాపవ్రాతకిరీటు మ్రొక్కి నిలిచెం జాళుక్యవిశ్వేశ్వరుఁ. ౫౪

క. జ్యేష్ఠయు మధ్యాఖ్యయును గ। నిష్ఠయు ననఁ గృతులఁ బరఁగునెలఁతలకును నీ
నిష్ఠితగుణములు వరుసఁ బ్ర। తిష్ఠితములు సరసగతులఁ దెలియఁగవలయున్.

అష్టవిధనాయికలు

తే. కలరు [1]స్వాధీనపతికయు [2]ఖండితయును
[3]ప్రోషితప్రియయును [4]విరహోత్కలికయు
నౌల [5]నభిసారికయుఁ [6]గలహాంతరితయు
[7]సంప్రవాసిని [8]వాసకసజ్జికయును. ౫౬

క ఈయెనిమిది శృంగారవి। ధాయి దశాకలిత లైనతరుణుల తెఱఁగుల్
పాయక లక్షణలక్ష్యో। పాయంబులఁ దెలియవలయుఁ బ్రౌఢప్రతిభుల్. ౫౭

1 స్వాధీనభర్తృక

క. మధురానువర్తి యగు తన। యధిపతిచే నెప్పు డర్పి తాభరణావిల్
ప్రథిత యగుచుండు కోమలి। కథితస్వాధీనభర్తృకాసంజ్ఞ యిలన్. ౫౮

మ. ప్రతిపక్షప్రతిపాదితక్షతులు చూపన్ జెప్ప లే వెన్నఁడున్
బ్రతికాలస్వకృతోత్సవాభరణభద్రశ్రీవిమిశ్రక్రియా
చతురత్వం బలరారుచుండు నెపుడున్ జాళుక్యవిశ్వేశ్వరుం
బతిగా నోచిన రత్నగర్భయనులాభం బొప్పుఁబో పృథ్వికిన్, ౫౯

2 ఖండిత

క. రే యెల్ల నన్యసురత। శ్రేయస్కుఁడు కృతమనోజచిహ్నుఁడు నగున
న్నాయకుని పీడ నాడెడు। నాయంగన ఖండితాఖ్య యగుఁ బరికింపన్. ౬౦

శా. చారుస్పర్శసమీరసూచితతనూసౌరభ్య మింపారఁ గా
శ్మీరీసంగమశంపి యైనఁ గని గాసిల్లెం బ్రకాశాంగజా
కారుం డై విలసిల్లువిశ్వవిభుపైఁ గర్ణాటి గాశ్మీరితో;
నారాజన్యుఁ డెఱుంగు టచ్చెరువె తద్వ్యామోహఖేదంబులన్. ౬౧

### 3 ప్రోషితభర్తృక

క. పతి పరదేశాంతర పరి
గతుఁ డై క్రమ్మఱక యచటఁ గడు మసలుటయుఁ,
మతిఁ దుందుడుకుం జెందెడు
సతిఁ బ్రోషితభర్తృక యనఁ జనునండ్రు బుధుల్. ౬౨

ఉ. శ్రీశుఁ జళుక్యవిశ్వధరణీశు భజింపఁ దలంచి చన్న యా
త్మేశుఁడు వచ్చునంతకుఁ బురేందిరకుం బ్రభవించెఁ దోడుతో
నాశలమాలుపాటు మలినాంబరభావము నంగవర్ణసం
క్లేశవికారముం నిరవలేపతయుం సుమనోవిముక్తియుం. ౬౩

### 4 విరహోత్కంఠిత

క. వరుఁ డనురక్తుం డయ్యు ని। తర మగు పని గలిగి రాక తడయుటయు విభా
వరియందు నడలుపొలఁతుక। విరహోత్కంఠిత యనంగ విశ్రుతి కెక్కుం.

చ. నవరసగీతవాద్యనటనంబు రుచించిన రాక తక్కెనో,
వివిధకవిప్రబంధరసవీచులఁ దేలి తలంపఁడయ్యెనో,
గవ యగురాచకర్జములు గగ్గెనొ కాక, చళుక్యమేదినీ
ధవుఁ డిటు లేటికిం దడయుఁ, దారలు వెల్లఁదనంబు గూరెడుం. ౬౫

### 5 అభిసారిక

క. ముంగిటికై నడ సాగ న। పాంగము తిమిరంబె దిశల నడఁపఁగ దమితోఁ
జెంగక పతికడకుం జను। నంగన యభిసారికాహ్వయంబుం బడయుం. ౬౬

మ. క్రియ నుద్దామఘనాఘనాకలితముం గీలాలధారాళముం
భయదోద్యచ్ఛతకోటిఘోషణము నై భాసిల్లుఁ బోరాటలోఁ
బ్రియలీలాచపలావలోకములు శోభిల్లం బ్రసన్నాకృతిం
జయసీమంతిని వచ్చి మెచ్చి కలయుం జాళుక్యవిశ్వేశ్వరుం. ౬౭

### 6 కలహాంతరిత

క. కలహాంతరిత యనంగా। వలవనిపొలయల్కఁ జేసి వల్లభుతోడం
బలుకక పిమ్మట మదిలో। నలఁదురునెలఁతుకకు నామ మండ్రు రసజ్ఞుల్. ౬౮

చ. తొలితొలి నల్గె విశ్వవిభుతో మననెచ్చెలి; రిత్తయల్కకుం
దెలియఁడ రాజు; దప్పకుఁడు తీపుల విల్లదె యెక్కువెట్టెఁ; గ్రొ
న్నెల వాడతెంచె; నింకఁ గరణీయము సఖ్యము సేయునేర్పు తొ
య్యలి యలికేందురేఖకును నవ్విభుపాదపయోజలక్ష్మికిన్. ౭౯

7 వి ప్ర ల బ్ధ

క. పంచినయెడ కేతేరక। వంచించిన దయితుతో వివాదము సంపా
దించి, చెలితోడ దుఃఖో। దంచిత యగు విప్రలబ్ధ తత్పరబుద్ధిన్. ౮౦

శా. చాళుక్యక్షితినాథ నీ పనుపునన్ సౌరాష్ట్రి యేతెంచె; నీ
వేలో జాలము సేసి రామికి మరుం డిష్వాసముం దాల్చె; నా
యాలాపంబులు నమ్మవేనియును, రమ్మా చూతు కన్నీటిచేఁ
జాలం బంకిలభాగ మైనవిలసత్సంకేతసద్మస్థలిన్. ౮౧

8 వా స క స జ్జి క

క. భాసురుఁడై పతి నగరికి। మాసరమున వచ్చు ఔటిఁగి మణిమండలవి
న్యాసాలంకృత యగు సతి। వాసకసజ్జిక యనంగ వల నై యొప్పున్.

మ. పరిలేపస్ఫుట హేమకుంభకుచయున్ బ్రాలంబముక్తాఫలాం
బరవిభ్రాజితమూర్తియున్ వికచపుష్పస్రగ్వితానాంతర
స్ఫురితాకారయు నై వెలుంగు పురి సంశోభిల్లె విశ్వావనీ
వరుఁ డేతెంచె జయాప్తితో ననెడు నీవార్తావిశేషశ్రుతిన్. ౮౩

దూ తి క లు 8

తే. వీరలకు దూతికలు ¹ప్రతివేశినియును
²చెలియు ³దాసియు ⁴ధాత్రియు ⁵శిల్పినియును
⁶లింగినియుఁ ⁷గారువును, వీరు లేక యున్నఁ
⁸దాన యైనను నగుఁ బ్రియతంత్రములకు. ౮౪

క. శ్రీయుతు లగునీనాయక। నాయిక లిరువాగు, భాజనంబులు శృంగా
రాయతజననమునకు నివి। వో యెఱుఁగం దగినయవి సుబుద్ధుల కెల్లన్.



### సత్కావ్య లక్షణము

సీ. రచితసహాయాంగ రసపరివ్యక్తియుఁ, బూజ్యాంగిక రసానుపోషణంబుఁ,
గ్లానివిభావాది కష్టకల్పనమును, శత్రుభూతరసాది సంకరమును,
సద్మకాలాది రసప్రరోహణమును, రసభావనామోచ్చరణపదంబు,
ననుచితక్రమ శాసనాగ్రహసంచారి భావానుబంధనప్రసరణంబు,

తే. పొడముభావరసాభాసములు దలంప,
పీనిఁ బరికించి తొలఁగించి విశ్రుతముగఁ
గబ్బ మొనరించు సుకవిపుంగవులఁ గాని
యన్యు మెచ్చఁడు రాజనారాయణుండు. ౭౬

మ. చతురశ్రోత్రసుఖాకరామృతపరిష్యందంబు నందంబునై
క్షితిఁ గావ్యప్రసరంబు వొల్చు నిఖిలక్షేమంకరస్ఫూర్తితోఁ
బ్రతిభావంతులు మెచ్చ లక్షణము నొప్పం జెప్పుమం బూర్వక
ల్పితశాస్త్రానుగతంబు సంగతముగాఁ బ్రీతిప్రవవ్యక్తిచేన్. ౭౭

శా. దివ్యంబైనకృతిత్రయంబు, వివిధోక్తిం బద్యశాస్త్రంబులున్,
భవ్యంబైనపురాణవర్గమును, గుప్తంబైనవిద్యాప్రపం
చవ్యాపారము నేమిటం గలిగి యక్షయ్యంబులై పేర్చుఁ ద
త్కావ్యం బేరికి నింపుగా దెఱిఁగినం గల్పాంతరస్థాయియై. ౭౮

క. సమయజ్ఞుఁడు సమచిత్తుఁడు। సమశబ్దార్థప్రయోగచతురుఁడు భావ
క్రమరసపోషణరచనా। కమనీయప్రతిభుఁ డిల సుకవి యనఁ బరగున్. ౭౯

### సప్తవిధకవులు

తే. [1]వాచి [2]కార్థులు [3]శిల్పక [4]శౌచికులును,
[5]భూషణార్థియు [6]మార్దవస్ఫురణకరుఁడు,
నల [7]వివేకియు ననఁగ సప్తాహ్వయములఁ
గవులు నెగడుదు రీహితకావ్యములను. ౮౦

### 1 వాచికుఁడు

క. ఛలవర్ణ గుచ్ఛపిచ్ఛిల। లలితపదాడంబరా వలంబన కవితా
సులభ విరచనాచతురుం। డలవడు వాచికుఁడు నా నుదగ్రప్రౌఢిన్. ౮౧

2 ఆర్థుఁడు

క. మితశబ్దమయ్యు నర్థము । సతతవ్యాఖ్యానలాలనక్షమవిపుల
స్థితి నొప్పఁ గవిత సెప్పెడు । నతఁడార్థుం డనఁగ నెగడు నార్యులసభలన్. ౮౨

3 శిల్పకుఁడు

క, మహితసుశబ్దార్థంబులు । బహువిధయమకార్థబంధబంధుర రచనా
నిహితవిచిత్రము లై । చన విహరించున్ శిల్పకుండు విశ్రుతకృతులన్. ౮౩

4 రౌచికుఁడు

క. ఒదవెడుకృతిపైఁ గలసొబ । గదలక యెందాఁక నిష్ట మగు నందాఁకన్
మృదుమధురరచన సువిశా । రదుఁ డై సాగించునతఁడు రౌచికుఁ డెందున్.

5 భూషణార్థి

క. తివుటవడి నొడువునప్పుడు, । వివిధాలంకారసరణి విడువక చవి గా
నవహితుఁ డై కృతిచెప్పెడు । కవి యెందును భూషణార్థి కడుఁ బొగడొందున్.

6 మార్దవానుగతుఁడు

క. సరళము లగుశబ్దములను, । విరళము లగునర్థములను, వీనుల కింపం
దరళత లేక రసౌఘము । లరుదుగఁ గృతి చెప్పు మార్దవానుగుఁ డెపుడున్.

7 వివేకి

క. శ్రుతశాస్త్రాలంకార । ప్రతిభుఁడు, శబ్దాదిదోషపటుగుణఘటనా
చతురుఁడు వివేకి నాఁ జను । నతఁడు మహాకవిశతంబులందుఁ జరించున్. ౮౭

కవితాశక్తి

క. ఛందోలంకారాదుల । పొం దెఱిఁగిన, నెద్ది లేక పొసఁగదు కవితా
సుందరత శక్తి యది, యా । కందుః దగనెఱుఁగువాఁడె కవివరుఁ డెందున్,

తే. శక్తి వెలి యైన కావ్యోక్తి సాధనంబు
లెల్లఁ జీఁకటియింటిలో నిడినసరకు;
లెన్ని ఋతువులు గల్గిన నెట్లు పూచు
మహి వసంతాగమము లేక మావిమోక.

చ. వినుతయశంబునం గలుగు విశ్రుతనాకనివాస; మయ్యశో
జననము శ్రవ్యకావ్యములసంగతి నొప్పఁగు; శ్రవ్యకావ్యముం
దనరుఁ గవిప్రభావమునఁ; దత్కవిసమ్మతి రేవిరాజు లే
పున, విహరింప. రవ్విభులు పోయినజాడ లెఱుంగఁ బోలునే. ౯౦

## కా వ్య భే ద ము లు 3

తే. అట్లు కవికృత మైన కావ్యత్రయంబు
గద్య పద్య విమిశ్రసంపాద్య మండ్రు.
నగరము ఖ్యాష్టదశ వర్ణనములచేతఁ
బరఁగు నదియును భవ్యప్రబంధ మనఁగ. ౯౧

## అ ష్టా ద శ వ ర్ణ న లు (18)

మ. 1పుర 2వారాశి 3మహీధర 4ర్తు 5శశభృ 6త్పూషోద 7యోద్యాన 8పు
ష్కరకేళీ 9మధుపాన 10మోహన 11 వియోగ 12క్షేమయాన 13స్వయం
వర 14పుత్రోత్సవ 15మంత్ర 16 దూత్య 17రణ 18దోర్వైవక్రాంతిసంకీర్తనా
కర మష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యం బిలన్. ౯౨

## 1 న గ ర వ ర్ణ న ము

క, దుర్గమ పరిఖా వరణ। విసర్గబలానీక చతురచాతుర్వర్ణ్యా
నర్గళసంప ద్వన జల। వర్గస్తుతి వలయు నగర వర్ణనమునకున్. ౯౩

సీ. గంభీరపరిఖ నాగస్త్రీల కశ్రాంతకేళివిహారదీర్ఘిక యనంగ,
నుత్తాలసాల మన్యుల కుబ్బు దివిఁ బ్రాఁకఁ జేసినదీర్ఘనిశ్రేణి యనఁగ,
చతురచాతుర్వర్ణ్య సంఘ మర్థులపాలి రాజితకల్పకారామ మనఁగఁ,
బ్రాంతసుస్థితమైన భవజూటవాహిని భుక్తిముక్తిప్రదస్ఫూర్తి యనగ,

తే, నెప్పుడును నొప్పురాజమహేంద్రవరము। ధరణిఁ గల్పించె నేరాజు తనదుపేర
నట్టి రాజమహేంద్రునియనుఁగుమనుమఁ। డెనఁగుఁ జాళుక్యవిశ్వనరేశ్వరుండు.

## 2 స ము ద్ర వ ర్ణ న ము

క. సిరినెలవు, గురుసుధార్తియు, । నరుదారఁగ నజునితండ్రియల్లుఁడు, రత్నా
కరము దనపేరు, జలధికి । సరిగలరే యరయ ననుచుఁ జను వర్ణింపన్. ౯౪

మ. అతిగాంభీర్యము గోత్రగోపనము సత్త్వాటోపమాహాత్మ్యముల్
హితలక్ష్మీసదనత్వముల్ సతతవృద్ధితప్రభావంబు ను
న్నతసర్వోత్తరజీవనోదయము నానావాహినీసౌఖ్యశా
లితయుం బేర్చుఁ జలుక్యనాథునకుఁబోలెన్ జూడ నంభోధికిన్. ౯౬

## 3 పర్వతవర్ణనము

క. అచలతయును నున్నతియును। ఖచరవినోదౌచితియును గనకాది ఖనీ
రుచితయును మొదలుగాఁగల। ప్రచురతులు నుతింపవలయుఁ బర్వతమునకున్.

మ. చెలువారున్ నవరత్నపాదకటకశ్రీచేత, గంధర్వమం
గళ నాదంబులతోడ నొప్పగు, నభంగస్థైర్యవృత్తిన్ మహా
బలు నైనం బ్రహసించు, భూభరణశోభం దాల్చి మిన్నందుమున్
గులశైలంబులపెంపు విశ్వవిభుతోఁ గూర్పం దగున్ ధీరతన్. ౯౮

## 4 ఋతువర్ణనము (1) వసంతవర్ణనము

క. అంకురపల్లవపత్త్రిస। మాంకితముకుళప్రసూనహారిఫలములన్
బొంకము లగువనములు ని। శ్శంకముగ నుతింపఁబడు వసంతమునందున్ ౯౯

మ. స్మరబాణంబులు వాఁడు లయ్యె, గుణవిస్ఫారంబు ఘోరంబుగా
నెరసెం, గీరము లంగజాతబిరుదానీకంబు గీర్తించె, మిం
చె రసాలాగ్రములు, పల్లవార్చులు దలిర్చెన్, విశ్వనాథావనీ
వరుతో నల్గుట చెల్లునే యనత యై వామాక్షి కీపట్టునన్. ౧౦౦

## 2 గ్రీష్మవర్ణనము

క. ధారాగృహముల నవఘన। సారాదుల గంధసారసరసపటీరో
శీరవ్యజనాదుల నిం। పారఁగ వర్ణింపఁ దగు నిదాఘాగమమున్. ౧౦౧

శా. ధారామండిత సాలభంజికలచేతన్ జిత్రయంత్రోద్గళ
త్సారామోదతుషారపూరములు విస్తారంబు లై పర్వఁ గాం
తారూఢేక్షణదీప్తితోడన చళుక్యాధీశుపైఁ జంద్రవం
శారాధ్యుం డని చంద్రి కారసము నిం పై క్రాలుచందంబునన్.

(3) ప్రావృడ్వర్ణనము

క. తటీవలన మేఘపటలీ । ఘటితాంబర శక్రచాప కరకావ్రాత
స్ఫుటధారాసారాది వి । కటత నుతింపంగవలయు ఘనకాలమునన్. ౧౦౩

మ. చపలాలోకములుం, బయోధరగరిష్ఠశ్రీయు సద్యోల్లస
ద్విపులానందము, నంబరాభరణసద్వేషంబునుం, గంకణ
స్థపుటారావము సొంపు మీఱఁ దగువర్షావేశ విశ్వేశ్వరా
ధిపు సేవించుప్రగల్భకామినిగతిన్ దీపించు భావింపఁగన్. ౧౦౪

(4) శరద్వర్ణనము

క. వెన్నెల సొంపును, జుక్కల
చెన్నును, దెలుపారుదెసలచెలువంబులు వి
చ్ఛిన్నము లగుజలదంబుల,
సన్నుతి సేయంగవలయు శారదవేళన్. ౧౦౫

శా. సోమశ్రీలకు వన్నె వెట్టును, ఘనస్తోమంబునం బర్వునా
శామాలిన్యము నొంచఁ ద్రోచు, నవరాజద్రాజహంసావళిం
బ్రేమంబుం బచరించు, మానసమునం బెం పై, శరద్విభ్రమం
బామోదప్రద మైనవిశ్వవిభు నుద్యత్కీర్తికిన్ సాటి యై. ౧౦౬

(5) హేమంతవర్ణనము

క. బలవత్కాలీయక కం
బళ ఘనకౌశేయపట్ట పట మాంజిష్ఠం
బులఁ జనదు సీతు, యువతుల
వలిచన్నులఁ దక్క ననుచు వలయుం బొగడన్. ౧౦౭

మ. తరుణీయౌవనగర్వజృంభిత కుచోద్యద్గ్రీష్మగంధంబులన్
వరకాశ్మీర ససాంక వాగురురస వ్యాసక్తులం బట్టికాం
బర మాంజిష్ఠపటాదులన్ హిమగతిం బ్రాపింప రీవిశ్వభూ
వరు మెచ్చించిన సత్కవీంద్రు లతులావాసంబులం దిమ్ములన్. ౧౦౮

(6) శిశిరవర్ణనము

క. భృశవిచ్ఛిన్నం బగు ది । గ్దశకంబును, గమలరుహవితానముఁ బ్రాతః
ప్రశిథిలరవికరమునుగా । శిశిరముఁ బొగడంగఁ దగు విశేషక్రియలన్. ౧౦౯

చ. వెరవున నాత్మవంశ్యుఁ డగువిశ్వనరేశ్వరుమీఁదిప్రీతిఁ జం
దురుఁడు తుషార సంహతుల దొడ్డుగఁ బంచిన వచ్చి యిచ్చటన్
బరిగొనఁ బోలు నంచుఁజెడి పాఱినవైరులు భీతిఁ గానలోఁ
దిరముగ నిల్వనేరరొ కదే యని చూతురు పంద లాత్మలన్. ౧౧౦

(5) చంద్రోదయవర్ణనము

క. మండలశోభయుఁ, గైరవ
షండవిలాసంబు, జలధిసంజృంభణమున్,
గొండొకవెన్నెలగ్రోలెడు
నండజముల విధునిపొడుపునం దగుఁ బొగడన్. ౧౧౧

మ. అదె రౌద్రాకృతిఁ జూచెఁ జంద్రుడు, మయూఖాటోప మేపారె న
ల్లదె, మున్నాఁడెఁ జకోరసంఘ మదె జ్యోత్స్నాపానసంక్రీడకై;
యదయుం డంగజుఁ డెట్లు గాఁగలడొ? నీయాలోకనేందీవరా
పదఁ దూలించెదు, చంద్రవంశజుని నొప్పం జూతు రమ్మా సఖీ. ౧౧౨

6 సూర్యోదయవర్ణనము

క. ఎచ్చటఁ జూచిన జగముల,
నచ్చటన వెలుంగు నవియు నజ హరి హర తా
నచ్చతురుఁ డనియు మఱియున
విచ్చకుఁ దగఁబొగడవలయు విను నుదయంబున్. ౧౧౩

మ, కమలామోద మెలర్ప, నేత్రసుఖదాకారంబు రంజిల్ల, ను
త్తమవందారు శివంకరత్వ మెసఁగన్, ధర్మార్థకామక్రియా
దిమమూలం బన నొప్పుమిత్రుఁ డుదయోత్సేకప్రభావంబుచేఁ;
నముఁ దద్దేవున కిందువంశజుఁడు తచ్చంచద్గుణశ్రేణులన్. ౧౧౪

7 వనవిహారవర్ణనము

క. చారుతరచైత్రసంప । త్స్ఫారితవిభవముల వేడ్క పొంగుడువడఁగా
వారిజవనహాచరుఁడై । యారామవిహార మొప్ప నధిపతి చేయున్.

*సీ. మావిపీగండూషమధువులఁ బూచిన
పొగడమ సొబగొప్పఁ బొగడి పొగడి,

---

* వనవిహారవర్ణనలో దోహదములు చేరియున్నవి.

నాళీపవాహతి ననిచిన కంకేలి
పరువంబు నగ్గించి పలికి పలికి,
లలనావలోకనంబులఁ బుష్పితం బగు
తిలకంబుపైఁ జూడ్కి త్రిప్పి త్రిప్పి,
వనితోపగూహనంబునఁ బేర్చునుపొన్న
మేలిపుణ్యమునకు మెచ్చి మెచ్చి,

తే. మన్మథారామములపొంత మలసి మలసి,
శుకపికాళివిహారంబు చూచి చూచి,
సతులుఁ దానుఁ జరించు వసంతవేళఁ
బ్రమదవనమున విశ్వభూపాలవరుఁడు. ౧౧౬

8 జ ల వి హా ర వ ర్ణ న ము

క. నీరజములఁ జెంగలువలు। గైరవములు వీచికలును గరయంత్రపయో
ధారలు నావర్తంబులు। వారివిహారంబులందు వర్ణ్యము లరయన్ ౧౧౭

చ. వళులును వీచికావళులు వారిరుహంబులు వక్త్రపంక్తులన్
చెలు వగునాభులన్ సుడులఁ జేతులు రక్తసరోరుహంబులన్
జలదలకంబులన్ మధుపజాలము వీడ్వడఁ గేలి సల్పి మిం
చులు గొనుచూడ్కులన్ సతులు సూతురు విశ్వనృపాలమన్మథున్. ౧౧౮

(9) మ ద్య పా న వ ర్ణ న ము

క. సంబోధకరము, మదనా। లంబనము, నశేషరసవిలసితము నంత
ర్బింబితవదనము నగు కా। దంబరి నాపానమునకుఁ దగు వొడఁగూర్పన్, ౧౧౯

మ. అలినాదంబులు దానమానములుగా నాలప్తి గావించుఁ దొ
య్యలి యో, ల్త్రొక్కెడు పాడు విశ్వవిభు నేలాదిప్రబంధంబులన్;
దెలివిం గైకొని యోర్తు సాంగమున నర్తించుం; గళాసించు ను
గ్మలియో, ల్త్రొక్కెడు వ్రాలు సోలములతోఁ గాదంబరీగోష్ఠిచేన్. ౧౨౦

(10) సు ర త వ ర్ణ న ము

తే. తనరు నెనుబదినాల్గుబంధములయందు
నమరుఁ బ్రచ్ఛన్నమును బ్రకటము ననంగ

సురతములు రెండు ; వానికి స్ఫురణసొంపు
వలయు వర్ణింప నిఖిలకావ్యములయందు. ౧౭౧

సీ. పొలయల్కఁదలఁపులఁ బులకించుఁ, బులకించి
బింకంపుఁగౌఁగిళ్ల బిగి భజించు,
మరుచిన్నె లున్నెడఁ బరికించుఁ, బరికించి
చొక్కుఁ, జెమర్చినయిక్క లరయుఁ,
దొలిమ్రొక్కు చెలిచెవిఁ జిలికించుఁ, జిలికించి
మురిపెంపుసిగ్గున మూఱిఁబోవుఁ.
బంజరంబునచిల్కఁ బలికించుఁ, బలికించి
నొడువు లాలము లైనవోరు నొక్కు,
తే. సొబగుటడుగుల లత్తుక చూచుఁ, జూచి
యరిగి శయనీయ మారయ నప్పళించు,
వెలఁది యొక్కర్తు చాళుక్యవిభునిచేత
భావజాతుని గెల్చినభావ మొప్ప.

11 విప్రలంభవర్ణనము

క. అచ్చపువెన్నెలచేఁ గడు
వెచ్చుటలును మాన మెడలి వెడవిల్తునిచే
నొచ్చుటలును బ్రియుఁ డబ్బని
ముచ్చటలును విప్రలంభమునఁ జెప్పదగుఁ.

ఉ. ఎల్లిద మయ్యెఁ దాల్మి, తగ నెల్ల వివేకము వింత యయ్యె, మి
న్నెల్లను జంద్రుఁడయ్యె, మన మెల్ల మనోభవుతూపు లయ్యె, మే
నెల్లను సన్న మయ్యెఁ, జెలులెల్ల విరోధిను లైరి, విశ్వభూ
వల్లభుతోడియల్క గరువంపుఁజలంబునఁ బువ్వుఁబోఁడికిఁ. ౧౭౪

12 ప్రయాణవర్ణనము

క. గజరథ హయ సూచిత మగు। విజయమ్మున నుబ్బి నడచువిశ్రుతవివిధ
ధ్వజిని వినుతించు టెప్పుడు। భజనీయము సుకవి సత్ప్రబంధములందుఁ. ౧౭౫

మ. కర ముద్యత్కరవాలభైరవపతాకాఖేలనం బై పరి
స్ఫురదుగ్రాయుధదీప్తి పూరితనభోభూభాగ మై సంచర

త్తురగోద్ధూతరజోతిధూసరహరిత్ప్రాలంబు లై యుద్ధతిం
బరిభాపిల్లఁ జళుక్యనాథుని చమూభద్రప్రయాణం బిలన్. ౧౨౬

13 వి వా హ వ ర్ణ న ము

క. ప్రచురస్వయంవరోచిత । రచనలుఁ, గన్యావరాభిరమ్యక్రియలున్
విచితశుభాత్మకవిధులను, । రుచిరవివాహంబులందు, రూపింపఁ దగున్. ౧౨౭

ఉ. సంతతమంగళధ్వనులు, చామర మౌక్తికపుండరీకముల్
వింతవిభూతి గా గురుకవిస్తుతివేళ వరించెఁ బొంత సా
మంతుల నుజ్జగించి కడు మచ్చికనెచ్చెలు లైన నీతి వి
క్రాంతులు చూపఁ గోరి జయకన్యక వచ్చి చళుక్యవల్లభున్. ౧౨౮

14 పు త్రో ద య వ ర్ణ న ము

క. మిత్రానందోదయము, స
మిత్రత్రసనంబు, శుభనిమిత్తంబును, స
త్పాత్రకృతవితరణంబును
బుత్త్రోదయమందుఁ దద్ద పొగడఁగవలయున్. ౧౨౯

ఉ. చిత్రము పోర విశ్వవిభుచే నపిపుత్త్రికఁ గన్నపుత్త్రి లు
ద్యత్త్రిదశాకృతిం బడపి యౌవనసంపదఁ జెంది మంగళా
మత్రము లై వెలుంగునెడ మంజులయుక్తిఁ దనర్చు దివ్యవా
దిత్రరవంబు నింపొదవుఁదెమ్మెరలున్ సురపుష్పవృష్టియున్. ౧౩౦

15 మం త్ర వ ర్ణ న ము

క. అగవాక్షము నస్తంభము
నగుగూఢాభ్యంతరముల హర్మ్యాగ్రమహా
నగశృంగంబుల మంత్రము
దగు నొనరింపంగ ననుచుఁ దగు వర్ణింపన్. ౧౩౧

మ. అలుకం బోరికి నెమ్మిమైఁ దరలుచోఁ బ్రారంభణోపాయమున్,
బలసంపత్తియు, దేశకాలగతులున్, భంగప్రతీకారమున్
ఫలసంసిద్ధియు నిర్ణయించు టనునీపంచాంగమంత్రక్రమం
బులు తర్కించుచళుక్యనాథు వెర వొప్పున్ బూజ్యరాజ్యక్రియన్. ౧౩౨

16 దూత్య వర్ణనము

క. ప్రతిభయుఁ బరమంత్రవిభే
దితయునుఁ బతిర క్తియును దితిక్షయు నిర్మ్మా
ర్గతయును నవ్యసునీతియుఁ
జతురతయును దూత్యమునను జను నుతియింపఁగా. ౧౩౩

శా. ఉ త్తేజుం డగువిశ్వభూవిభుని దూతోద్యారసమ్యగ్గణో
త్ప త్తిఁగా విశ్రుత మైనసంధి గనుభూపశ్రేణియుఁగా దుర్మదా
య త్తస్వాంతత నిగ్రహించు నరనాథౌఘంబె వ ర్తించు న
త్యు త్తుంగాచలచిత్రకూటములయందుం జెంది యశ్రాంతముఁగా. ౧౩౪

17 సమర వర్ణనము

క. పటురథ కరి హరి భట సం
ఘటిత వ్యూహాదికములు ఘనఫలకాపి
స్ఫుటరుచులు విజయకారణ
పటహాడంబరముఁ బొగడఁబడుఁ బోరాటఁగా. ౧౩౫

మ. అమరాహీనరవంబు వీరసుభటాహంపూర్వికానాదముఁగా
విమలాస్త్రప్రతిఘాతనధ్వనులు నున్నిద్రంబు లై పర్వ న
గ్రిమవిశ్రాంతికి మెచ్చి నారఁదుడు న ర్తింపఁగా మహాయోధనం
బమరుం జూడఁ జళుక్యవల్లభునిశూరాటోపముం జూపుచుఁగా. ౧౩౬

18 దోర్వీర్య వర్ణనము

క. అరులఁ జనఁ దోలి యార్తుల
నరుదారం గాచి హతులయడియాలములఁగా
బిరుదంబులఁ గైకొను న
న్నరపతివిజయంబు కీ ర్తనము సేయఁ దగుఁగా. ౧౩౭

ఉ. ఆచతురాశ్వసంఘము రణాంగణసంభవ, మా సువర్ణపే
టీచయ మాజి శత్రువులు డించి తొలఁగిన వస్తుసంభృతం,
బీచతురంతయానముల యింతులు రాజతనూజ, లంచు మెం
దై చని విశ్వనాథువిజయంబు నుతింతురు పౌరకామినుల్. ౧౩౮

మ. ఇటు లష్టాదశవర్ణ నాకలిత మై యేపారు కావ్యంబు వం
తటఁ బాటించి తదర్థసంఘటనముం దర్కించి భావోదయ
స్ఫుటభేదంబు లెఱింగి తద్రసగతుల్ శోధించి యచ్చంపు మె
చ్చుటకుం దావల మై చళుక్యపతి సంశోభిల్లు నెల్లప్పుడున్. ౧౩౯

ఉ. రాజనరేంద్రవంశజుఁడు రాజపటీరసుధాసుధాకర
భ్రాజితకీర్తి రామరఘురామపరాక్రమసంప్రవర్తి, యం
భోజహితప్రతాపుఁడు, రిపుక్షితిభృత్కులిశంబు, సత్కళా
భోజుఁడు, దానధూత సురభూజుఁడు భూజనపోషణుం డిలన్. ౧౪౦

క. సుందరుఁ డభినవవిభవ పు। రందరుఁ డంధ్రేశ్వరాభిరాముఁడు రామా
కందర్పుఁ డమందయశ। శ్చందనపరిలిప్తదిగ్గజవ్రజుఁ డెప్పుడున్. ౧౪౧

మాలిని

అనఘసుకృతధర్ముం డార్యసంస్తుత్యశర్ముం
డనలసదృశతేజుం డగ్ర్యచాతుర్యభోజుం
డనిశరిపుశరణ్యుం డంధ్రభూపాగ్రగణ్యుం
డనుగతశివతంత్రుం డాప్తమంత్రుండు బుద్ధిన్. ౧౪౨

గద్యము

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన
విబుధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణి యనునలంకార శాస్త్రంబునందు
నాయక నాయికావివిధ విశేషలక్షణ
ప్రబంధలక్షణోదాహరణ సముద్దేశం
బన్నది
తృతీయోల్లాసము

# చతుర్థోల్లాసము



## కావ్యభేదాది ప్రకరణము

క. శ్రీవిశ్వేశ్వరకరుణా। శ్రీవిలసిత నిష్కళంక చిత్తుఁడు కీర్తి
శ్రీ విశద చక్రవాళుఁడు। శ్రీవిశ్వేశ్వర నరేంద్ర శేఖరుఁ డొప్పున్. ౧

క. ఇత్తెఱఁగున నష్టాదశ। వృత్తం బగు కావ్య మొప్ప విరచింపఁ దగున్.
మొత్త మగు నఖిలబలసం। పత్తియుఁ గలవేళ సుకవి ప్రతిభ దలిర్పన్. ౨

క. కృతిముఖమున దేవ నమ। స్కృతి యొండె, నభీష్టవస్తుకీర్తన మొండెన్,
వితతాశీపదః మొండెను। బ్రతిపాదింపంగవలయు భద్రాపేక్షన్. ౩

### కావ్యమహిమ

మ. కవిసంసిద్ధపదంబు భావరసవిఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రవ్యంబుం జతుర్వర్గ సం
భవసద్మంబును నైనకావ్య మిల నాపద్మోద్భవస్థాయి యై
కవిసంస్ఫూర్తియు దాతృకీర్తియుఁ దగం గల్పించు నెల్లప్పుడున్. ౪

### కావ్యభేదములు

తే. అట్టికావ్యంబు త్రివిధ మై యతిశయిల్లు
నవనిఁ బద్యమయంబు గద్యాత్మకంబు;
గద్యమయ మొప్పు ఛందో నిబద్ధ మగుచు
గద్యమయ మొప్పు వాక్యసంకలిత మగుచు. ౫

క. అపద్య గద్య కృతములు
రూపకములు నాటకములు రూఢము లగు నా
రూపమ చంపూకావ్యత
ప్రాపించును, నాటకములు బహుళము లరయన్. ౬

తే. సర్గబంధంబు కావ్యంబు సంస్కృతమునఁ,
ప్రాకృతంబున నాశ్వాసభాసురంబు,
నాటకము లెల్ల నంకసనాథకములు,
గద్య ముచ్ఛ్వాస లంబకాంకంబ యండ్రు. ౭

క. ఇటువలెనె ముక్తకాది । స్ఫుటతరచాటుప్రబంధముల లక్షణముల్
బటుమతి నెఱుఁగుట సుయశో । ఘటనంబుల కెల్లఁగుదురు కవినృపతులకున్. ౮

ముక్తకాదులు

సీ. పరఁగు ముక్తక మేకపద్యంబు, పద్యద్వ
యంబు ద్వికము నాఁగ నలరు, మూఁడు
పద్యముల్ త్రికము నా భాసిల్లుఁ, బంచప
ద్యంబులు పంచరత్నంబు లరయ,
గజమాల పద్యాష్టకము పద్యనవకంబు
నవరత్నమాలిక, నలినమిత్ర
మాలిక పండ్రెండు మధురపద్యము, లిందు
కళ షోడశశ్లోక కలిత మైన,

తే. సప్తవింశతి యైన నక్షత్రమాల,
తెలియ ముప్పది పద్యముల్ త్రింశదాఖ్య
మవలఁ బంచాశదాహ్వయం బైదుపదులు,
శతక మన నొప్పు మఱి పద్యశతము గూడ. ౯

క. అష్టోత్తరశతపద్యము । లష్టోత్తరశతక మనఁగ నడరుఁ, గవీంద్రుం
డిష్ట మగు సంఖ్యఁ జెప్పిన । దుష్టము గా దదియుఁ గర్ణతుష్టిన్ చేయున్. ౧౦

ఉదాహరణలక్షణము

క. ధరఁ జాటుకృతులలోనం । బరఁగు నుదాహరణ మనుప్రబంధము, తద్వి
స్తరలక్షణంబు బరువడిఁ । బరికింపఁగఁ దగు నశేషభాషాకవులున్. ౧౧

క. చతురశ్ర త్ర్య శ్రాది వి । తతయతి తాళములు గలుగుదళముల నెల్లన్
గృతగుచ్ఛానుప్రాసం । బతులితగతి వెలుపఁ దగు నుదాహరణములకున్. ౧౨

క. సురభాషాదిప్రాకృత । పరిభాషల నైన నితరభాషల నైనన్
విరచించుట యుక్త ముదా । హరణ మిలాసురముఖాదు లగుపుణ్యులకున్. ౧౩

### విభక్తులపమాఌపేర్లు

సీ. ప్రథమావిభక్తి చొప్పడు వాణి నాఁగ, రెండవయది ఝట నాఁగ నతిశయిల్లుఁ,
గర్త్రి మూఁడవవిభక్తికిఁ బేరు, నాలవయది దేవలాభిని యంద్రు గృతులఁ,
బంచమి పాణి నాఁ బరఁగు, షష్ఠవిభక్తి పాటిల్లు సుకవులు మోటి నాఁగ,
సప్తమి ఘోటికాసంజ్ఞిత, సంబుద్ధి సరసావళీనామ; జగతి వీని

### విభక్తులదేవతలు 8

తే. కయినవేల్పులు [1]పీరావళియును [2]గీర్తి
మతి [3]సుభగయును మఱి [4]భోగమాలినియును
మహిఁ [5]గళావతియును [6]గాంతిమతియుఁ [7]గమల
యును [8]జయవతియు నాఁగను నొప్పు నెపుడు. ౧౪

క. ఈవిదితాష్టవిభక్త్యధి। దేవత లాత్మీయనామధేయ సమము గా
భావింపఁ దగినశుభములఁ। గావింతురు కర్తృనాయకద్వయమునకున్. ౧౫

క. మును శుభగణవర్ణతఁ బ। ర్వినమాలిని యొండెఁ జండవృత్తమ యొండెం
దనరింపవలయుఁ బ్రథమకు। ఘన కలికాష్టకతదర్థ కలికాయుక్తిన్. ౧౬

క. ఇం బడరఁగ బ్రథమాదుల। సంబుద్ధ్యంతములనైన సరళవిభక్త్యా
లంబనపద్యంబుల బిరు। దంబులు గలపౌరుషములు దగ నిడవలయున్. ౧౭

తే. కళిక యేతాళమునఁ బరిఘటిత యయ్యె
నుత్కళికయును దానన యునుపవలయు,
నంత్య చాతుర్థికోత్కళికాఖ్య చూడఁ
బడి చతుర్థియుఁ బోలెఁ జూపట్టవలయు. ౧౮

క. ఓజఃపదబహుళము వి। భ్రాజితపటుగౌడరీతిబంధురమును, ని
చ్ఛాజాతరసవిభావ వి। రాజితమును గా నుదాహరణ దగుఁ జెప్పన్. ౧౯

క. నాయక విభవమునకుఁ గవి । నాయక చతురతకు భాజనం బగుపద్యం
బాయితము సేసి యిడఁ దగు। నాయతిగాఁ దుదలయం దుదాహరణలకున్. ౨౦

### సద్దళి

క. సంబుద్ధి విడిచి మును గల। సంబంధం బెడల కుండ సప్తవిభక్త్యా
డంబర మడరించిన నొడి। కం బగు సద్దళి యనంగఁ గవులకుఁ జెప్పన్.

### పద్ధళి, విద్ధళి

తే. సరివిభక్తుల సంబుద్ధిసహిత గాఁగఁ । జెప్ప నొప్పారుఁ బద్ధళి సిద్ధ మగుచు,
ముక్తసంబుద్ధి విషమవిభక్తికలిత । మైనకృతిపేరు విద్ధళి యండ్రు బుధులు.

### కల్యాణి ఉత్ఫుల్లకము

క. కేవలకలికాసంగతిఁ । గావించినకృతికిఁ బేరు కల్యాణి యగున్
వావిరి నుత్ఫుల్లక మది । యావల నుత్కళికతోన యదికిన యేనిన్. ౨౩

తే. గ్రంథబాహుళ్య భీరుత్వకథన మిదియు
ధర నుదాహరణాది భేదములు పెక్కు,
తెలియఁ దొడఁగెడ మఱికొన్ని తేటపఱుతుఁ
బటుపదార్థాప్తిఁ జాటుప్రబంధములను. ౨౪

### బిరుదావళి

క. బిరు శబ్దంబు విరోధో । త్కరము మహారాష్ట్రభాషఁ, దత్ప్రదవిధులన్
బిరుదము లనఁ జను వానిన । ధర బిరుదావళి యొనర్పఁ దగు నండ్రు బుధుల్.

చ. అతులకులక్రమాగతము లై, భుజవిక్రమ సంభవంబు లై,
ప్రతిపదసార్థకంబు లయి, పార్థివకర్ణకఠోరకంబు లై,
వితరణశబ్దపూర్వపృథివీవర చిహ్నము లై తనర్చు ను
ద్యతబిరుదాళిచేత బిరుదార్థము చెప్పుట యొప్పు నెప్పుడున్. ౨౬

క. వినయ భుజవిక్రమక్రమ । ఘనవితరణ రణవిహార కరు ణాది కళా
జనన స్థలు లగుగుణములఁ । బెను పొందఁగఁ జెప్పవలయు బిరుదావళికిన్.

క. సముచిత శాఖదళమ్ములు । సమధిక పటుగౌడరీతి సందర్భములన్
సుమనోభాషం బొలుపుగ । నమరింపుఁడు కవులు ప్రాకృతాదుల నైనన్. ౨౮

తే. పద్యదళ వాక్య తద్దళ పరిసమాప్తి
గదురుపట్లను నెడ నెడఁ గలుగవలయు,
ధీర గంభీర జయ దేవదేవ యనెడు
లలితసంబుద్ధివచనంబు లొలయవలయు. ౨౯

క. ఉచితవిభక్తికమును గుణ । రుచిరాలంకార రస విరూఢము నాశీ
ర్వచనంబును నగుపద్యము । రచియింపఁగ వలయు మొదల రంజన మొప్పన్.

### గుచ్ఛములు

క. మెం డగు దళములు నాలుగ । యొండెను షట్కంబ యొండె నుండఁగఁ దుదపై
నుండును గద్యము నెనిమిది । యొండెం బదియాఱు నొండె నురుగుచ్ఛములై.

క. ఇడఁ దగు నూతనయతిసం । గడి దళములు నాలు గైనఁ గడ నాత్తైనన్
బెడఁ గగువర్ణావృత్తులు । వెడలింపఁగవలయు నంఘ్రు బిరుదావళికిన్. ౩౨

క. బంధురముగ ని ట్లుతుల । స్కంధచతుష్కంబుచేతఁ గవి విభుని యశో
గంధాధివాసితాశా । పింధురముగ దీవనల విశేషింపఁ దగున్. ౩౩

### చక్రవాళము

క. పద్యం బొక్కటి మొదలను । గద్యాష్టక ముచితదీర్ఘ గతిఁ గబ్బములన్
హృద్యదశాష్టక మిడిన స । ముద్యతమగుఁ జక్రవాళమూహింపంగన్. ౩౪

తే. వరుస నాదిమపద్యాంతవర్ణయుగళ
మంత్యవాక్యాదిమాక్షర యమళకముగ
విడి, చతుఃస్కంధములయందు నిట్లుచెప్ప
నచ్చముగఁ జక్రవాళత్వ మబ్బుఁ గృతికి. ౩౫

క. కవినామనాయకస్వ । స్తివచఃకవి తాద్యపద్యశిఖరంబులఁ బ
ల్లవ మైనవర్ణయుగళం । బవిరళముగ నాద్యమునకు నాద్యక్షరముల్. ౩౬

### గుచ్ఛతతి

క. తొలి తొలిపద్యమునఁ జతు । ర్దళమును నట పల్లవద్వితయ మంతమునన్
గలఘనపద్యము నాలుగు । దళముల నన్నింట గుచ్ఛతతి యన వలయున్. ౩౭

క. కలయఁగ సంబుద్ధ్యంతర । ముల నునుపఁగవలయు నందముగ జయ జీవో
జ్జ్వల దేవాదిపదంబులు । నలి నిడుచతురు త్తరంబు నలుమాత్రైనన్. ౩౮

### చతుర్భద్రము

క. ఇదియె చతుర్భద్రం బగు । సదమలధర్మార్థ కామసహిత స్తుతులం
బొదివికొని సర్వరీతుల । విదితం బగునేని శాస్త్రవిదులకు నెక్కున్. ౩౯

### *రగడ

క. సరి యో పదితేకులచేఁ । బరువడి నుత్సాహవృ త్తపదయుగళముచే
నిరవుగ వడిప్రాసంబుల । నరుదుగ రచియింప రగడ యగుఁ దగువృత్తిన్.

---

* ఇందు యక్షగాన లక్షణములేదు.

మంజరి

క. శృంగారప్రాయముగా । రంగద్ద్వ్యదశిన వొసంగ రచియింపంగా
శృంగారమంజరీకృతి । సంగత యగు సకలరాగ సంభృతరీతిన్. ४౧

దండకము

క. ఛందోభవలక్షణగణ సం । దోహనిబద్ధ యగుచు శ్రవణానందా
మందానుప్రాసంబుల నందం బగు దండకము మహాకవికృతులన్. ४౨

క. ఇవి యెల్లను నానావిధ । కవికృతశాస్త్రములచేతఁ గల్పితములు, పె
క్కువిధంబులఁ జాటుకృతి । ప్రవరంబులు పరఁగు నెఱుఁగఁబడు నొండెడలన్.

సీ. ఆపూర్ణలక్షణోదాహరణావలి యుల్లంబునకు నింపు నొసఁగదేని,
బిరుదావళీముఖ్యపృథులప్రబంధౌఘములు దిగంతంబుల ద్రోయవేని,
పటుచతుర్భద్రాదిభవ్యచాటూక్తులు నృపతులవీనులు నిండవేని,
మధురార్థదండక మంజరీమంజుత బుధుల నింపుల మూరిఁ బుచ్చదేనిఁ,

తే. గెరలి చని ముక్తకాదులు కీర్తిలతలఁ
జక్రవాళాద్రిమీఁదికిఁ జాఁపవేనిఁ
గడఁగి మెచ్చునె యొకపాటిగంతచాటు
చాటుకృతులకు విశ్వేశచక్రవర్తి. ४४

ప్రాధాన్యములు 3

క. అరయ వస్తురసాలం । కారప్రాధాన్యవృత్తిఁ గబ్బంబులు పెం
పారుఁ ద్రివిధార్థఘటనల । ధీరులు పరికించి వానిఁ దెలియఁగవలయున్, ४౫

1 వస్తు ప్రాధాన్యము

క. వేదుక విశ్వేశుఁడు శివ । చూడామణికులమునందు సుస్థిరుఁ డగుటన్
చూడఁ గనకాద్రికవకుం । గూడక యవ్వెండికొండ కొండిక యయ్యెన్. ४౬

2 రస ప్రాధాన్యము

క. వలిచన్నులు నగు మొగములు
దెలిగన్నులు మేనిజిగులు తియ్యనిపలుకుల్
సలికపు నడుములు మరుతూ
పులఁబ్రోచుఁ జళుక్యవిభునిపొలఁతుల కెపుడున్. ४౭

3 అలంకారప్రాధాన్యము

క. తగ విశ్వేశ్వరుచే సిరి। నెగడిన సత్కవులు దాననిపుణతఁ గర్ణున్
నగుదురు, కల్పమహీజముఁ। దెగడుదు, రదలింతు రమరధేనువు నైనన్.

---

స్ఫురణములు 3

తే. తనర [1]శబ్దస్ఫురణము [2]నర్థస్ఫురణము
[3]నుభయవిస్ఫురణము నన నుల్లసిల్లు;
నిత్తెఱంగులు మూఁడును నెఱుఁగవలయుఁ
జారుశబ్దార్థగౌరవశక్తి వలన, ౪౯

1 శబ్దస్ఫురణము

క. కంఠీరవకఠిన ఛటా। కుంఠితకంఠార వావకుంఠితరణ సో
ల్లుంఠనములు సురవనితో। త్కంఠం గావించు విశ్వధరణిపుసేనల్. ౫౦

2 అర్థస్ఫురణము

చ. తనరెడుఖడ్గధార మును ద్రావినవారి విరోధిభీరులో
చనముల నుప్పతిల్లి కడుఁ జక్కనివాహిను లయ్యె; నైన న
య్యనువునఁ గ్రొత్త పెండ్లికొడుకై మది నుబ్బుచునుండు సాగరుం
డనిఁ గరవాలభైరవు మహత్త్వము చిత్రమ కాదె యెప్పుడున్. ౫౧

3 ఉభయస్ఫురణము

స్రగ్ధర

లాటీ ఘూటీ వరాటీ లలితకుచతటీలగ్న పాటీరచర్చం
బాటించుం, జంద్రకాంతోపలములఁ గరఁచున్, బర్వి చక్రాద్రియందా
ఘాటోద్యత్కైరవాసక్తములుగ నదులం గట్టు గంధానుబంధిన్
జాటు శ్రీతోడ విశ్వేశ్వరుని సితయశశ్చంద్రికాసార మోలిన్. ౫౨

శయ్య

క. మృదుతరమై యొం డొంటికిఁ। బదమిత్త్రిత గలిగి నొడువుపలుకులలోనన్
ఛాదలెడు నర్థం బెప్పట। నదలించి శయించు శయ్య యనఁగా నదివో. ౫౩

చ. చతుర చళుక్య విశ్వవిభు చారుగుణంబు లరాతిరాజిరా
జితనయ హేతుభూతము, లశేషవిశేష విహార విక్రమో
చితరతు, లార్యవర్యులకు జీవిత, మంచితసంచితాగమా
తతమతి భారతీవదనదర్పణ, ముత్తమదర్పసంపదన్. ౫౪

పాకములు 2

క. పాక మనంగా నర్థని। రాకులగంభీరయుక్తి, యది యిరుదెఱఁగై
లోకమునఁ బేర్చు ద్రాక్షా। పాకంబును నారికేళపాకము ననఁగన్. ౫౫

1 ద్రాక్షాపాకము

క. బహిరంతః స్ఫురితార్థో। పహితరసప్రసర మగుచుఁ బద్యము సుఖసం
గ్రహపద మెచ్చట నదివో। మహి ద్రాక్షాపాక మనఁగ మధురం బెపుడున్.

శా. లీలా మన్మథ మంథరంబులుఁ గచాళీ లాలిత భ్రూలతా
కూలశ్రీలుఁ గపోల ఖేల దుచి తాకూతానురాగంబులన్
సాలస్యంబులు నైనకౌతుకపరీతాలోకజాలంబులన్
బాలారత్నము కీలుకొల్పె ముద మొప్పన్ విశ్వభూపాలుపై. ౫౬

2 నారికేళపాకము

క. అంతర్గూ ఢార్థసర। స్వాంతం బగువాక్యగౌరవంబు మనీషా
వంతులకు నెక్కుఁ గవితా। భ్యంతరముల నారికేళపాక మనంగన్. ౫౮

శా. హృజ్జాతుండు నటుండు వోలె నదె విశ్వేశక్షమాభర్తకున్
లజ్జాకాండపటంబుచాటున వధూ లావణ్య లాస్యంబులన్
సజ్జాతంబులఁ జేసి చూపెడు లసత్సారాంగహారాళిచేఁ
బజ్జం గొందఱు కామినీమణులు కుప్యద్దర్పలై చూడఁగన్. ౫౯

---

అర్థవృత్తులు 4

ఆ. [1]ముఖ్య [2]లక్ష్య [3]గౌణములును [4]వ్యంగ్యంబు నా
నర్థవర్తనంబు లయ్యె నాల్గు;
వానివలనఁ గలుగు వాచ్యభేదంబుల
నరసి తెలియవలయు నంధ్రబుధులు. ౬౦

(1) ముఖ్యార్థము

క. సువ్యక్తము సరళంబును
నవ్యాజము నైన యర్థ మగు ముఖ్య మనన్.
శ్రవ్యముగ నదియు జాతి
ద్రవ్య గుణ క్రియలచేతఁ దగు నాల్గనఁగన్. ౬౧

(1) లక్ష్యార్థము

ఆ. ఊహనీయ లక్షణోపేత మగునర్థ
మరయ లక్ష్య మనఁగ నతిశయిల్లు;
గంగయం దనంగ గంగా తటంబునఁ
గలిమిఁ జెప్పఁజాలు కారణమున. ౬౨

(3) గౌణార్థము

క. గుణ సాదృశ్యంబున ను
ల్బణ మగునర్థంబు గౌణభణితము, గడు భీ
షణహరి యానృపుఁ డన ద
ద్గుణ మగువిక్రమము దెలియఁ దోఁచుట చేతన్. ౬౩

(4) వ్యంగ్యార్థము

ఆ. ముఖ్య లక్ష్య గౌణముల యర్థములఁ ద్రోచి
యితర మర్థ మెసఁట నింపు నొసఁగు
వ్యంగ్య మంద్రు, కైరవంబులు విరిసె నాఁ
గమలవైరి పొలుపు గానఁబడుట. ౬౪

ధ్వని

క. పాకాదికృత వ్యంగ్య । వ్యాకీర్ణంబైన కావ్య మది యుత్తమ మై
చేకొనఁబడు మధురార్థ । శ్రీకము ధ్వనియనెడునెపముచేఁ జెలువొందున్. ౬౫

ఉ. ప్రీతిఁ జళుక్యవల్లభుఁడు పృథ్వి వహించి గుణాఢ్యుఁ డైనచో
శాతమదాష్టదంతులు వశావశతన్ జరియించె, శూలికిం
జేతుల భూషణస్ఫురణఁ జేకొనె, వార్ధులు గోత్రభూధర
వ్రాతము నిల్వనయ్యెఁ, గడు మ్రాన్పడె నిర్జరపాదపంబులున్. ౬౬

## శక్తిగ్రాహకములు

సీ. విహితసంయోగంబు విప్రయోగంబును । సామర్థ్యమునుసాహచర్యకంబు,
నర్థవిరోధ లిం గౌచిత్య చేష్టలు । పరశబ్ద సన్నిధి ప్రకరణములు,
దేశ కాల క్రమాదికములు శ । బ్దార్థ కలి తానవచ్ఛేద కల్పనములు,
స్మృతి హేతుకములు విశేష వాక్యస్వర । వ్యక్తులు నాఁగఁ, బర్యాయగతుల,
తే. నలరు నన్నింట నర్థంబు నవగమింపఁ
దగు ననేకార్థయుతము లై తనరుశబ్ద
సంతతుల కర్థసంధానచతురు లెల్ల;
నింకఁ దద్వృత్తు లెఱిఁగింతు నెఱుఁగవలయు. ౬౭

## కావ్యవృత్తులు

క. ధీరస్తుత కైశికియును । నారభటియు సాత్త్వతియును నట భారతియుజ్
జారుతరవృత్తు లివి శృం । గారాదిరసంబులందుఁ గరణీయంబుల్. ౬౮

## కైశికి

తే. సకల సుకుమార మధురార్థ సరళ రచిత
కైశికీవృత్తి; శృంగార కరుణ రసము
లధికసుకుమారములు, వాని నగు నొనర్పఁ
గైశికీవృత్తిచేతన కవుల కెల్ల. ౬౯

మ దళదిందీవర సుందరంబులును, నంతఃకౌతుకాంకూర సం
వళితస్నేహములుఙ్ బ్రసన్నములు నై వర్తిల్లు నాలోకనం
బు, లుపేంద్రాత్మజు నిందువంశజుఁ గళాపూర్ణాత్మకుం జూచుచోఁ
బొలిచెం బొ ల్తికి సానురాగరస సంపూర్ణంబులై యత్తఱిజ్. ౭౦

## ఆరభటి

క. ఆరభటీవృత్తి యనఁగ । నారూఢాభ్యుద్ధతార్థ. యత్యద్భుతము
ల్గా రౌద్రము బీభత్సము । నారభటీవృత్తిఁ జెప్ప నగు నీరెండుఙ్. ౭౧

మ. అతికుప్య త్పరగండభైరవ మహోద్య త్ఖడ్గ ముగ్రాకృతిఙ్
బ్రతిపక్షప్రకరంబు నొంచు, నలఁచుఙ్, భంగించు, దండించు, ను
ద్ధతి నుగ్గించు, వధించు, వ్రచ్చు, యమదోర్దండ ప్రచండక్రియా
గతి చూపించు, నటత్కబంధమయ సంగ్రామంబు భీమంబుగాఙ్. ౭౨

## భారతి

తే. భారతీవృత్తి కైనకల్పనము చూడ
నర్థ మించుక సుకుమార మై తనర్చు;
నల్పమృదువులు హాస్య శాంతాద్భుతములు
భారతీవృత్తిచేఁ జెప్పఁబడు నవియును. ౩౩

మ. అతికందర్పము రూప, ముజ్ఝితసుపర్వానోకహం బీగి, నిం
దితచంద్రద్యుతి కీర్తి, గర్హితసురాద్రిస్ఫూర్తి ధైర్యంబు, కుం
ఠితకంఠీరవ ముగ్రవిక్రమము, వర్ణింపం జళుక్యావనీ
పతి; కీయద్భుతవృత్త మేనృపులకుఁ బాటిల్లునే యెచ్చటన్? ౩౪

## సాత్త్వతి

తే. సాత్త్వతీవృత్తి నాఁగ నీషత్ప్రగల్భ
సార్థరూపిణి; వీర భయానకములు
నీషదుక్తిప్రగల్భ సమీహితములు;
సాత్త్వతీవృత్తిచే వీని జరుపవలయు. ౩౫

మ. అతిదృప్య త్కరవాలభైరవపతాకాభీలకోలధ్వజా
కృతులం జూచినవీరు లుబ్బుదు రాగిం గీర్వాణలోకార్థు లై,
సతతత్రస్తులు దూలిపోదురు మహాశైలాగ్రకూటార్థు లై,
గతవిద్వేషులు విశ్వనాథ వినుతు ల్గావింతు రాత్మార్థు లై. ౩౬

---

## కావ్యరీతులు

తే. అఖిల కావ్యంబులకు రీతు లాత్మ యండ్రు;
ప్రాణదశకంబు వానికిఁ బ్రాణ మరయ:
ధర నలంకారమతవిభేదముల నవియుఁ
బెక్కు, లొక కొన్ని తగఁ గానిపింతుఁ దెలియ. ౩౭

క. ఈడిత లగు వైదర్భీ । గౌడీ పాంచాల లాటికా రీతులు కా
వ్యాడంబరకరుణార్థ క్రీడలఁ । జతురాహ్వయములఁ గృతకృత్యులచేన్. ౩౮

## గుణములు 10 (ప్రాణములు)

క. క్రమమున నౌదార్య శ్లే । షములును సుకుమారతా ప్రసాద మధురతా
సమ తార్థవ్య క్త్యోజ । స్సమాధి కాంతులును దగు దశప్రాణము లై. ౬౯

### (1) ఉ దా ర త

క. వినుత సుశబ్దార్థంబులఁ । దనరు గుణోత్కర్షణం బుదారత్వ మనన్
జను; నది పూరణబహుళత । ననఘశ్లాఘోదయమున నగుఁ గల్పింపన్. ౭౦

### (2) శ్లే ష ము

క. అశిథిలపదబంధం బై । విశదాల్పప్రాణవర్ణ విస్పష్టం బై
కుశలగతి నొప్పు శ్లేషము । విశేషకావ్యముల కెల్ల విభవప్రద మై. ౭౧

### (3) సు కు మా ర త

క. శ్రుతిసుఖకర వర్ణంబుల । నతికోమల మైనరచన మలవడు సుకుమా
రత నాఁగఁ, । గ్లిష్టశాస్త్ర స్మృతివాదపటిష్ఠనుతులఁ జేకొను నదియున్. ౭౨

### (4) ప్ర సా ద ము

క. లలిఁ బదములతో నర్థము । సలలిత మగు నెచట నది ప్రసాదము కృతులన్
వలిపపుఁబయ్యెదలోనన్ । దొలఁకాడెడు వలుదచన్నుదోయిని బోలెన్. ౭౩

### (5) మా ధు ర్య ము

క. పటుబంధంబులు, మృదుల । స్ఫుటవిన్యస్తాక్షరములుఁ, బూరితరస సం
ఘటిత పదార్థంబులు, నె । చ్చట నగు మాధుర్య మనఁగఁ జను నది గృతులన్.

### (౬) స మ త

క. దొరఁకొన్న కొలఁది విడువక । చరణపదార్థములనడక సరి సాగెడు వి
స్ఫురణ యది సమత యనఁ జను, । నరయం గుకవులకు నంద దని పరికింపన్.

### (7) అ ర్థ వ్య క్తి

క. తనరఁ గ్రియా కారక యో । జన మస్తవ్యస్తసరణిఁ జనకుండ యథా
జనితాన్వయముగఁ । జెప్పినఁ గనదర్థవ్యక్తి నాఁగఁ గవితల నొప్పున్. ౭౬

### (8) ఓ జ స్సు

క. ఓజోగుణ మనఁగా వి । భ్రాజిత మగుఁ బటుసమాసబాహుళ్యము రా
రాజదనుప్రాసాక్షర । భాజన మై యొప్పు శబ్దభాసుర ఫణితిన్. ౭౭

## (9) స మా ధి

క. స్థావరజంగమధర్మవి। భావితచరితములు వీడుపడక రసార్ద్ర
ప్రావిర్భావము లగుటయ। భావింప సమాధి యనఁగఁ బరఁగుం గృతులన్.౧౯

## (10) కాం తి

క. లో క వ్య తి రి క్తా ర్థ । శ్రీకలితయు నూతనప్రసిద్ధవిరచనా
పాక కమనీయయును నగు। నాకల్పముసొబగు కాంతి యనఁ జనుఁగృతులన్.



## రీతుల లక్షణోదాహరణములు

### 1 వై ద ర్భి

ఆ. ప్రాణదశక యు క్తి నల్ప ఘోషముల వ
ర్గద్వితీయబహుత గలిగి ద్విత్రి
పదసమాస యైనఁ బరఁగు వైదర్భి, స
మాసరహిత యైన మధుర యండ్రు. ౯౦

చ. భుజమున విశ్వభూవరుఁడు భూభరముం దగఁ దాల్చెఁ, దాల్చినం
గజభుజగేంద్రులున్ గుధర కచ్ఛప ఘోణులుఁ గామితక్రియా
భజనమునం జరింతు రని ప్రస్తుతులం బ్రసరించుచున్న యా
ద్విజ యజనంబులం ద్రిదశతృప్తి సమాప్తి వహించు నద్దివిన్. ౯౧

### 2 గౌ డి

క. ఘటితసమాసోద్భటపద। పటలయు నోజ స్సుకాంతి భరితయు ఘోష
స్ఫుటవర్ణయు నిబిడార్థో। త్కటయును నౌ గౌడరీతి కల్పితకృతులన్. ౯౨

శా. శుభ్రాదభ్ర పరిభ్రమ త్పటుయశోజ్యోత్స్నా సరిత్పూరితా
తిభ్రష్టాధి తమస్సమూహము లగుధాత్రీభర్తలం బోరిలో
విభ్రాజిల్లుచళుక్యవిశ్వవిభుదోర్విక్రాంతి పెం పొంది తా
నభ్రద్వీపవతీతరంగములలో నాడించుఁ గ్రీడాగతిన్. ౯౩

### 3 పాం చా లి

క. పంచషపదక సమస్తతఁ। జంచ న్మాధుర్యకాంతి సంచర దోజ
స్పంచిత సుకుమారతలను। మించ చగుఁ బాంచాలరీతి మృదులాకృతియై. ౯౪

మ. చతురోదార చళుక్యనాథకర శిక్షాజాత రేఖాసుధా
లతలం గ్రాలెడు చారుసాయకనటీలాస్యాంగహారాదులన్
బ్రతిగా నిచ్చుటఁ జూచి తత్పరిచితిన్ బ్రాపించు శూరాదు ల
శ్రుత రంభాపరినృత్య కృత్యముల నచ్చోఁ జూతు రచ్చంబుగన్. ౯౫

4 లాటి

తే. ఏతదుక్త త్రిరీతి సమేత యగుచు
నల్ప ఘోషాక్షరములచే నతిశయిల్లి
తనరు సంయుక్త వర్ణముల్ తఱుచు లేక
వెలసెనేనియు లాటికావృత్తి యండ్రు. ౯౬

మ. అనిశంబుం గరవాలభైరవుని పాదారాధనం బొప్పఁ జే
సినవారుం ద్రివశాంగనాదయితులై జీవింతు రిచ్చోటఁ, జే
యనివారుం ద్రిదశాంగనాదయితులై జీవింతు రచ్చోట, నం
చు నిరూపింతురు విశ్వనాథవిబుధప్రస్తుత్యప్రభావం బిలన్. ౯౭

తే. తనరు శృంగార హాస్య శాంతములఁ గృపయుఁ
దనరు మాధుర్యగుణమునఁ దగును జెప్ప;
నద్భుతము రౌద్ర వీర భయానకములు
నమరు బీభత్సరసము నోజమునఁ జెప్ప. ౯౮

క. సకలరసములఁ బ్రసాద। ప్రకటితములు, దక్కియున్న ప్రాణము లెల్లన్
సుకవుల కుచితనియోజ్యము। లకలంకత నెఱిఁగియొనర నమరింపనగున్.

క. ఇప్పగిది సులక్షణముల। విప్పగు కమనీయ కావ్యవితతులు గైకో
నెప్పుడు నీచిత్తమునన। చొప్పడు శీతాంశువంశచూడారత్నా. ౧౦౦

మ. మనుమోహేంద్రతనూజ, సూరిజనతామందారభూమీజ, భూ
జనరక్షాచతురత్రివర్గ, హృదయాసన్నోల్లసద్భర్గ, దు
ర్జనశిక్షాచణయుక్తదండ, రిపురాజన్యాబ్జవేదండ, చి
జ్జనితాశేషకళాభిరామ, సమరస్థాణుప్రకారక్రమా! ౧౦౧

క. నందకపాణి పరాక్రమ। నంది మహాకాళితుల్య నవశైవకళా
నందోదయపద జగదభి। నందితసత్కీర్తి శోభనస్థిరమూర్తీ! ౧౦౨

మా లి ని

చతురగుణగరిష్ఠా సర్వవిద్యావరిష్ఠా
శ్రుతివిహితచరిత్రా శూరసైన్యాళిజైత్రా
ధృతివిభవజయంతా ధీరవన్యావసంతా
వితతధృతినగేంద్రా విశ్వభూపాలచంద్రా. ౧౦౩

గ ద్య ము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణి యనునలంకార శాస్త్రంబునం
ద్రివిధకావ్యచాటుప్రబంధలక్షణ వృత్తి రీతి
ప్రముఖ నానావిధ విశేష సముద్దేశం
బన్నది చతుర్థోల్లాసము.



# పంచమోల్లాసము

—•◆•—

## అర్థాలంకారప్రకరణము

క. శ్రీకాశీపతి పదనా। ళీకస్మృతిలోలచిత్త లీలావిజయ
శ్రీకర కులజలరాశిను। ధాకర చాళుక్యవిశ్వధరణీనాథా! ౧

శా. కావ్యశ్రీల నలంకరించుట నలంకారంబు లై చాలఁబ్రో
తవ్యార్థంబుల నొప్పి పూర్వకృతసందర్భంబులం బెక్కు లా
ద్యావ్యప్రోక్తుల *నాఱు ముప్పదియు నై భాసిల్లు వానిం గవి
స్తవ్యోద్యుక్తపదస్వరూపములుగా పాగింతు శాస్త్రక్రియన్. ౨

వ. అది యెయ్యది యనఁగా — 1 స్వభావాఖ్యానంబును. 2 నుపమయు, 3 రూపకంబును, 4 దీపకంబును, 5 నావృత్తియు, 6 నాక్షేపంబును, 7 నర్థాంతరన్యాసంబును, 8 వ్యతిరేకంబును, 9 విభావనయు, 10 సమాసోక్తియు, 11 నతిశయోక్తియు, 12 నుత్ప్రేక్షయు, 13 హేతువును, 14 నుదారంబును, 15 సూక్ష్మంబును, 16 లవంబును, 17 గ్రమంబును, 18 ప్రేయస్కంబును, 19 రసవంతంబును, 20 నూర్జస్వియు, 21 పర్యాయోక్తియు, 22 సమాహితంబును, 23 నుదాత్తంబును, 24 నపహ్నుతియు, 25 శ్లిష్టంబును, 26 విశేషోక్తియు 27 దుల్యయోగితయు, 28 విరోధంబును, 29 నప్రస్తుతస్తుతియు, 30 వ్యాజస్తుతియు, 31 నిదర్శనంబును, 32 సహోక్తియు. 33 పరివృత్తియు, 34 నాశీర్వచనంబును, 35 వక్రోక్తియు, 36 భావికంబును నన నర్థాలంకారంబులు షట్త్రింశత్ప్రకారంబు లై వర్తిల్లుఁ — దత్స్వరూపోదాహరణంబుల పరిపాటిం జెప్పుదు. నందు స్వభావాఖ్యానం బెట్టి దనిన. ౩

---

పండితారాధ్యచరిత్రలోను నన్నెచోడునిలోను 36. నరసభూపాలీయమున 70.

### 1 స్వ భా వా ఖ్యా న ము

క. జాతి గుణ ద్రవ్య క్రియ । లేతెఱఁగున నుండు నట్ల యింపుగఁ జెప్పన్
బ్రీతి స్వభావాఖ్యానము । జాతి యనం బరఁగు నదియు శాస్త్రజ్ఞులచేన్. ౪

శా. పీలక్రీలఁ దనర్చి నిర్మలము నై నిస్తంద్రసౌరభ్య మై
చాలం బేశలరూప మై చులక నై శాతోగ్రధారాగ్రరే
ఖాలంకారిత మై దృఢత్సరుసముద్యన్మేఖలాబద్ధ మై
వా లొప్పుం గరవాలభైరవజయావాలక్రియాశీల మై. ౫

క. జాతి గుణ ద్రవ్య క్రియ । లాతతజీవితము లందు రార్యులు శాస్త్ర
వ్రాతములకు సత్కవితా । జాతములకు; వీనిఁ బొసఁగ జనుఁబో నౌదువన్.

### 2 ఉ ప మ

క. గుణ ధర్మ కర్మముల ను । ల్బణ మయ్యెడువస్తువునకుఁ బరువడిఁ దుల్య
ప్రణయనము జేయు నెయ్యది । గణుతింతురు దాని నుపమగా బహువిధులన్. ౭

శా, చాళుక్యక్షితిపాలుఁ డొప్పు ననిలో శక్రుండునుంబోలె, దం
భోళిక్రీడఁ దనర్చు ఖడ్గ, మసుహృద్భూపాలకశ్రేణులుం
గూలుం గొండలభంగి, నంబరనటత్కోలధ్వజంబుం బొరిం
గ్రాలుం గాలవలాహ కాకృతి సురవ్రాతంబు గీర్తింపఁగన్. ౮

క. సతతప్రతిభోదయసం । గతి నుపమానోపమేయ కల్పనములయం
దతిచతురకవుల తలఁపులఁ । బ్రతిపాద్యోపమలు పెక్కుభంగు లెఱుంగన్. ౯

క. లింగంబుల వచనంబుల । భంగులు, హీనాధికతలపాటియు, వీడ్పా
టుం గదిరిన నుపమకు నిం । పుంగలుగం జేయు నంద్రు బుధు లుచితోక్తిన్. ౧౦

తే, అరుగుచున్నాఁడు పేడివాఁ డతివపోలెఁ,
బలుకుచున్నది పురుషునిపగిది నింతి,
ప్రాణములు నాకు నీతఁ, డుపార్జితార్థ
మిన్నివిద్యలు నవినను నెసఁగు నుపమ. ౧౧

క. దేవా, నీ చందనంబున । దేవేంద్రుం డొప్పు, నచట దినకరుగతి ను
ర్వీవరుఁడు తేజమున సం । భావితుఁడన నుపమ చెల్లుఁ బ్రౌఢప్రియమై. ౧౨

క. నిపుణులచెవి కెఱుఁగ మగు। నుపమలు నొకకొన్ని గలవ యొక్కొకచోటన్
క్షపవోలె జముఁడు కృష్ణుఁడు। విపినంబునుబోలె వనధి విపులం బనఁగన్. ౧౩

ఆ. హంపివోలెఁ జంద్రుఁ డవదాతుఁడు; నభంబు,
కొలఁకులట్లు పెడము, కుక్కవోలె
నింపు బంటు పతికి, నినుఁబోలె ఖద్యోత,
మనెడు నుపమ లపహాసనకరములు. ౧౪

సీ. సంకాశ నీకాశ సన్నిభ ప్రతిరూప తుల్య ప్రకాశాభ తులితములును
ప్రత్యనీక ప్రతిపక్ష సమానప్రతిద్వంద్వ నిభ సజాతీయములును
సదృశ సదృ క్షమ సంవాది సప్రభప్రతిబింబ కోపమా ప్రఖ్యములును
*సహలక్షణ ప్రతిచ్ఛంద విరోధిసదృక్ష సవర్ణ సపక్షములును

ఆ. నుపమి తానువాది యుత సరూప ప్రతి
నిధులు ననఁగఁ బెక్కువిధములైన
శబ్దములును, నట్టి సత్క్రియాపదములఁ
బోలుమచోటఁ జెప్పఁ బొసఁగు నండ్రు. ౧౫

క. దొరయు గెడ జోడు పోలిక। సరి సంగడి యుద్ది యీడు సాటి పగిది నాఁ
గరణి యనఁ జాడ్పు చందం। బొరసు పరుసు నాఁగ నుపమ కొప్పుంజెప్పన్. ౧౬

3 రూ ప క ము

క. ఉపమానంబునకును న। య్యుపమేయంబునకు రూపయోజన మేకో
ల్లపిత మయి వెలుఁగు నెచ్చటఁ। బ్రపంచితము రూపకంబు బహువిధలీలన్. ౧౭

ఉ. చారువళుక్యవిశ్వనృపచంద్రుని నిర్మలకీర్తిచంద్రికా
సారముచే సుహృత్కుముదసంచయముల్ విలసిల్లు, గర్వదు
ర్వారవిరోధివారిరుహవారములన్ ముకుళించు, నుల్లస
త్స్ఫూరితచకోరసంఘములు సొంపు వహించు, ధరాతలంబునన్. ౧౮

వ. ఇది ప్రసిద్ధ రూపకాలంకారం; బిందు భ్రాంతిమ దలంకారంబునుం గలఁ;
దది యెట్లనిన:— ౧౯

* తద్వ దేశార్థ సాంతత్య సాధర్మ్యాను రూపకాభేదనిరూపణములు—పా.

## భ్రాంతిమంతము

క. కవిసమ్మతి నారోప్య । ప్రవణానుభవంబు భ్రాంతిపద మగుఁ, దత్సం
భవ మయ్యెడుదానికిఁ జే । రవిరళముగ భ్రాంతి మంత మనఁగాఁ బరఁగున్. ౨౦

క. చంద్రాన్వయుఁ డగువిశ్వన । రేంద్రుని సత్కీర్తి దీప్తి లేపారుటయున్
సాంద్రతరంబుగ నెల్లెడఁ । జంద్రశిలాతతులు పరఁగు సద్రవ లగుచున్. ౨౧

క. సుకవినిరూపణములచేఁ । బ్రకటిల్లుచు రూపకములు బహుళాకృతు లై
వికసిల్లు, వానితెఱఁగులు । వికటంబులు దెలియవలయు వివిధస్మృతులన్. ౨౨

## 4 దీపకము

క. మొదలను నడుమను నొండెన్ । గదిసి క్రియాపదము యొండెఁ గారకమొండెన్
బొదలి తదర్థము దెలిపెడు । నది దీపకమనఁగఁ గృతుల నందం బెపుడున్. ౨౩

శా. కావించుం గులధర్మ మెప్పుడుఁ జళుక్యక్ష్మావిభుం డొప్పుగా
దేవశ్రేణి మదింప, దిక్కరులు మోదింపన్, ధరాభారభృ
ద్గ్రావవ్రాతము నంతసిల్ల భుజగేంద్రప్రీతి సంధిల్ల న
వ్యావిర్భూతపృథుం డితం డనఁగ భవ్యశ్రవ్యకీర్తిశుఁ డై. ౨౪

## అంత్యదీపకము

క. నల నహుష భరత భానుజ । బలిఖేదులకు సాటి పాటి తులితుఁ డ
గ్గలికుఁడు గెడ సదృశుం డన । వెలయుం జాళుక్యవిశ్వవిభుఁ డెల్లెడలన్. ౨౫

## మధ్యదీపకము

మ. కవిసంఘంబులకున్ బటీర పటికా కస్తూరికా చేటికా
వివిధశ్రీల విభూతియున్ విజయమున్ విశ్వేశ్వరుం డిచ్చుఁ బో,
భువి సర్వజ్ఞుఁడు శంకరుండు నగుటన్ బోలించి శీలించినన్,
భవనామస్తుతి భద్రదాయిని గదా భావింప నెవ్వారికిన్. ౨౬

## 5 ఆవృత్తి

క. చెప్పినమాటయ పెక్కుఁగ । జెప్పుట యావృత్తి యనఁగ జెలు వగు; నదియున్
దప్పక మూఁడు దెఱంగుల । విప్పఁ బదార్థోభయానువృత్తులఁ బరఁగున్. ౨౭

### శబ్దావృత్తి

క. అరు లని విశ్వేశ్వరునకుఁ । దిరుగక క్రీడింతు రమరదీర్ఘికలోఁ ద
త్పురవరపరిఖాతాయత । సరసులఁ గ్రీడించుఁ గ్రోడసంతతు లెపుడున్. ౨౮

### అర్థావృత్తి

క. శ్రీవిశ్వవిభుని వేఁడిన । యావిప్రులు విత్తవంతు లగుదురు, వారిన్
వావిరి నడిగినవారును । నావల ధనవంతు లగుదు రతిచిత్రముగాన్. ౨౯

### ఉభయావృత్తి

క. ధరణీవరాహం బగుపతి । ధరణి వరాహంబవోలెఁ దాల్చిన నేకా
తురచరణ మైనధర్మము । కరిగతి నలు గాల నిలిచెఁ గలియుగవేళన్. ౩౦

### 6 ఆక్షేపము

క. తొడఁగినకృతకృత్యంబుల । నడఁచునిషేధోక్తి దలఁప నాక్షేప మగున్
బెడఁ గగు సుకవులతలఁపుల । బడిఁ గాలత్రితయవిధుల బహుగతు లగుచున్. ౩౧

ఉ. 'వారక విశ్వభూవిభునివాలున కగ్గము గాకుఁ, దైత్యరే
నీరస మబ్బు మిమ్ము వరియించినవేళపుఁబువ్వుఁబోండ్లకున్
ధీరత మంటవెంట నరుదెంచినతెంపున మాకు, నంచు వా
గ్వీరము వీరభార్య లెఱిఁగింతురు భర్తల కాహవంబునన్. ౩౨

### 7 అర్థాంతరన్యాసము

తే. చెప్పఁ దొడఁగిన యర్థ సంసిద్ధికొఱకు
వేఱ యర్థము యోజించి వెలయఁ దెలుప;
నదియ యర్థాంతరన్యాస మనఁగఁబరఁగుఁ
దలఁప నేర్చినఁ బెక్కుభేదముల నెగడు. ౩౩

మ. క్షమలో వేఁడనివారికేనియును విశ్వక్ష్మావిభుం డిచ్చు న
చ్ఛములై పొచ్చెము లేనిసంపదల శశ్వత్సర్వలోకాశ్రయ
త్వము, నైజంబుగ నట్ల కాదె తలఁపన్ వాంఛార్థహీనస్ఫుర
త్కమలోజ్జృంభణకల్పనంబు రవికిన్ గర్జంబు మి న్నందియున్. ౩౪

8 వ్య తి రే క ము

క. అమరఁగ శబ్దార్థంబులు । క్రమతుల్యము లయ్యు భేదకథనముచే వ
ర్ణ్యము నతిరిక్తముఁ జేయుట । నమితవ్యతిరేక మనఁగ నగుఁ బలుకుబడిన్. ౩౫

మ. సుమనోరక్షణవైభవంబులను జిష్ణుత్వంబునం గ్రూరవి
క్రమవిద్విడ్బలమర్దనంబున సుధర్మత్వంబు తుల్యంబపో,
యమరాధీశుఁడు గోత్రభంజనుఁడు గోత్రానందసంపాది వి
శ్వమహీపాలుఁడు, వీరికిన్ గుణకథా సాదృశ్య మేచందమో. ౩౬

9 వి భా వ న

తే. సహజ విఖ్యాత హేతువు జాఱ విడిచి,
కారణాంతరకల్పనకథన మొండెఁ
గామవిహితస్వభావసంగతియ యొండె
నమరఁ బల్కు, విభావన యనఁగ బరఁగు. ౩౭

మ. స్ఫురదాధ్మాతకరాళకీలమును దంభోళిప్రభాభీలమున్
జల దస్పష్ట కృతాంతదండమును నై సంగ్రామరంగంబులోఁ
గరవాలంబు చళుక్యవల్లభునిచేఁ గ్రాలుం బరప్రాణసం
హరణక్రీడన దృష్ట మృత్యురసనాహంకార ఘోరంబుగన్. ౩౮

10 స మా సో క్తి

క. తగు వినిహితార్థగర్భిత । యగు నన్యార్థోక్తి గతి సమాసోక్తియగున్,
సుగమార్థగోపనముచే । నెగడిన నన్యాపదేశనియతిం బదయున్. ౩౯

మ. స్ఫుటపున్నాగములం దొఱంగి, కితవస్తోమంబుఁ బాటించి, యు
త్కటపంకాంకితమూర్తులం గదిపి, భద్రశ్రీలపైఁ గూర్మి దు
ర్ఘటముం జేసి, సువర్ణముం దెగడి, దుర్వర్ణంబు నర్థించి, యే
చటలం జెందిన మెచ్చునే నృపతులన్ సోమాన్వయుం డుర్వరన్. ౪౦

11 అ తి శ యో క్తి

క. తనతలఁచిన యర్థము పొం
పున వింపున లోకవృత్తమున కతిశయిత
ధ్వని గలిగి కవులచెవులకు
నొనరినయది యతిశయోక్తి యొప్పగు గృతులన్. ౪౧

క. ఉల్లసితాలంకృతులకు । నెల్లఁ బరాయణము, కవుల కెలిమి యనఁగ శో
భిల్లుం బెక్కుతెఱంగులఁ । జెల్లుం బొరి నేకపదముచే నొడఁగూర్పన్. ౪౨

మ. భరితార్తిం బరగండభైరవునిచే భగ్నాంగులై పాఱు త
త్పరిపంథి ప్రమాదావలోకన గళ ద్బాష్పాంబుధారాపరం
పర పెల్లేమనిచెప్ప! నంతయు జలాభావంబులై యుండు న
మ్మరుదేశంబు లనూపభూము లగు సీమామానహీనాకృతిన్. ౪౩

## 12 ఉత్ప్రేక్ష

క. అలవడ శబ్దార్థములకుఁ । జెలువంబగు నన్యశక్తి సృజియించి సము
జ్జ్వల దుత్ప్రేక్షావ్యంజన । ములచే నుత్ప్రేక్ష యనఁగ మొనయుం గృతులన్.

చ. కెరలు చళుక్యవిశ్వవిభుకేతువరాహము నన్యభీతికృ
ద్గురుతరకృత్య యందు రొకకొందఱు, కొందఱు వైరివాహినీ
నిరుపమమృత్యు వందు, రిట నే నయినన్ రిపురాజమండలా
హరణము సేయ వేఁడి పొలుపారెడిరాహువుగాఁ దలంచెదన్. ౪౪

క. గజభుజగాదులదెసఁ గల । గుజిబిజికిం గాక పీడుకొన్నదివోలెన్
భజియించి నిలిచె వలపటి । భుజమున విశ్వేశ్వరునకు భూసతి ప్రీతిన్. ౪౫

## 13 హేతువు

క, కారకమును గ్రియయును న । ర్థారంభంబునకు బీజ మగు నేమిట నిం
పార, నది హేతు వనఁజను । భూరిప్రతిభావిశేషములఁ బెక్కరయన్ ౪౬

శా. సంపల్లంపటమందహాసములు, సంజాతానుకంపాకళా
సంపన్నంబులు, సాదరప్రియనయస్థానంబు, లిద్ధక్రియా
సంపూర్ణంబులు నాఁగ విశ్వధరణీశ శ్రీకటాక్షాంశువుల్
పొంపుం బెంపును నింపు సేయు నెపుడున్ సూరీశ్వరశ్రేణికిన్. ౪౭

## 14 ఉదారము

క. ఆయాసోపార్జితము న । దేయమును మనోహరాభిధేయమ్మును శ్ర
ద్ధేయము నగుధన మొసఁగు ను । పాయ ముదారంబు నాఁగ నవనిం బర్వన్.

శా. విశ్వేశావనిపాలపాలకునిచే విత్తాఢ్యులున్ సత్యభా
గశ్వారూఢులు నంబరాభరణచిహ్నాటోపులుం గామినీ

శశ్వత్సౌఖ్యసమగ్రమానసులు నై చారుస్థితిన్ సత్కవుల్
సైశ్వర్యోన్నతిఁ బేర్తు రెప్పుడు తదౌదార్యం బవార్యంబుగన్. ౧౦

### 15 సూ క్ష్మ ము

క. ఆకారేంగిత కృతచే। ష్టాకల్పితసూక్ష్మగతుల సంలక్షితమై
కైకొనఁదగు నంతర్గత। పాకాల్పత సూక్ష్మ మనఁగఁబరఁగుం గృతులన్.

ఉ. శ్రీలజళుక్యనాథుఁ డొనరించెను నేఁ డని గారవించుచో,
బాలకు లేఁతన వ్వధరపల్లవకాంతి నలంకరించె, వై
మాలపుసిగ్గు చూపులకు మాటుగఁదోఁచెఁ, గుచోత్తరీయమున్
గే లొడికంబు సేసెఁ, దిలకించిరి నెచ్చెలు లట్టిచేష్టలన్. ౧౨

### 16 ల వ ము

తె. సూక్ష్మభావంబు విడువనిసొబగుతోడ
భావమునఁ దోచువస్తుగోపనముపేరు
లవము నాఁ జను; దేశకల్పనముతోడి
విమతినిందలు లవమున విస్తరిల్లు. ౧౩

చ. సుదతి యొకర్తు విశ్వవిభుఁ జూచి వడిం బులకించి లజ్జ లోఁ
గదిసిన నేర్పుతోడఁ జెలికత్తెల కిట్లను వింత యొప్పనే
మృదులవనానిలం బనుగమించుమధువ్రతపంక్తితోన విం
పొదవఁగ వీచె డిగ్గియలనుండి సరోజరజోవిలాసి యై. ౧౪

### 17 క్ర మ ము

క. ఉపమానము నుపమేయము। నుపమలఁ బరిపాటి తప్పకుండఁగ నొడువన్
నిపుణత్వము క్రమ మనఁ జను। ప్రపటు ప్రఖ్యాత శబ్ద పంక్తులచేతన్. ౧౫

ఉ. శ్రీరుచి వైభవోదయ శరీరవిలాసములందుఁ జూడఁగా
శౌరి శశాంక జంభరిపు శంబరశత్రులతోడ నెప్పుడున్
దొరపు టీడు జోడు సరి దోయి చళుక్యనరేంద్రుఁ డంచు విం
పారఁగ జాటుసత్కృతు లుదారత మ్రోయు సభాంతరంబులన్. ౧౬

## 18 ప్రేయము

క. ప్రేయోలంకారంబు వి । ధేయం బగుఁ బ్రియతరాభిధేయోక్తులచే
నే యెగ్గు లేక కర్ణ ర । సాయన మై యుండెనేని సత్కవికృతులన్. ౨౭

మ. భవదుద్యత్కరుణాకటాక్షకిరణోత్పన్నంబు లస్మన్మహో
త్సవసంపత్ప్రకరంబు లెల్ల నని శస్తస్తోత్రులై విశ్వభూ
ధవు భూపాలగుణప్రకీర్తనలఁ బ్రీతస్వాంతులై కాంచి శా
త్రవు లర్చింతురు పాదపద్మముల నిర్యన్మౌళిరత్నద్యుతిన్. ౨౮

## 19 రసవదలంకారములు

క. *అసితం బగురత్న్యాది । ప్రసరణములఁ దేజరిల్లి ప్రథమరసాదుల్
పొసఁగఁ బడు నెచట నది వో । రసవదలంకార మనఁగ రసికుల కెక్కున్. ౨౯

### శృంగారరసము

చ. ఇల వలరాజురూపునకు నెక్కువ యయ్యెడు విశ్వమేదినీ
లలనుని రూపయౌవనవిలాసములం జెలిమాటు చేరి, య
గ్గలికపుసిగ్గు వేడుకలక్రందున కడ్డపడంగ నిమ్మలన్
మెలఁతుక వాలుఁజూపులకు మేపులు వెట్టెడుఁ జూచితే సఖీ! ౩౦

### హాస్యరసము

క. హీనాచారుల బహుకో । హీనాత్ముల సతతసవ్యలీకులఁ జూడం
బూనెడువిశ్వేశ్వరువి న । వీనదరస్మితము లచ్ఛవెన్నెలఁ బోలున్. ౩౧

### కరుణరసము

క. అనిఁ దృణముగఁ గఱచి జే యని । నినదించుచుఁ బొరలువిమతనికరముఁ గరుణన్
గనుఁగొని కాచుట నైజము । గొనకొని యరిరాయగండగోపాలునకున్. ౩౨

### రౌద్రరసము

క. రుద్రుం డగు విమతనరో । పద్రవకరణములఁ గుపితబలభద్రుఁడగున్,
ముద్రణితకదనగతి ను । న్నిద్రాకృతి విశ్వమేదినీపతి చూడన్. ౩౩

---

పా. *లసితంబగు రత్న్యాదిప్రసరణచేఁ దేజరిల్లి.

వీ ర ర స ము

క. అరివీరుల నమరావతి। కరిగించుచు వివిధధనము లర్థివరులకై
యురవడి నొసఁగుచుఁ బరగెడు। నిరతోత్సాహంబు విశ్వనృపునక యొప్పుఁన్.

భ యా న క ర స ము

క. రిపునృపులు విశ్వనాథ। ప్రపటుధ్వజదంష్ట్రిఁజూచి పరఁగినభీతిన్
విపినవరాహంబుల నిల। నిపుడుం గనుఁగొనఁగ వెఱతు రెట్టితలఁపులో. ౧౫

బీ భ త్స ర స ము

మ. అతిదృప్య త్పరగండభైరవ భుజోద్యత్ఖడ్గకృత్తాహిత
చ్యుతభూరిక్షతజప్రవాహములలో ఖండాలరుండావళీ
కృతలీలాచరయానపాత్రములలోఁ గ్రీడించు నాయోధన
క్షితి భూతంబులు మజ్జమాంసరసమస్తిష్కప్రమత్తంబులై. ౧౬

అ ద్భు త ర స ము

క. సమధిక మగు నచ్చెరు వ। చ్చముగా విశ్వేశు దానజలధారా పూ
రముచేతఁ జేతి కందును। విమలాంబరకనకహారులు విద్వత్తతికిన్. ౧౭

శా ం త ర స ము

క. విశ్వేశుమహిమ విని కని। విశ్వంభర విడిచి మదము వీడ్కొని విమతుల్
శశ్వద్దమశమయుక్తి న। నశ్వరులై నిలుతు రమరనగముల నదులన్. ౧౮

20 ఊ ర్జ స్వి

క. అతులితబలవదహంకృతి। యుతమగువాక్యంబు దలఁప నూర్జస్వి యగున్
బ్రతిభటతర్జనగర్జన। వితతాక్షేపములచేత విస్ఫుట మెపుడున్. ౧౯

మ. కపటద్విట్కరవాల భైరవుఁడు ఖడ్గాఖడ్గిసంక్రీడలన్
గుపితాటోపనిరూఢి నుగ్రరిపురక్షో రాజనారాయణుం
డపరావిష్కృతరుద్రుఁ డన్యపురదాహ ప్రౌఢిచే విశ్వభూ
మిపుఁ డమ్మేటి నెదుర్చుటల్ జమునితో మేలంబు గావించుటల్. ౨౦

21 ప ర్యా యో క్తి

క. కార్యార్థక్షప్తిచేఁ ద। త్కార్యార్థప్రాప్తికొఱకు గల్పించిన మా
ధుర్యయుతభాషితం బది। పర్యా యోక్తంబు నాఁగఁ బరఁగుం గవితన్ ౨౧

చ. సురుచిరరత్న [1]కీలితము సూతము బన్నసరంబు సూపు క
ప్పురపుఁగరండమును దెఱచి పుచ్చు [2]వెలుంగున, నంచు విశ్వభూ
వరుఁ డొకయింతిఁ బల్కుటయు వచ్చినవెచ్చెలు లంతటంతటన్
[3]సురిగిరి సాలభంజికలచొక్కపు[4]జోటులువోలెఁ జూడఁగన్. ౭౨

22 స మా హి త ము

తే. కడఁకతోమున్ను దొరకొన్న కర్జమునకు
సాధనము దైవవశమునఁ జాగెనేని
యది సమాహిత మని చెప్ప నతిశయిల్లుఁ
గార్యకర్తకు నానందకరణ మగుచు. ౭౩

ఉ. మానిని విశ్వనాథుపదమంజరులన్ దనఫాలపట్టమున్
మానుగఁ గూర్తు నంచు నభిమానము మానఁ దలంచుచోట న
మ్మానవనాథుఁ డచ్చ మగుమక్కువ నచ్చటి కేఁగుదెంచి త
త్పానశరాసనాస్త్రములు చూఱగొనుం గరుణాసమేతుఁ డై. ౭౪

23 ఉ దా త్త ము

క. అతులైశ్వర్యాశ్రయముల। వితతత్వ ముదాత్త మనఁగ విశ్రుత మగు, నం
చితసంపద్బహుళము నూ। ర్జితపదమును నగుచుఁ, గావ్యరీతులయందున్.

శా. వంశం బీశ్వరమౌళి మండన మహోఽవార్యంబు, నిర్నిద్రని
స్త్రింశం బింద్రపురస్థితాహితనుతిశ్రీకంబు, చక్రాచల
ప్రాంశుధ్వాంతనిహంత్రి కీర్తి, వినమద్రాజన్యకోటీరర
త్నాంశూదంచిత మంఘ్రియుగ్మము, చళుక్యస్వామి కెల్లప్పుడున్. ౭౫

24 అ ప హ్ను తి

క. కలయర్థనిరసనంబున। నలవడు నన్యప్రకార మగునర్థముచే
వెలయు నపహ్నుతి యనఁగాఁ। బలికెడువెరవులను బెక్కుపాకము లగుచున్.

మ. "ఘనమేఘం బది వాజిగా, దతఁడు నిక్కం బింద్రుఁ డారోహకుం
డనరా, దంగమరీచి గా దది తటిద్వ్యాపార, ముద్యత్ఘుర

పా. 1 కీలనము 2 పలుంగుల 3 సురుచిర 4 బోటులు

ధ్వని గాఢంబుదఘోషణం బిడి. ధరన్ దక్కొంట పిసాంపు లే,"
దని భావింతురు విశ్వభూవిభుని యశ్వారోహణక్రీడలన్. ౭౮

25 శ్లి ష్ట ము

క. ఏకార్థోక్తం బయ్యు న। నేకార్థము చిలుకుచుండు నెయ్యది యదివో
లోకమున శ్లిష్టమనఁగాఁ। గైకొనఁ దగుఁ బదవిచిత్రకల్పనవిధులన్. ౭౯

మ. మరుదుత్థేలదశోకపల్లవయు, సమ్యక్పత్త్రిసందోహయున్,
భరితామోదయు, జృంభమాణ సుమనోభద్ర ప్రదేశంబునై,
యరుదై యొప్పెడువిశ్వభూపవిపులోద్యానావళిం జూడఁ ద
త్పురియుం బోలెఁ దనర్చె వింతి మహిళా పున్నాగపూగంబులన్. ౮౦

26 వి శే షో క్తి

క. జాతిక్రియాగుణాదుల। యాతతహీనత్వకథన మలవడు నెచటన్
ప్రీతివిషయేతరార్థ। స్ఫీతతకై యదియ తగు విశేషోక్తి యనన్. ౮౧

మ. చటులక్రోడపతాక యెత్తరు, బృహత్సైన్యంబు పైఁ ద్రోవ, రు
ద్భటవిస్ఫారణరవం బెలర్ప రతిద్రుప్యద్గండగోపాలు భ్రూ
కుటిమాత్రోదితచేష్టచేతన రిపుక్షోణీశు లంతంతటన్
స్ఫుటజూటంబులు దాల్తు రెక్కువ గదా భూరిప్రభావం బిలన్. ౮౨

27 తు ల్య యో గి త

క. ఖ్యాతగుణంబులచే న। ద్యోతిత సదృశోక్తి తుల్యయోగిత యగుఁ బ్ర
స్ఫీత స్తుతి నిందనములు। జాతీయముగాఁగఁ జెప్పఁ బను నండ్రు బుధుల్.

శా. కాలవ్యాలముఁ గాలకూటమును విర్ఘాతంబు ఘోరానల
జ్వాలాజాలము వీక్రపాణమును దుర్వారంబు లుగ్రక్రియా
లోలక్రీడల నంచు నెన్నుదురు భూలోకాదిలోకంబులన్
జాళుక్యాన్వయవిశ్వభూప సమితిజ్యాశీలమంత్రోజ్జ్వలా! ౮౩

28 వి రో ధ ము

క. తమలో నొంటమి రెంటఁ బ। దములకు సంభావితార్థ దర్శన మెచటన్
గ్రమమున విరుద్ధ మగు నది। యమరు విరోధంబు నాఁగ నయ్యెయెడలన్. ౮౪

చ. అని మొన విశ్వభూవిభువిహస్త కృపాణము చంద్రహాస మ
య్యును మఱిచిత్రభాను వన నుజ్జ్వల మయ్యెడుచోట నప్సరో
వనితలచన్నులం బులకవర్గము నెక్కొను వైరిభీరు లో
చనముల నశ్రువారములు పాల్పడు నంచును నిందునుం బోరిఁ. ౭౬

## 29 అ ప్ర స్తు త స్తు తి

తే. వివిధసేవాదికంబుల విసువుచేత
నడరి యప్రస్తుతస్తుతి యనఁగ బరఁగు;
ననుచితార్థప్రశంసనమయ్యు నదియు
నొనరనొక్కొక్కచోటున నొప్పునొనఁగు. ౭౭

చ. కస వశనంబు, పేయ ముదకంబు, విహారము గానలోపలఁ,
వసుమతి శయ్యవ, ట్టొరులవంకఁ జరింపమి సంతసం, బిలఁ
బసులకు నెల్ల వృత్తి, జనపంక్తుల కైన నభీప్సితేందిరా
వసుమతి మైన విశ్వజనవల్లభుదృష్టియ వృత్తి నిచ్చలుఁ. ౭౮

## 30 వ్యా జ స్తు తి

క. వ్యాజస్తుతి యనఁగఁ బరి। భ్రాజిత మగు నిందవోలె బ్రణుతింపంగాఁ
దేజం బెనఁగెడు కథనము। రాజిల్లెడు మధురవచనరచనలచేతఁ. ౭౯

ఉ. "ఈతఁ డుపేంద్రపుత్త్రిఁ డటె యింటుల నేఁపక యేలమాను ? బ్ర
ఖ్యాత వినూత్నభద్రుఁ డటె కాంతల నేఁపక యేల తక్కు ? వి
ద్యోతకళాధరుం డటె వధూటుల నేఁపక యేల యుండు, నే
రీతి ?" నటంచు విశ్వవిభుఁ బ్రీతి నుతింపుదు రంగనాజనుల్. ౮౦

## 31 ని ద ర్శ న ము

క. తిర మగునొకయర్థముతో । సరి యగునర్థాంతరంబు సమకొల్పి తగఁ
[1]బర మైన నపర మైనను । ధరణి నిరూపింపఁగా నిదర్శన మయ్యెఁ. ౮౧

ఉ. ఇవ్వసుధం గవిప్రవరు లెచ్చట నుండియుఁ [2]జెంద కుండినఁ
మవ్వ మెలర్ప విశ్వనృపమన్మథుఁ డిచ్చు నభీష్టసంపదల్

పా. 1 పర మైననపర మైనను 2 జేఁడ

నివ్వటిలంగ, నత్తెఱఁగు నిశ్చితకృత్యము, యీక తక్కనే
దవ్వులనుండి యైన రవి తమ్ముల కిమ్ముల నద్వికాసముల్. ౯౨

## 32 స హో క్తి

క. సమగుణధర్మము లగుభా । వములఁ గ్రియాసదృశ యగుచు వచనార్ధముతో
నమరిన సహోక్తి యనఁ జను । సముచితచతురార్థ శబ్దసంఘటనమునన్. ౯౩

చ. వసుధ జిగీషఁ దైనశశివంశ్యుని కీర్తులతోన చంద్రికా
విసరము సాగె దిక్కులను, విభ్రమదశ్వఖురోన్నమద్రజః
ప్రసరముతోన తోయజవరాగము వ్రాఁకె నభంబు, మిత్రమా
నసపరిశుద్ధితోన మలినత్వము వీడ్కొనె వారిపూరముల్. ౯౪

## 33 ప రి వృ త్తి

క. సరి నన్యోన్యార్థములం । బరువడితో మార్చుకొనుట పరివృత్తియనం
బరఁగుం బలికెడువెరవులఁ । నరయనలంకారకరణ మగుసత్కృతులన్. ౯౫

శా. సవ్యాసవ్యవిఘాతశాలి యగు నీ చాళుక్య విశ్వేశు హ
స్తవ్యావల్గదసిప్రభావము ప్రశస్తప్రౌఢి దీపింపఁగా
భవ్యాంగంబుల నాహరించి యనిలో భద్రక్రియాపాది యై
దివ్యాంగంబుల నిచ్చుఁ బేర్చి మదవద్వీరాహితశ్రేణికిన్. ౯౬

## 34 ఆ శీ ర్వ చ న ము

క. ఆశీర్వచన మనంగా । నాశాస్యపదార్థ సమ్యగాశంసన, మి
ద్ధాశయము భద్రములకుఁ బ్ర । కాశింపఁగఁ దగు నశేష కావ్యముఖములన్. ౯౭

ఉ. వేలుపుటిల్లువిల్లు, వెడ వీఁకలవోకలనారి, రెండుచే
దోల వెలుంగుతూ, పెనఁటఁ దోలిన బాలునితేరు మాటలై
గ్రాలెడుతేజు, లెవ్వనికిఁ గల్గు నతండు చళుక్యవిశ్వభూ
పాలుమనంబునం పురవిభంజనుఁడై విహరించుచుండెడున్. ౯౮

## 35 వ క్రో క్తి

తే. స్తుతియు నభయంబుగా మున్ను దోఁచి పిదపఁ
దోడుతో వంకవంకయై దొరకుపలుకు

కవులు వక్రోక్తి యన నొప్పుఁ గబ్బములను
గల్పనీయార్థవశముల గానవలయు. ౯౯

మ. పరపుష్టంబులు కోకిలంబు, లవిశ్రాంతుండు చంద్రుండు, క్రొ
వ్విరు లస్త్రంబు, లనంగుఁ డంగభవుఁ. డీపీఁడింద్లు నిన్నేఁచ ను
ర్వరలో నెంతటివారు ? వారక సఖుల్ వారింపఁగాఁ బోయి సుం
దరి విశ్వేశ్వరుఁ జూచి, తద్విభుమహత్త్వం బీదశాభేదముల్. ౧౦౦

సంకరము

క. వివిధాలంకృతి సమ్మతిఁ। జవిగా నొనరించు నర్థసంగతిచేతన్
సవర నయి కర్ణముల కు। త్సవపద మగుకబ్బ మరయ సంకర మయ్యెన్.

మ. అనిలోనం గరవాలభై రవుఁడు వీరారాతులం గూల్చి న
ర్జునుఁ డీతం డనఁగా, సురాంగనలకున్ శూరాహిత శ్రేణికిన్
దనరించుం దగులంబు లచ్చుపడ నుద్యద్రాజకందర్పుఁ డై,
ఘనకీలాలము లబ్బఁ జేయు ఘనవిఖ్యాతిం బ్రపూర్ణంబుగాన్. ౧౦౨

36 భావికము

తే. భావ మనఁగను గవియభిప్రాయ మండ్రు,
భావభేదవియుక్తంబు భావికంబు,
వివిధరూపప్రబంధోక్తి విషయగుణము,
దగు వివేకింప సూక్ష్మ సందర్శనమున. ౧౦౩

చ. వివిధపదార్థ భావరసవృత్తుల రీతులఁ గావ్య పాకసం
భవ మగుసూక్ష్మ బంధమునఁ బర్వునలంకృతు లెల్లఁ జూచి, స
త్కవుల వివేక మెల్లఁ బొడ గానఁగ నేర్పుచబుక్యవిశ్వభూ
ధవుఁ డనుమాట లొజ్జల వి దర్ప మెలర్ప సభాంతరంబులన్. ౧౦౪

ఉ. చంద్రకులాగ్రగణ్యుఁడు, ప్రశంసితపుణ్యుఁడు, సత్యధీహరి
శ్చంద్రుఁడు, శైవతంత్రవిలసద్వృష భేంద్రుఁడు, నీతితత్త్వని
స్తంద్రుఁడు, శౌర్యలోలుఁడు, బుధప్రియశీలుఁడు, భూరివిక్రమో
పేంద్రుం, డుపేంద్రనందనుఁడు, భీమపదానిశవందనుం డిలన్. ౧౦౫

క. గంధర్వకళావిదుఁ, డరి । గంధద్విపమదవిమర్దకంఠీరవుఁ, డు
ద్బంధురవరాహకేతుఁడు, । బంధుపయోరాశిసముదబాంధవుఁ డెపుడున్.

మాలిని

అహితనగరరుద్రుం, డంగనాసంఘభద్రుం,
డహిమకిరణతేజుం, డర్చ్యవిద్వత్సమాజుం,
డహసితపలశీలుం, డర్థివర్గానుకూలుం,
డహరహరుదితార్థుం, డాజిపార్థుండు శక్తిన్. ౧౦౩

గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోటపెద్దయనామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణి యనునలంకార శాస్త్రంబునందు
నర్థాలంకారసముద్దేశంబన్నది
పంచమోల్లాసము.



# షష్ఠోల్లాసము



## శబ్దాలంకార కావ్యదోష ప్రకరణము

### శబ్దాలంకారములు

క. శ్రీశుఁడు, హృదయాంతరిత గి। రీశుఁడు, పదవినమదరినరేశుఁడు, విజయా
ధీశుండు, విజయతత్పర। వేశుఁడు, చాళుక్యవంశవిశ్వేశుఁ డిలన్. ౧

క. శీలింపవలయు మరి శ। బ్దాలంకారంబు లైనయమకాది విచి
త్రాలిఖితబంధభేదము। లోలినయొకకొన్ని, వాని నొనరింతుఁదగన్. ౨

క. కలయఁబడి రూపకాదుల। కలవడు సంసృష్టిసంకరాఖ్యలు కృతులన్
విలసితమణికనకమరీ। చులకు విమిశ్రమును బోలె శోభాధికతన్. ౩

### శబ్దసంసృష్టి

క. తిలతండులములు సరి సరిఁ। గలసినగతి రూపకాదికంబులు తమలో
పల బెరసి యుండు నెచ్చట। లలి నది సంసృష్టి యను నలంకృతి యయ్యెన్.

తే. వృత్త్యనుప్రాసపదసమావృత్త మైన। శబ్దసంసృష్ట్యలంకారసంజ్ఞితంబు
వినుతమర్దళమంజులధ్వనియుఁబోలెఁ। గర్ణములకెప్డు నానందకరణ మగును.

చ. గుహ భృగురామ రామ సమకోపవిభూషితవిశ్వభూమిభృ
ద్వహబలబాహురాహువు కృపాణముఖోద్ధతిఁ బేర్చి తత్పమి
న్మహి విహరించుచో నహితమండల మైందవమండలంబుగా
విహితవివేకు లై గగనవీథిఁ దలంతురు వేల్పు లాత్మలన్. ౪

### క్షీరనీరన్యాయసంకరము

తే. పాలు నీరును గలసి యేర్పడకయున్న। కరణిఁ, దద్రూపకాదులు బెరయు నెచట
దొరసి యది క్షీరనీరసంకరము నాఁగఁ। గబ్బముల నుండు నంగాంగికములచేత.

శా. సత్త్రాచారము చెప్ప నొప్పు నిల విశ్వస్వామి కెట్లన్న న
ద్ధాత్రీశాధ్వరభోజనంబులమ దత్తద్గాహతారిప్రియా
మత్రక్రీడల నిత్యదానముల సమ్యక్ప్రీతి వర్తింతు రా
సుత్రామాదులు నప్సరోగణములుం సూరీంద్రులుం దద్దయుఁ. ౮

నరసింహసంకరము

క. లసితాలంకృతి సంధులు । గసిబిసి యై చెదరకుండఁ గల్పించినఁ బొం
దెసఁగెడు సంయోగం బది । రసికులు నరసింహసంకరం బనఁబరఁగుఁ. ౯

మ. పనితోదగ్రుఁడు విశ్వనాథుఁ డనిలోఁ బర్జన్యచందంబునఁ
గనుపట్టం బటహారవంబు మొరయం గర్జోపమానోద్ధతిఁ
దనరించుఁ రుధిరాపగానికరముం దదోర్యథబాహుభ్రమ
ద్ఘనకోదండపయోధరప్రవిగళ త్కాండావళీవర్షముల్. ౧౦

క. ఒకతెఱఁ గిది శబ్దార్థ । ప్రకటనములసంకరములు బహువిధము లిలఁ
సుకవులు ప్రతిభాఫణితుల । సకలంబు నెఱుంగవలయు శాస్త్రములందుఁ. ౧౧

అనుప్రాసములు ౩

ఆ. [1]ఛేక [2]వృత్తి [3]లాట సిద్ధంబు లగు నను
ప్రాసములు ధరిత్రిఁ బరఁగు మూఁడు,
లలితవృత్తి; వావిలక్షణోదాహర
ణములు తెలియవలయు యమకవిధుల. ౧౨

(1) ఛేకానుప్రాసము

క. ఛేకాను ప్రాసం బనఁ । నాకర్ణిత మగుచునొప్పు నర్థము వేఱై
చేకొన్నవ్రాల యొప్పుగ । చేకొనఁబడునేవిఁ గృతుల పిరులకు నెలవై. ౧౩

క. కందర్పదర్పదము లగు । సుందర *దరహాసరుచుల సుందరి యందం
బందముగూరఁగ శంకర । వందారూదార విశ్వవరు నర్చించెఁ. ౧౪

(2) వృత్త్యనుప్రాసము

తే. ఒకటి రెండును మూఁడునై యొలయువ్రాలు
పద్యమున నచ్చటచ్చటఁ బరఁగునేని
వృత్త్యనుప్రాస మన నది విస్తరిల్లు
లలితరీతుల కెల్ల విలాస మగుచు. ౧౫

* రతి

ఉ. చొక్కపుటుక్కు ద్రిక్కిఁజిసి స్రుక్కక పెక్కువ నక్కజంపుట
న్నెక్కక చక్కనై బ్రదుకువిక్క నెఱింగితిరేని శాత్రవుల్
మొక్కలమేఁది మ్రక్కియని మ్రొక్కుఁడు. మ్రొక్కక నిక్కుచున్న మీ
పెక్కులు చక్కఁబెట్టు విఘటించి చళుక్యనరేంద్రుఁ డిక్కడన్. ౧౬

(౩) లాటానుప్రాసము

క. పాటిగఁ జెప్పిన శబ్దమ । చాటుగతిన్ సొరిదిఁ బల్కు చక్కఁద మర్థా
ఘాటోత్కర్షము చేసిన । లాటానుప్రాస మనఁగ లలితం బయ్యెన్. ౧౭

చ. ధరణిఁ జళుక్యవిశ్వవిభుదానము దానము, కీర్తికీర్తి, భీ
కరమగువాలు వాలు, రణగర్వము గర్వము, గాక; కల్పితే
తరనృపనామధారకులదానము దానమె, కీర్తికీర్తియే,
కరమున వాలు వాలె రణగర్వము గర్వమె పౌరుషక్రియన్. ౧౮

శృంఖలన్యాయబంధము

క. మొదలిపదం బటమీఁదటి । పదయుక్తికి హేతు వగుచుఁ బరువడిఁ గలయన్
దుదిపదముతోడ నడికిన । నది శృంఖలమూలబంధనాఖ్యన్ బెరయున్. ౧౯

చ. ధరణి శ్రుతంబుచే నఖిలధర్మము, ధర్మముచేత నర్థసు
స్థిరతయు, నర్థసుస్థిరతచేత బలోదయమున్, బలోదయా
చరణముచే జయావహము సంపదయుం బ్రభవించు విశ్వభూ
వరునకు, నీతిమార్గమున వావిన చేరవె నిత్యభద్రముల్. ౨౦

ఏకావళి

తే. ఆదిశబ్దంబునకు మీఁద నడరుపదము
దగువిశేషణములతోడఁ దగిలి వరుస
గొలుసుగొని యర్థసంగతిఁ గూడెనేని
యదియు నేకావళీసంజ్ఞ వడరు నంద్రు. ౨౧

చ. పదిఁ దలపోయ విశ్వవిభుమంజులభాషలు సర్వసంపదా
స్పదములు, సర్వసంపదలు సజ్జనసేవ్యలు, సజ్జనౌఘమున్
బొదలు విభూతియుక్తము, విభూతియు నిత్యసముత్థ, యిట్టిభ
ద్రపదభరితానుభావ మొకరాజునకుం గలుగంగ నేర్చునే. ౨౨

### ప్రతిషేధబంధము

తే. ఇవియె కవితలఁ దగఁ జెప్ప నెఱిఁగెనేని
బరఁగు బ్రతిషేధశృంఖలబంధ మనఁగఁ
బదము పదమునఁ బ్రతిషేధఫణితి గలిగి
పటుపదాలంకృతులచేతఁ బాటి యగుచు. ౨౩

తే. ఎచటఁ బ్రజ లూర్జితశ్రీల నెసక మెసఁగ
రది దలంపఁగ నెపుడు రాజ్యంబు గాదు,
విశ్వభూవిభుఁ డేరికి విభుఁడు గాఁడు
పట్టి చూడంగ వారలు ప్రజలు గారు. ౨౪

### మాలాదీపకము

క. మొదలిపదంబుననుండియు । నుదయోత్కర్షంబు లుత్తరోత్తరముగ విం
పొదవఁగఁ బరువడి నెలకొను । నది మాలాదీపికాఖ్య మనఁ జను గృతులన్. ౨౫

చ. ప్రకటిత మైనవిశ్వవిధుపాణికిఁ బుట్టె వితీర్ణి, యా వితీ
ర్ణి కసితకీర్తి గల్గె, నతినిర్మలకీర్తికి నుద్భవించె వీ
నకలవికర్ణవిశ్రుతులు సజ్జనకర్ణవిభూషణంబు లై,
యొకనికి నేల యబ్బు నిటు లొప్పెడు నుత్తమనిత్యసంపదల్. ౨౬

### సారాలంకారము

తే. పలుకుపలుకున కుత్కర్షబంధసిద్ధి
యుత్తరోత్తరసారమై యొలి నమరు
నయ్యలంకృతి సార నామాఖ్యఁ జెందుఁ
జెవులకింపుగ సుకవులు చెప్పిరేని. ౨౭

క. దేవతలకు వరుఁడు మహా । దేవుం డద్దేవుమౌళిదెసఁ జరియించున్
జైవాతృకుఁ డాతనికుల । పావనుఁడు చళుక్యవిశ్వపతి యిల నొప్పున్. ౨౮

### యమకములు 7

క. యమకాదిచిత్రబంధ । క్రమములు బహుళములు, వాని గతి భాషాకా
వ్యములకు నుచితములై చన । నమరింతుం గొన్ని వరుసఁ నగు దెలియంగన్. ౨౯

క. వచ్చినవర్ణంబులు కడు। నచ్చములై మొదల నడుమ నంతమునఁ గవుల్
మెచ్చఁ దదర్థము లలవడి। యచ్చెరువులు గాఁగఁ జెప్ప నగు యమకంబుల్.

ఆ. ఆది మ ధ్యాంత గోచరాఖ్యత్రయంబు,
నాదిమధ్యగతంబు, మధ్యాంతగతము,
వరుస నాద్యంతగతము, సర్వగము, ననఁగ
యమకములు సప్తవిధముల నమరు నండ్రు. ౩౧

(1) ఆ ది య క ము

తే. ఉక్తశబ్దంబు తుదశబ్ద ముక్త శబ్ద
విధముననె తోఁచి యర్థంబు వేఱె యగుచు
వీనులకు నింపు సొంపును నీనెనేని
నాదియమకంబు నాఁ జను నండ్రు బుధులు. ౩౨

క. వాసవవాసవధూ సువి। లాసములం దెగడి దెగడు లలనలమనముల్
వాపించు నాత్మగుణముల। భాసురుఁ డగువిశ్వవిభునిపటువిక్రమముల్. ౩౩

(2) మ ధ్య య మ క ము

క. హృద్యార్థం బై పరఁగెడు। పద్యమునకు నిట్ల యమకబంధము నడుమం
బ్రద్యోతించిన నది యన। వద్యంబుగ మధ్యయమకవైభవ మెసఁగుఁ౽. ౩౪

క. శ్రీకీర్తిచంద్రికల వి। ద్యాకైరవవితతు లలరఁ దలకొలిపెడు నీ
పోకుల పో కులపౌరుష। మా కుముదహితాన్వవాయుఁ డగు భూపతికిఁ౽.

(3) అ ం త్య య మ క ము

క. పాదము లుత్క్రమ సం। పాదితగతి నొప్ప తుదను భావాలంకా
రోదయకరమై యమకం। బాదృత మగునేని యంత్యయమకం బయ్యెఁ౽. ౩౬

తే. లీలఁ జాళుక్య విశ్వభూపాలవరుని
విజయలక్ష్మీకరగ్రాహవేళలందుఁ
జెవుల కింపుగఁ దొడరి ఘోషింపఁ దొడఁగె
గతుల కళ్యాణకళ్యాణగౌరవములు. ౩౭

(4) ఆ ది మ ధ్య య మ క ము

క. పరపుగఁ బద్మాకర మన । బరికల్పిత మగుచుఁ బరఁగుఁ బద్మాకర మై
ధర నెగడు విశ్వభూవరు । వరసదనము బుధులపాలి వైభవపదమై. ౩౮

(5) మ ధ్యాం త య మ క ము

క. పరగండభైరవుని యరి । వరులును ముక్తాతపత్త్రవైభవు లెపుడుꣳ
పరగండభైరవుని కవి । వరులును ముక్తాతపత్త్రవైభవు లెపుడుꣳ. ౩౯

క. హరిదంబరవిక్రముఁ డనఁ । బరఁగుం జాళుక్యవిశ్వపార్థివుఁ డనుచుꣳ
బొరిఁ బొగడుదు రరినృపతులు । హరిదంబరవిక్రమప్రయత్నయశస్కుꣳ. ౪౦

(7) స ర్వ య మ క ము

క. వనవర్గనివస దహితుఁడు । వనవర్గప్రీతదివిజవల్లభుఁడు సకృ
ద్వనవర్గ శివవయస్యుఁడు । వనవర్గార్కుండు విశ్వవసుధేశుఁ డిలꣳ. ౪౧

పా ద త్ర య య మ క ము

శా. శస్త్రోదంచితుఁ డైన యవ్విభు విపక్షశ్రేణికి న్విభ్రమ
త్స్వస్త్రీతస్ఫుటకంకణధ్వని రణస్థానంబున న్విభ్రమ
త్స్వస్త్రీతస్ఫుటకంకణధ్వని మరుత్ప్రోధంబుల న్విభ్రమ
త్స్వస్త్రీతస్ఫుటకంకణధ్వని సరిత్సంగంబులం జేకుఱుꣳ. ౪౨

ద్వి తీ యో ప మా న గో ప న ము

సీ. విద్యావిభూతి వివేకసంపన్నత వాణీశ వాణీశ వైభవంబు,
శౌచ వ్రతాపాతిసత్త్వసమగ్రత శిఖిమిత్ర శిఖిమిత్ర శీలనంబు,
గాంభీర్య భోగ రంగద్రత్నసామగ్రి జలధీంద్ర జలధీంద్ర విలసనంబు,
విక్రమ సౌందర్య విపులదర్పోన్నతి బలభద్ర బలభద్ర బంధురంబు,

తే. దాల్చి వెలుఁగొందు విష్ణువర్ధనకులాబ్ధి
చంద్రుతో విశ్వభూపాలచంద్రుతోడ
చంద్రధరపాదభక్తి నిస్తంద్రుతోడ
నితరనృపునకుఁ దుల్యత్వ మెట్లు గల్గు. ౪౩

నిరోష్ఠ్యము

క. పంచమ వర్గాక్షరములు । వంచించి, హితోచితార్థవంతంబులు గా
వించినకబ్బము, పీనుల । కంచితమై యది నిరోష్ఠ్య మన నొప్పారున్. ౪౪

శా. చాళుక్యక్షితినాథునూర్జితయశస్సంక్రాంతిచేఁ దూలు లో
కాలోకాద్రిఁ దనర్చుచీఁకటులు, కైలాసోల్లసద్దీధితుల్
సాలం దెల్లని చాయలందనరు నాళాదంతు లంతంతకున్
గాలాకారత నుజ్జగించు ననుచుం గాంక్షింతు రత్యుక్తులన్. ౪౫

గూఢచతుర్థము

క. మొదలిచరణత్రయములోఁ । బదిలముగాఁ గవిత నంత్యభాగాక్షరముల్
గదియం గ్రమమున నిల్పిన । నది గూఢచతుర్థ మనఁగ నద్భుత మయ్యెన్. ౪౬

చ. చతురుఁ బరార్థ్యశీలుఁ గవిశశ్వదభీప్సితభూరిదానదున్
వితతభుజానిసర్గబలు విక్రమసన్నుతి సేవితోదయున్
మతి కెదు రెల్ల సేపికొని మాన్యుల కాలము కాని మానులై
చతురులు విశ్వభూవిభుని సన్నుతి సేయుదు రెల్ల కాలమున్. ౪౭

చతుర్విధకందము

తే. ప్రథమకందంబు రెండవపాదయుగము
నందు రెండవ గణవర్ణ మాదిగాఁగఁ
గడయు మొదలును వరుసతోఁగలిపి చదువ
నగుఁ జతుర్విధకందమై యార్యసభల. ౪౮

మొదటికందము

క. చాళుక్య విశ్వవిభునకు । వాలున్ బుధనుతియు సుగుణ వర్గము నిధులున్
జాలుటయు నీతినిరతియు । మేలున్ మధురతయు నీగి మీఱినవిధమున్. ౪౯

రెండవకందము

క. బుధనుతియు సుగుణవర్గము । నిధులుం జాలుటయు నీతినిరతియు మేలున్
మధురతయు నీగి మీఱిన । విధముం జాళుక్య విశ్వవిభునకు వాలున్. ౫౦

మా డ వ కం ద ము

క. చాలుటయు నీతినిరతియు । మేలును మధురతయు నీగి మీఱినవిధమున్
జాళుక్యవిశ్వవిభునకు । వాలున్ బుధనుతియు సుగుణవర్గము నిధులున్. ౨౧

చ తు ర్థ కం ద ము

క. మధురతయు నీగి మీఱిన । విధముం జాళుక్యవిశ్వవిభునకు వాలున్
బుధనుతియు సుగుణవర్గము । నిధులున్ జాలుటయు నీతినిరతియు మేలున్.

పం చ వి ధ వృ త్త ము

క. సరసిజముఁ గందయుగళము । సరి మొదలి నవాక్షరముల సమవృత్తముఁ, ద
త్పరమున మణిగణనికరము । వెరవున రచియింపఁ బంచవిధవృత్త మగున్.

స ర సి జ వృ త్త ము

శ్రీవిశ్వేశక్ష్మావరు సేవాశ్రితులు వొగడుదురు సిరి వరఁగుటకై
ధీవిద్యాసంభావితదేవున్ ధృతియుతు హితజనదివసదినకరున్
శ్రీవర్ణింతున్ భావనజీవున్ జితరిపు శశికులశిఖరిమృగపతిన్
భావోదంచద్భావితభావున్ బ్రతిదినసముదితబహుంతరవిభవున్. ౨౪

ప్ర థ మ కం ద ము

శ్రీవిశ్వేశక్ష్మావరు సేవా । శ్రితులు వొగడుదురు సిరి వరఁగుటకై
ధీవిద్యాసంభావిత । దేవున్ ధృతియుతు హితజనదివసదినకరున్. ౨౫

ద్వి తీ య కం ద ము

శ్రీవర్ణింతున్ భావన। జీవున్ జితరిపు శశికులశిఖరిమృగపతిన్
భావోదంచద్భావిత । భావున్ బ్రతిదినసముదితబహుంతరవిభవున్. ౨౬

న వా క్ష ర వృ త్త ము

శ్రీవిశ్వేశక్ష్మావరు సేవా । ధీవిద్యాసంభావితదేవున్
శ్రీవర్ణింతున్ భావనజీవున్ । భావోదంచద్భావితభావున్. ౨౭

మ ణి గ ణ ని క ర ము

శ్రితులు వొగడుదురు సిరి వరఁగుటకై
ధృతియుతు హితజన దివస దినకరున్

జితరిపు శశికులశిఖరి మృగపతిఁ
బ్రతిదినసముదిత బహుతరవిభవుఁ. ౫౯

---

క. తలకట్లు బోడలుం గొ । మ్ములు గలవర్ణములతోడి ముఖ్యపదములఁ
గలకబ్బము హ్రస్వస్వర । కలితం బగుఁ గృతుల నరయఁగవియనుమతులన్. ౬౦

తలకట్లు

క. వనదఘనవర్యచర్యక । మనవరత ప్రసర దయ నయ క్రమ మఘమ
ర్దనకర మనత మనః కం । పన మరయ శశధరవంశభవమహ మరయఁ. ౬౦

బోడలు

క. స్థితి నిలిపిరి సిరి వించిరి । ధితి మించి విరించివిధికిఁ దివిరిరి శ్రితి ని
ర్మితికి విలియిచ్చిరి । మితిని క్షితి నిగిడిరి గిరిపతాకిచెంగటి విమతుల్. ౬౧

కొమ్ములు

క. ఉరుగుణులుఁ గురులుఁ గుకురులు
గురుదును బుణ్యులును బుధులుఁ గుతుకులు శ్రుతులఁ
సురుచులు సుముఖులు సుఖులును
బురునుతు లుడురాజవంశ్యుఁ బూన్పుదు రెపుడున్. ౬౨

సరిగమపధనులు

క. నీసరి పని నీసరి ధని । నీసరిమాధారిగరిమ నీసరిగా రీ
నీసరిగా నిగమాగమ । గోసారులునుం జళుక్యకులవిశ్వేశా. ౬౩

గోమూత్రికాబంధము

తే. వర్ణములు నాల్గుపంక్తుల వరుసవ్రాసి
మూలలం దోలి గోమూత్రకోలఁ జదువ
నుక్తపద్యంబు దా నగు చుండెనేని
దనరు గోమూత్రి కాఖ్యబంధంబు నాఁగ. ౬౪

మాలిని

వివిధ నయ విధిజ్ఞుఁ విద్ధవీరారిగర్వుఁ
భువి ధనద విధిజ్ఞుఁ బుద్ధసారాభిగమ్యుఁ

ప్రవరగుణ గరిష్ఠుఁడా ఖ్యాతవిశ్వేశుఁ గాంతుఁడా
ధవళగుణగరిష్ఠుఁడా ధాత విశ్వేశుఁ గాంచుఁడా. ౬౫

* చ క్ర బం ధ ము

తే. వలయనవకంబు నాఱురేఖలు లిఖించి
యందు శార్దూల విక్రీడితాక్షరములు
పెట్టి నడుచుట్లఁ గవి కృతి పేళ్లు రెండు
చక్రబంధంబునకు నిడి చదువవలయు. ౬౬

శా. చిత్తోపేత వికస్వరోత్తమగుణుఁడా శ్రీలంపటుఁడా సత్కృపా
విత్తోద్దండుని విశ్వభూరమణు నుర్వీకృత్యసత్కృత్యదుఁడా
విత్తాయత్తము తావిధిజ్ఞు మహితుఁడా వీతిక్రమాతిప్రియా
యత్తుం జూచి నినుఁడా విశేషవిదుఁగా యాచింపుదుఁడా దుర్జయా.

కుం డ లి బం ధ ము

క. ఎనుబది పదములుగాఁ బెనఁ। గొని యుపదేశమునఁ దెలియఁ గుండలిబంధం
బనఁజను దత్పదములఁ జ। క్కని వ్రాలిడి వరుసఁ జదువఁ గబ్బం బమరున్.

మ. సతతోద్యత్కరవాలభైరవు, విరాజద్రాజతేజస్కుఁ, జి
ద్గతసత్యస్వరపూతకార్యు పరదుఁడా, దత్కోలఖేలద్ధ్వజ
ప్రతిభీతద్విడధీశనుత్యచరణుఁడా, భావార్థసారజ్ఞు, ను
చ్ఛ్రితసారస్వతభూతిసారవిషయుఁడా, జింతింతు సంతుష్టితోఁడా. ౬౮

ఖ డ్గ బం ధ ము

క. తరతరమ పూసనుండియుఁ। బరుజులు దట్టాడి మధ్యపద్ధతి ధారా
పరివృతి నుపదేశ క్రమ। పరిచితిఁ బఱియింప ఖడ్గబంధం బయ్యెఁడా. ౭౦

క. సమరమహీ మధుమత్సమ। సమధికతం ద్రుంచు విమతశతులఁడా లీలఁడా
హిమరుక్కులుఁడు మరుత్వ। త్సమసత్త్వతఁ బేర్చుచుండు సర్వజగములఁడా.

* "పెద్దయ సత్కృతి కవితాలంకృతి" ఇందు కవిపేరును కృతిపేరును మాత్రమే ఉక్తములు. కృతిపతి కానరాఁడు. తర్వాతివారు కృతినివదలి కృతిపతిని గ్రహించిరి గావలయు. నన్నెచోడునిలో ఇవి ఎట్లో తెలియరాకున్నవి.

ఆ. ప్రథమ యమక చిత్రబంధాదు లౌకకొన్ని । తెలుపఁబడియె బుధులు దెలుపవలయు
నుర్విఁ బద్మబంధ సర్వతోభ ద్రాదు । లంధ్రభాషఁ జెప్ప నరిది యంద్రు. ౭౨

---

## కా వ్య దో ష ము లు 3

మ. ప్రతిభాకంపన మబ్బినం గవులచేఁ బాటిల్లు శబ్దార్థసం
గతదోషంబులు కొన్ని, కొన్ని ధర సత్కావ్యంబులం దైన ను
త్థితవేగాకులితాపగా వితతిలో డిండీరపిండాకృతిన్,
ధృతి సందర్భముచోట వానిఁ దగ జింతింపం దగున్ సత్కవుల్. ౭౩

క. ¹పద ²వా ³క్యార్థ త్రితయ స
ముదితములై వివిధదోషములు చెవి కసుఖా
స్పదము లగు; వాని తెఱఁగులు
మది సుకవుల కెఱుఁగవలయు మఱవక యెపుడున్. ౭౪

### (1) పదదోషములు 15

సీ. ¹అప్రయుక్తము ²నపుష్టార్థకంబును ³నస
మర్థకంబును ⁴నిరర్థాహ్వయంబు
⁵నపసంస్కృతంబు ⁶నేయార్థంబు ⁷సందిగ్ధ
⁸నష్టప్రయోజన శ్లిష్టములును
⁹గాఢపరిక్లిష్ట గూఢార్థకంబులు
¹⁰నప్రతీతికము ¹¹నన్యార్థకంబు
¹²నవిమృష్టకవిధేయకాంశంబు ¹³నశ్లీల
¹⁴పరుష ¹⁵విరుద్ధార్థ భాషితములు -

తే. ననఁగ బదియేడువిధము లై యతిశయిల్లఁ
గావ్యముల దోషములు పదగతము లగుచు;
వాని నెఱుఁగక రచియించు వట్టికవుల
వేడ్క మెచ్చఁడు చాళుక్యవిశ్వవిభుఁడు. ౭౫

### 1 అ ప్ర యు క్త ము

క. దైవతుఁడు గాచుఁ గడుసం । భావన నన నప్రయుక్తి పదమునఁ బరఁగున్
వావిరిఁ బుల్లింగత్వము । దైవతపదమునకుఁ దలచు దనరక యునికిన్. ౭౬

### 2 అపుష్టార్థము

ఆ. జగతి నెనిమిదింటిసగములో సగ మగు । భుజము లాహవములఁ బొల్లు లగునె
భూపతులకు నన నపుష్టార్థ, మర్థార । పదము లర్థపుష్టిపదము గామి. ౩౩

### 3 అసమర్థము

క జనపతి వనధర పరివృత । యనఁజనుధర నేలె ననఁగ నసమర్థ మగున్
వనధికి నీవనధరపద । మొనరించుట శబ్దసంపదూనత యగుటన్. ౩౪

### 4 అనర్థకము

క. నలి నొప్పెఁ బురుషుఁ డొగిఁ గడు । నలవడియెం బడఁతి యన ననర్థకమయ్యెన్
నలి నవియెడునది యొగినన్ । పలుకును బూరణము లంధ్రభాషకునగుటన్. ౩౫

### 5 అపసంస్కృతము

క. స్పరిశన మతివకు సీతకు । దరిశనము మనోహరంబు దరుణికిననఁగా
ధర నపసంస్కృత మగుఁ ద౹ ద్గురుత్వ మాద్యక్షరములఁ గూడక యునికిన్,

### 6 నేయార్థము

క. పరునిపయిఁ గూర్మి వనితకు । నిరవగ్రహ మెపుడు ననిన నేయార్థ మగున్
నిరవగ్రహ శబ్దార్థము । తిరముగ నేతవ్యసరణిఁ దెలియుటచేతన్. ౩౭

### 7 సందిగ్ధము

క. అవనీభృత్కటకం బు । త్సవపద మెల్లపుడు ననిన సందిగ్ధార్థం
బవిరళ మగు నగతట మా । నవపతిపుర సంశయంబు నరుల కొదవుటన్

### 8 అప్రయోజనసంశ్లిష్టము

తే. అప్రయోజనసంశ్లిష్ట మగు సమీర । ణాశనారాతికృత కేతనాగ్రజన్మ
శత్రుతటముల నిల్తురుశత్రు లనిన । నేతదర్థంబు గిరులకు నేఁగి రనుట. ౩౯

### 9 క్లిష్టగూఢార్థము

తే. క్షతజ కంజేక్షణలు క్షౌమ గల్లకటలు, । ఘనవిదగ్ధాత్మికలుఁ బురికాంతఁలనఁగఁ,
గ్లిష్టగూఢార్థ మనఁ జనుఁ గ్లేశసరణిఁ । దత్తదర్థంబు నెఱిఁగెడి తలఁపుచేత. ౪౦

### 10 అప్రతీతికము

క. క్షితి బాడబులకు మన్యు । స్థితి యుచిత మనంగ నప్రతీతిక మగు వి
శ్రుతబాడబమన్యువులకు । వితతార్థము లెందుఁ బెక్కువిధము లగుటచేన్. ౪౧

### 11 అన్యార్థము

క. ఆడట నింద్రుని జగదాహ్లా । దంబున జంద్రుఁ డనిన నన్యార్థము సం
పాదిల్లు నియతనామ । ప్రాదుర్భావముల నెన్నఁబడ కుండుటచేన్. ౭౬

### 12 అవిమృష్టవిధేయాంశము

క. ఉవిదకు మొలనూలు మనో । భవు రెండవనారివోలెఁ బరఁగె ననంగా
నవిమృష్టవిధేయాంశం । బవు నతనికి రెండునారు లడరక యునికిన్. ౭౭

### 13 అశ్లీలము

క. వ్రీడామంగళ కుత్సలు । దోడుగ నశ్లీల మనెడుదోషము మూఁడై
జాడపడు గ్రామ్యవచన । క్రీడల; నత్తెఱఁగు కృతుల గేలింజేయున్. ౭౮

### 13 (1) వ్రీడాశ్లీలము

క. జనపతికృప మదయుతులై । చనుకుజనులు గుహ్యకేశ సన్నిభులును మో
హనరసరుచిపరిపూర్ణులు । నన వ్రీడాశ్లీలదోష మగు వినుచోటన్. ౭౯

### 13 (2) అమంగళాశ్లీలము

క. అన్నన కధిపతి యలుకం । గన్నుల నీరొలుక బట్ట గడుఁ దడిపె ననం
గ్లిన్నశ్మశాన మన్న । ట్లన్నెరవిపలు కమంగళాశ్లీల మగున్. ౮౦

### 13 (3) జుగుప్సాశ్లీలము

తే. నాతి గనయంబు వదలింప నాథుమీఁద । నాభిపంకజగంధ మున్నతిఁ జరించె
నన జుగుప్సాభిధాశ్లీల మయ్యె, నింతి । కపుడు పొక్కిలిరొంపికం పర్థ మగుట. ౮౧

### 14 పరుషము

క. కుర్కుఁ కర్కశ బర్బర
తర్కిత మవ్విటునిసుదతతంత్రం బనుచున్
జేర్కొన్నఁ, బరుష మనఁ జనుఁ
దార్కొను శ్రుతికటువు ననఁగఁ దజ్జ్ఞులచేతన్. ౮౨

### 15 విరుద్ధము

తే. మిత్రుఁ డుదయింపఁ గువలయోన్మేష మొదవె
నన విరుద్ధంబు, సఖునకు నవని కైనఁ

గలువలకు నర్కునకు నైనఁ గల్గుమైత్రి
కాడఁబం బొక్క నెపమునఁ గానఁబడమి. ౯౩

క. ఇవి పదగతదోషంబులు,
కవులకు నిట మీఁద వాక్యగతదోషంబుల్
వివరింతుఁ గొన్ని, యవియును
వివిధంబులు సూక్ష్మములు వివేకింపఁ దగుఁగా. ౯౪

(2) వా క్య దో ష ము లు 15

సీ. [1]క్రమభంగము [2]విసంధికంబును [3]బునరుక్తి
కంబును [4]వ్యాకీర్ణకంబు నాఁగ,
[5]భిన్న వచస్కంబు [6]భిన్నలింగంబు [7]ఛం
దోభంగ [8]యతిభంగ దోషములును,
[9]న్యూనాధికోపమా [10]న్యూనపదంబులు
నట [11]సమాప్తికపునరాత్తకంబు
[12]నశరీరకంబును [13]నధికపదంబుఁ [14]బ్ర
క్రమభంగము [15]పతత్ప్రకర్ష కంబు

తే. ననఁగ బదియేనువిధులఁ గావ్యములయందు
వాక్యదోషంబు లుదయించు; వానిఁ దెలిపి
కబ్బములు చెప్పు నుత్తమకవుల మెచ్చు
విష్ణువర్ధన చాళుక్య విశ్వవిభుఁడు. ౯౫

1 క్ర మ భ ం గ ము

క. శ్రీవిష్ణువర్ధనాఖ్య క్ష్మావరు కీర్తిప్రతాప మహిమలతో రా
జీవేందీవరమిత్రులు - కావింతురు చెలిమి యనఁగఁ గ్రమభంగ మగుఁగా ౯౬

2 వి సం ధి క ము

క. కుల అంబుజ అర్కుం డిల
బలి ఇంద్ర ఉదారుఁ డనెడు పలుకులలో న
చ్చులు హల్లులతోఁ గూడం
గలయక యుండిన విసంధికం బగుఁ గృతులఁగా. ౯౭

3 పునరుక్తము

తే. చక్రి చక్రాయుధుఁడు పోరు సలుపుచోట
నవిన విది శబ్దపునరుక్త మంద్రు బుధులు,
శార్ఙ్గిచాపాస్త్రిఁ డాజి నెసంగునెడల
నవిన విది యర్థ పునరుక్త మగుఁ దలంప. ౯౮

4 వ్యాకీర్ణము

క. తలల వరాహాంక, మురం
బులనాజ్ఞయుఁ దాల్చి విశ్వభూవిభుఁ గొలువం
దలఁపుమ రరు లని చెప్పం
దొలఁగక వ్యాకీర్ణ మనెడు దోషం బయ్యెన్. ౯౯

5 భిన్నవచనము

తే. అనిశభంగంబులును నసేవ్యములు నైన
యంబువిధు లట్ల గంభీర మగుమనంబు
వశము గా దన్న నది భిన్నవచన మయ్యెఁ
బెక్కుమాటల నొకమాట భేద్య మగుట. ౧౦౦

6 భిన్నలింగము

క. చాళుక్యవిభుఁడు వనుపఁ ద్రి । శూలంబునుబోనిసేన శూరతచేతం
గూలుదురు వైరు లనిలో । లీలం బొరి నన్న భిన్న లింగం బయ్యెన్. ౧౦౧

7 ఛందోభంగము

క. ఎందును నీరాజున కే । చందంబున లేరు సరి జగంబుల నెల్లన్
సుందరతను శూరత నన । ఛందోభంగంబు గృతులఁ జను దోషంబై. ౧౦౨

8 యతిభంగము

క. చెప్పినయెడ నిలువక వడి । దప్పిన యతిభంగ మనఁగఁ జనుఁ, దత్కృతి పి
చొప్పు నెఱుంగుఁడు తెనుఁగున । నెప్పుడును విరామభంగ మెన్నరు గృతులన్.

9 న్యూనోపమ

తే. చంద్రతారాభిరామ మై చదలు వొలిచెఁ । బుండరీకాంకకాసారఖండ మనఁగ,
నట్ల చెప్పిన న్యూనోపమాఖ్య యయ్యె । నుపమ తారాపథంబున నూనమగుట.

అ ధి క్షే ప ము

తే. వికలముఖులైన యరివధూటికలు గ్లాంత । నలినకైరవ లగు(గ్రీష్మ నమలఖంగి
నైరి, నా నధికోపమ యయ్యె నరయ । నందుఁ గైరవ ముపమకు నధిక మగుట.

10 న్యూ న ప ద ము

క. పరగండభైరవుని శ్రీ । చరణంబుల కెరఁగ కున్న సమకూ ఱె వనే
చరత యన న్యూనపద మగు । పరునకు నరిపదముఁ గవితఁ బరితముగామిన్.

11 స మా ప్త పు న రా త్త ము

క. అవనీశుయశము గుణమణి । నివహంబులు నెగడ నెగడె నిఖిలము నిండెన్
గవివినుతులచే ధవళిత । భువనం బనఁగా సమాప్తపునరాత్తమగున్. ౧౦౩

12 అ శ రీ ర ము

క. కుశలుఁ డగున్నృపతి సతతము । కృశకులధర్ములను సహజకృత్రిమగుణులన్
భిక్షునుల నని మును పలుకఁగ । నశరీరము నిగ్రహించు నను(క్రియ నిడమిన్.

18 అ ధి క ప ద ము

క. కరవాలభైరవునిచే । నరుగుదు రరు లర్కమండలాకారములో
సురిఁగి యన నధికపద మగు । నరయఁగ నాకారశబ్ద మధికం బగుటన్. ౧౦౪

14 ప్ర క్ర మ భ ం గ ము

క. నారలు చీరలు మధురా । హారంబులు కూర లడవి యాలయ మనఁగాఁ
గూరుం బ్రక్రమభంగము । వారక వనగృహము లేకవచనం బగుటన్. ౧౦౫

15 ప త త్ప్ర క ర్ష ము

తే. ఏచి మార్కొనుఁ బులులఁ గ్రొవ్వెనఁగు కిరులఁ,
బాఱు మృగములఁ ద్రుంచు నీభటుఁ, డనంగ
నడరి విపరీతగతిఁ జెప్ప నగుఁ బతత్ప్ర
కర్షదోషంబు దగ దీనిఁ గానవలయు. ౧౦౬

క. ఇవి వాక్యజాతదోషము । లవిరళముగఁ దెలియుఁ డింక నర్థ(క్రమసం
భవము లగుదోషములఁ దగఁ । జెవులకుఁ జవు లొదవ నోలిఁ జెప్పెదనొప్పన్.

---

(3) అ ర్థ దో ష ము లు 17

సీ. వరుస [1]నపార్థంబు [2]వ్యర్థంబు [3] హీ [4]నాధి
కోపమంబులు [5]సంశయోక్తికంబు

6నతిమాత్రకంబు 7నేకార్థంబు 8భిన్నంబు
9జరపదక్రమమును 10బరుషకంబు
11నసదృశోపమమును 12నప్రసిద్ధోపమ
మును 13హేతుశూన్యార్థమును దనర్చు
14విరసాహ్వయంబును 15నిరలంకృతియు 16విరు
ద్ధంబు 17నసంగతత్వం బనంగఁ

తే. గబ్బముల సప్తదశదోషఘటన లొదవుఁ
బ్రౌఢి వానికిఁ బాపిసత్ప్రభువు లైన
యుభయభాషాకవీంద్రుల కొసఁగుఁబొసఁగఁ।
జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి. ౧౧౩

1 అపార్థము

క. ఘనమునకు నెంద అంగన ?। లనుములు నాకమునఁ బండునా ? పాతాళం
బునఁ బాము లెన్నిగలవో ?। యనఁగ నపార్థంబు వాచికార్థము గామిన్. ౧౧౪

2 వ్యర్థము

తే. 'మీరు పెద్దలు, కులమును బౌరుషంబు
విశ్రుతంబులు, గుణము లీవితతు, లేల
యధిపుఁ గొలువరు దా ?' రన వ్యర్థ మయ్యెఁ
బొలతఁ బలుకులు భజనహేతువులు గామి. ౧౧౫

3 హీనోపమ

క. కుక్కలనుబోలె దనుజులు। మిక్కుటముగఁ గదుర సురలు మృగములభంగిన్
దిక్కులబెడి పాఱిరనాఁ। దక్కక హీనోపమాభిధానంబయ్యెన్. ౧౧౬

4 అధికోపమ

క. అకుటిలగతిఁ గొలఁకులలో। బకములు మునివరులఁబోలెఁ బరఁగె ననంగాఁ
బ్రకటిత యగు నధికోపమ। సుకవిత నీరెండుఁ జొనుప శూన్యం బయ్యెన్. ౧౧౭

5 సంశయము

క. నీ వన్నపలుకు చెప్పిన। నావెలఁదికి నలుగ నేల యన సంశయ మై
భావింపంబడు నీ వను। నావెరవున నన్న గామి నన్యార్థం బై. ౧౧౮

### 6 ఏకార్థము

క. మలయసమీరము మలసెను । మలఁగొనియెఁ బటీరశైలమారుత మనుచుం
బలికిన యర్థమ క్రమ్మఱఁ । బలుకుట యేకార్థ మండ్రు ప్రతిభావంతుల్. ౧౧౯

### 7 అతిమాత్రము

క. అతిమాత్రం బగు నతిభా । షితమున నేకోదకమునఁ జెడు జగ మనుచున్
మితముగ నరిసతు లేడ్చినఁ । బ్రతతాకృతి నదులు వర్వె బాష్పజలములన్. ౧౨౦

### 8 భిన్నసంబంధము

క. నలువ భవదహితకీర్తులు । నలుపులు గావించు తలఁపునంజేసి సుమీ
మలినత్వము కుజనమునః । స్థలముల నిడె ననఁగ భిన్నసంబంధ మగున్. ౧౨౧

### 9 అపక్రమము

తే. పురుషుఁ డొక్కండు పరిణయంబునకు మున్న
వరుస సమకూర్చె సీమంతపరికరములు
అన నపక్రమ మండ్రు కృత్యంబు గడచి
యవలిపనిసేయు నని చెప్పునట్టికృతుల. ౧౨౨

### 10 పరుషము

క. వేఁడెడునర్థులఁ గనుఁగొన । వాఁడికుఠారమునఁ జెండవలదా యను నీ
సూఁడరిమాటల పరుషము । వోఁడిమి చెడు నట్టియర్థములఁ గబ్బములన్. ౧౨౩

### 11 అసదృశోపమ

క. వసుధాపతి కోపాగ్ని । ప్రసరంబులచేత రజతపర్వతభంగిన్
వెస వెలిఁగెఁ బోర ననఁగా । నసమత నిది యసదృశోపమాహ్వయ మయెన్.

### 12 అప్రసిద్ధోపమ

తే. బాష్పకణకీర్ణమై యెప్పుఁ బడఁతిమోము
మంచు నిండినతొగపువ్వుమాడ్కి ననిన
నప్రసిద్ధోపమార్థమై యడరు నండ్రు
కుముదముఖముల కుపమాప్తి గూడ కునికి. ౧౨౫

### 13 హేతుశూన్యము

తే. ధర్మ గోరక్షణార్థంబు చంపఁ బులుల
ననక మిన్నక పులివేఁట లాడు నృపుఁడు
శూరుఁ డై యన్న నది హేతుశూన్య మయ్యె
నిష్ప్రయోజనకథన మై నివ్వటిలుట. ౧౨౬

### 14 విరసము

క. తలఁ పవుచూపులు నిద్దపు। టెలనగవులు నింత యొప్పునే భయమున వి
చ్చలు చను నరి సతులకు నన। విలసనసమయంబు గాని విరసం బయ్యెన్.

### 15 నిరలంకృతి

క. నీచుఁడు సకలోపల దు। ర్వాచాలత నాత్మదోష వంచితుఁడగు నా
నేచున నిరలంకృతి యై। యీచంద మలంకృతులకు నెక్కక యునికిన్. ౧౨౮

### 16 విరుద్ధార్థము

ఆ. చప్ప పేయ జగదసమ్మతమగునర్థ। మది విరుద్ధ మనఁగ నతిశయిల్లు
దేశ కాల లోక దిక్సమయక విరు। ద్ధాహ్వయములచేత నైదు నాఁగ. ౧౨౯

### (1) దేశవిరుద్ధము

క. మరుదేశంబునఁ బెక్కులు। పరిపూరితసలిలనదులు పరఁగి పిపాసా
తురులఁ దనియించు నాఁగా। ధర దేశ విరుద్ధ మయ్యెఁ దజ్జ్ఞుల కెల్లన్. ౧౩౦

### (2) కాలవిరుద్ధము

తే. గ్రీష్మ కాలంబు మత్తిలి కేకు లాడె,
నింద్ర గోపంబు లిలమీఁద నెల్లఁ బొడమెఁ,
జాఁగె ప్రథమాంబువులకునై చాతకంబు,
లనఁగఁ గాలవిరుద్ధసమాఖ్య మయ్యె. ౧౩౧

### (3) లోకవిరుద్ధము

క. ఘనగజకుంభంబులలో। మొనయుఁ బ్రవాళంబు వెలయు ముత్తెపుగము ల
య్యెనుఁబోతులకొమ్ములలో। నన లోకవిరుద్ధ మయిన యర్థముఁ దలపన్. ౧౩౨

(4) ది గ్వి రు ద్ధ ము

క. ఉదగంబుధిపీచుల ను । న్మదుఁడై క్రీడించె దాక్షిణాత్యు, డనంగా
మదిలో వినియెడువారల । యెద నించును దిగ్విరుద్ధ మనునర్థం బై. ౧౩౩

(5) స మ య వి రు ద్ధ ము

క. అమరఁగఁ బులితోలును మ । స్తమునం బలుజడలు దాల్చి సౌగతుఁ డొప్పెన్
హిమకరశేఖరుగుడి నన । సమయవిరుద్ధార్థ మగుచుఁ జను సత్కృతులన్. ౧౩౪

17 అ సం గ తి

తే. శ్రుతము శాంతియు నితనికిఁ జుట్టలనక,
దయయు దానంబు లితనికి దయిత లనక,
జోడు దప్ప నసంగతి స్తుతి యొనర్పఁ
బద్యములయందు సహచరభ్రంశ మయ్యె. ౧౩౫

గు ణా య త్తా లం కా ర స ర ణు లు

క. ఈదోషంబులుమొగి న । ర్థోదితములు పూర్వభాషితోదారశ్లే
షాదిగుణంబులతోడఁ బ్ర । మోదంబునఁ గూడి యొసఁగు ముఖ్యార్థములన్. ౧౩౬

క. శ్రుతిపరుషత మానుటకై । మతిఁ గర్తవ్యంబు సౌకుమార్యము చెప్పన్
జతురతఁ గాంతి ఘటించుట ! వితతగ్రామ్యార్థహరణ వి్రశుతిఁ జేయున్. ౧౩౭

క కృతుల నపుష్టార్థప్రవి । హతికొఱకై చొనుపవలయు నర్థవ్యక్తిన్,
వితతన్యూనాధికపద । యుతిహతికై సమత చెప్ప నొప్పుం గవితన్. ౧౩౮

తే. అనుచితార్థ నిరాకరణాప్తికొఱకు । నగు నుదాత్తతఁ గావ్యంబులందుఁ జొనుప
యుక్తపాదవిసంధివిచ్యుతి యొనర్చు। పనికి నూర్జస్వి కర్జంబు పద్యములను.

ఆ. తుదిఁ బతత్ప్రకర్ష దోషాపహతికి నై । యుక్తి రీతిఁ గావ్య మొగి నొనర్ప
న ప్రతీతిక పరిహారంబు కొఱకు నై । సుప్రసాదగుణముఁ జొనుపవలయు. ౧౪౦

క. చ్యుతసంస్కృతి మానుటకై । యతిమధురసుశబ్దవృత్త మగు నొనరింపన్,
బ్రతత ప్రక్రమభంగా । హతికై సంక్రమతఁ గూర్ప నగు నంద్రుబుధుల్. ౧౪౧

క. ప్రేయోలంకారము దా । శ్రేయం బగుఁ బరుషదోషశిథిలతకొఱకై
చేయఁ దగుసూక్తితంత్రము । హేయాశ్లీలంబుఁ దొలఁగ నెగుచుటకొఱకై. ౧౪౨

క. ఇత్తెఱఁగున మఱియు గుణా
యత్తాలంకార సరణు లరసి కవీంద్రుల్
చిత్తంబున దోషోదయ
వృత్తం బెడలించి కవిత విరచింపఁ దగున్. ౧౪౩

మ. విరహితవైరికి౯ భువన విశ్రుత సద్గుణ రత్నహారికి౯
నిరుపమకీర్తికి౯ యువతి నిర్మథనక్షమ చారుమూర్తికి౯
విరచితవృద్ధికి౯ సమర వీరవిరాజిత జైత్రసిద్ధికి౯
పరిచితశక్తికి౯ గిరిశపాదపయోజనిషక్తభక్తికి౯ ౧౪౪

తరళము

సుజనపోషణశాలికి౯ రణశూరతావనమాలికి౯
రజనినాథకలాగ్రగణ్యవిరాజికి౯ జయవాజికి౯
గజభుజంగమభారవారణకారికి౯ యవికారికి౯
విజయవిక్రమధర్తకి౯ మనవిశ్వభూవరభర్తకి౯. ౧౪౫

గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయ నామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణియను నలంకారశాస్త్రంబునందు
విమిశ్రితాలంకార యమకాద్యనుప్రాసచిత్రసందర్భ
దోషగుణ నిరూపణ ప్రభృతి ప్రపంచం బన్నది

షష్ఠోల్లాసము



# సప్తమోల్లాసము



## ఛందః ప్రకరణము



క. శ్రీవిశ్వేశ్వరుఁ డసనై । భావిత విశ్వేశ్వరాంఘ్రిపద్ముఁడనై సం
భావితపదవాక్యకళా । కోవిదుఁడై నయవిశేషగుణవిధుఁడనై. ౧

క. ధీయుత పింగళనాగ హ । లాయుధ జయదేవ ముఖ్యు లగునార్యులచే
నాయతమై యామ్నాయ వ । దాయిత మగుఛంద మొప్పిదముగ నొనర్తున్. ౨

క. ఛందోవిభ్రమవిధితోఁ । బొంది కదా వేదశాస్త్రములు వాగ్వనితా
మందిరము లైన యయ్యర । విందభవునివదనములకు విభవం బొసఁగెన్ ౩

శా. పొందై, గౌరవలాఘవప్రకృత మై, పూర్ణాక్షరస్నిగ్ధ మై,
యందం బై, శ్రుతిసమ్మతప్రకట మై. ప్రాపించునానావిధ
చ్ఛందస్సూత్రము లేక లోకములఁ జంచద్వాక్యరత్నావళీ
సందోహంబులు కంఠభూషణము లై సంధిల్లునే యేరికిన్? ౪

క. ఛందము వాఙ్మయవిద్యా । కందము యతిగమక సమకగణవృత్తకృతా
నంద మమందార్థకళా । విందము వాణీకరారవిందము ప్రతిభన్. ౫

క. పటుమతి నట మున్ను మహా । నటుఁ డీశుఁడు వాచకాభినయమునకై యు
త్కటయతిలయమయతాళ । స్ఫుటవికటచ్ఛంద మందముగ నొనరించెన్. ౬

క. సృజియించి యిచ్చె నజునకు । నజుఁడును భరతునకు నిచ్చె నమ్మునివరుఁడున్
బుజామతి యగుపింగళుఁ డను । భుజగమునకు నిచ్చె భుజగభోజనుఁడవటన్ ౭

క. ప్రియ యది యేటిది నావుడుఁ । బయిలోడినపలుకుతుదలపొల్లులచేతన్
మయరసతభజన గణము లు । దయమొందెన్; ఛంద మొందెఁ దద్గణయుక్తిన్

క. గురువును లఘువును శంకర । గిరిజాకృతులు తత్ప్రకృతములు గణముల్
గరుడునిపై పింగళఫణి । విరచించినతెలుఁగు వరుస వివరింతుఁ దగన్. ౯

వ. అపి మెయ్యవి యనిన—ధీశ్రీస్త్రీమ్, వరాహాయ్, కాగుహార్, వసుధాస్, సాతేక్వత్, కదాసజ్, కింవదభ్, సహసన్: ఇట్లని గరుడ భయంబునను దిక్యగుదితస్వభావంబునను సాభిప్రాయజ్ఞేయనేయార్ధంబుగా గణస్వరూపనిరూపణంబునకునై పింగళనాగంబుచేత నుచ్చరితంబు లగుతద్వాక్యాంతరంబులం బొల్లులై తోఁచు మకార - యకార - రేఫ - సకార - తకార జకార - భకార - నకారంబులు గణాభిధానంబులకు నాద్యక్షరంబు లగుటచేత మగణ - యగణ - రగణ - సగణ - తగణ - జగణ - భగణ - నగణంబులు క్రమంబునం బ్రస్తారోద్ధారంబునం బ్రభవించెఁ, దత్స్వరూపంబులనుం దదధిదైవతంబులను బరిపాటిం బ్రకటింతు నెట్లనిన. ౧౦

క. ధీశ్రీస్త్రీ మన మగణము । విశ్రుత, మధిదైవతంబు విశ్వంభర; ని
త్యశ్రీల నొసఁగు మగణ । ప్రశ్రయముఖకవిత చెప్పఁ బని దనుఁ దలఁపక. ౧౧

క. జగతి వరాహా యనఁగా । యగణం బుదయించె నుదక మధిదైవత మై,
యగణప్రయోగములయెడఁ । దగిలించుక పిరులుఁ దన్నుఁ దలఁపున విలుపక.

తే. బ్రమిసి కాగుహా రనునట్టి పలుకు రగణ
మయ్యె; నధిదైవతము వహ్ని యయ్యెఁ గానఁ,
గవితముఖమున రగణంబు గట్టునపుడు
వహ్నిఁ దలఁపంగఁ బగఱకు వచ్చుఁ జావు. ౧౩

క. గతికై ఫణి వసుధా సని । మతిఁ దలఁచిన సగణ మయ్యె; మారుత మధిదై
వత మంద్రు; సగణముఖ మగు । కృతి పగఱకు మగుడులేని కీ డొనరించుక. ౧౪

క. సాతేక్వ దనుడుఁ దగణము । జాతం బై శూన్య మగుడు, జద లధిదైవం
బై తనరెఁ; దగణముఖకృతి । శ్రీతుం డగునృపుని నైన హీనుం జేయుక. ౧౫

ఆ. తనరఁ బింగళుఁడు కదాస జనక జగ
ణము జనించెఁ, దదధినాథుఁ డినుఁడు;
తొలుతఁ గృతిని జెప్పఁ దొణఁగుచో నర్కునిఁ
దలఁప నరికి రోగతతులు వొడము. ౧౬

క. ఖగపతి కింవద భన నది
భగణం; బుడురాజు తదధిపతి; భగణాద్యం

బుగనుం గృతి చెప్పునప్పుడు
మృగాంకుఁ దలపంగ నగు సమీహిత కాంతుల్. ౧౭

క. సహస నని పలుక నగణం
బహితం బగుఁ, దదధిదైవ మగుఁ బ్రాణుఁడు; త
ద్విహితస్మృతి నాయువు గడు
విహితం బగు నగణముఖ వినిర్మాణములన్. ౧౮

క. గురులఘువులు గలములు; లఘు
గురులు గురులఘువులు నెన్ని కొన వ హము లగున్;
గురులఘువులు త్రితయము లై
మురిసిన నవి మగణ నగణములు నాఁ బరఁగున్. ౧౯

ఆ. మగణరచన కాదిమధ్యాంతలఘువులు
గలిగె నేని య ర త గణము లయ్యె
నగణ రచన మొదల నడుమను గడ గురు
వుండెనేని భ జ స లొప్పుమిగులు. ౨౦

క. లోవంక వ్రాయ గురు వగు;
నేవంకయు లేనివ్రాఁత యొసఁగును లఘువై
జైవాతృక రేఖాయుత
భావజశరవిభము లంద్రుఁ బ్రాజ్ఞులు మఱియున్. ౨౧

క. గురువు లగు నొంటిసున్నల,
విరుసున్నల జమిలివ్రాల నెడమల మాఁదన్
బొరసినవియు దీర్ఘములు, వి
తరములు లఘువులు గణములు తత్త్రితయంబుల్. ౨౨

క. ఇందుఁడు గాంతి, వపుఃప్రభఁ
గందర్పుఁడు, సప్తసప్తి ఘనరుచి ననఁ, జె
న్నొందినయవి గురువులు చె
న్నొందినవిడుపులును; నట్ల యున్నవి లఘువుల్. ౨౩

క. కృతిక్షపులును తృపిదృపులును
పితృభృతులును నిలుచు పదముపిఱుఁదన లఘువుల్,

కృతిలో నగణములును దీ
ర్ఘత నొందినయేని రెట్టిగాఁ దగు నెఱుఁగన్. ౨౪

మ. కమనీయంబగు గద్యపద్యమయమై కావ్యంబు; గద్యంబు నా
నమరుం బాదనియంత్రణానియమవిన్యస్తప్రశస్తార్థ మై;
రమణీయాంఘ్రిచతుష్టయ స్ఫుట వళిప్రా సాభిరామంబు ప
ద్యము; తత్పద్యము వృత్తజాతు లన రెండై పర్వుఁ గావ్యంబునన్.

క. వృత్తం బనఁ జతురంఘ్రి సు
వృత్తం బై వళుల ప్రాల వెలయును; మాత్రా
యత్తగణంబులచేతఁ బ్రవృ
వృత్తాకృతిఁ బరఁగు జాతివితతులు కృతులన్. ౨౬

తే. విరతి విశ్రామ విశ్రాంతి విరమ విరమ
ణాభిధాన విరామము లనెడిపేళ్ల
యతికిఁ బర్యాయపదము లై యమరుఁ గృతిని;
యుక్తి పదములఁ గృతియందు నునుపవలయు. ౨౭

క. కరి గిరి పుర నిధి శశి ది । క్పరిసంఖ్యానంబు గణితపరిభాషలచే
నరపి యతి నిలుపుచోటులు । పరికింపఁగవలయుఁ గావ్యబంధన వెలయన్. ౨౮

వళిప్రాసములు

క. పాదప్రథమాక్షర ము । త్పాదిత మగు వళి యనంగ; బ్రాసం బనఁగాఁ
బాదద్వితీయవర్ణము । పాదచతుష్కమున కివియ ప్రాణము లెపుడున్. ౨౯

వళిభేదములు

క. స్వరజలు వర్గజ లిత రే । తరవర్గజ లనఁగ నేకతరజ లనంగాఁ
బరపారు వళ్లు నాలుగు; । వరుసఁ దెనుంగునకు వాని వలయుం దెలియన్. ౩౦

క. కోరి యకారము మొదలౌ । కారము తుద యైనయచ్చుగమి వంద్రెడున్
వారక యొండొంటికి నిం । పారఁగ వళ్లయ్యె నాల్గు నైదును మూఁడున్. ౩౧

అ జ్వ ర మ ము

క. అ ఐ ఔ లత్వమునకు । నీ ఏలును ఋద్వయంబు నిత్వమునకుఁ దా
మూ ఓ లుత్వమునకు వళు । లాయచ్చుల దొరపి యుండ హల్లుల కెల్లన్. ౩౨

### అ కా ర వ ళి ని రూ ప ణ ము

తే. అవని ధర్మజుఁబోలు నిత్యార్యచర్య,
నాదిరాజుల దొరయు నిత్యైంద్రభూతి
నరులఁ బ్రహరించు బాహుదండౌగ్ర్యమునను,
విధుకులాగ్రణి చాళుక్యవిశ్వవిభుఁడు. ౩౩

### ఇ కా ర వ ళి ని రూ ప ణ ము

ఆ. ఇనజుఁ డీగి, భారతీశుండు చతురత, । నేకవీరుఁ డాజి భుజుతయందు.
బూజరిపుఁడు సిరి, నహీనుండు భూవహ । నమున విశ్వమనుజనాథవిభుఁడు. ౩౪

### ఉ కా ర వ ళి ని రూ ప ణ ము

క. ధరణీవరాహలాంఛితుఁ । డురరీకృత సకలవిద్యుఁ డూరీకృత సం
గరజముఁడు విశ్వభూవరుఁ । డురుకీర్తుల నెగడు నా బిడౌజో విభుఁ డై. ౩౫

### వ ర్గ వ ళి ని రూ ప ణ ము

క. తుది నున్న ఙ ఞ ణ న మ ము లు
వదలిన యా క ఖ చ ట త ప ల వర్గాక్షరముల్
వొదిఁ దనవంగడములలో
నదికిన నవ్వళులు వర్గజాఖ్యము లరయన్. ౩౬

సీ. కమనీయరాజశిఖామణి కరిరాజగర్వమహీధ్రనిర్ఘాతమునకు
చతురయశస్పీత చ్ఛత్రి కాయోధన జయదాశ్వభంజళీ ఝంపునకును
టంకితరాయకఠారిసాళువునకు ఢంభలాంఛన కోళ ధాలునకును
త త్త్వ పురాణకథా రసవేదికి దాన దయా ధర్మ ధామ మతికి
తే. పశుపతిప్రాప్త సామ్రాజ్యఫలున కబ్జ । బంధుబంధురతేజోవిభాసునకును
విశ్వవిభునకు సరి లేరు విశ్వజగతి । ననిన నివి వర్గవళ్లకు నచ్చు గృతుల. ౩౭

### కాదివర్గమునకు గుణితస్వరవళినిరూపణము

క. కా కై కౌ లట కత్వము । కీ కేలు కృకౄలు నట్లై, కిత్వము వశులై,
కూ కోలు కుత్వమునకును । జేకొను దత్కాదికాంత సిద్ధార్ణతతిన్. ౩౮

### ఇ త రే త ర వ ర్గ జ వ ళి ని రూ ప ణ ము

క. ఇతరేత రవర్గజ వళి
తతికిఁ జవర్గువును శ ష స ద గు నొకగమి యై;

క్రతువులకు న హ య లు నేక
స్థితి నొకవంగకము; నణలుఁ జెలఁగు నొకటియై. ౩౯

చ. చతురచళుక్యవిశ్వవిభుశాసన మెక్కినరాజమౌళు ల
చ్చ్యుత మకుటోజ్జ్వలస్రగనుషక్తము లై విలసిల్లు నెందు; నీ
జతనము నీతిమంతులకు సాఁగిన నేమి కొలంత ? సంతతో
ర్జితమదబుద్ధులుం గుళలసిద్ధులు పొందుట లెల్లఁ బోలవే. ౪౦

ఆ. చతురుపాయబాహుశక్తిక్షమావశీఁ । దాఁట విడిచి *చిత్రభానుసాక్షిఁ
బాతె సర్వసిద్ధిపద మేది ధరణీవ । రాహమునకు నోడి రాచకదుపు. ౪౧

ఉ. అమమత కాస్పదంబు, వినయంబునకుం గుదు, రుబ్బులేవివె
య్యామునకు నాలవాలము, మహాగుణపంక్తికి జన్మభూమి, దా
నమునకు నాదరం, బరిరణక్రియ కుగ్రనికేతనంబు నా
నమరుఁ జళుక్యవిశ్వమనుజాధిపుచిత్త మమత్తవృత్తియై. ౪౨

ఏకతరవళి నిరూపణము

క. మ ర వ ల ల లేకతరవళు
లరయ గఁ దమతమక కవులయనుమతి వళులై
బరఁగుఁ, బదాంతముకారము
పొరిఁబొందిన పు ఫు బు భు ము లు పొసఁగిన చోటన్. ౪౩

ఆ. మధురవచనుఁ డార్యమాననీయాగ్రణి । రసికవరుఁడు రాజరాజనిభుఁడు
వరుస యెఱిఁగి సుకవివరులకు నిచ్చునఁ । బచ్చి విశ్వవిభునిలాగు మెచ్చు. ౪౪

ఆ. అజ్జు లాని యీగి జావడి సభలోన । తేపి పోరి లోన బిచ్చఁ బొలసి
తెన్న మడుగుపుడమితేంద్ర నేలనుతింప । మనకు విశ్వనాథుఁ డొనరియుండ. ౪౫

ముకార వళి నిరూపణము

తే. పుడమి విశ్వవిభునిభుజమునకుఁ దొడవు । పుల్లపద్మాలయ వితీర్ణమునకు బోటి
బుధులు విద్యావివేచనమునకు సాక్షి । భువనములు కీర్తికి నివాసములు దలంప.

---

*శకము ౧౩౨౪ క్రీ. శ. 1402. ఈచిత్రభానుశబ్దము నీతఁడు ఇదే ౫౮ వ లో మఱియొక సందర్భమున ప్రయోగించినాఁడు. ఇట్లే రన్నకవి కన్నడగదాయుద్ధమున చిత్రభాను సంవత్సరమును పేర్కొనుచున్నాఁడు గాని ఈధ్వని చమత్కారము లేదు.

ప్రాదివళి నిరూపణము

క. ప్రపరాప సమను సుప్ర
త్యపి నిర్దురధి న్యుపాభ్యుదాఙ్వ్యత్యవప
ర్యుపసర్గ వింశతికి వళు
*లు పరస్పరవర్ణయుక్తి నుభయముఁ జెల్లున్. ౪౬

ప్ర - పరా - అప - సమ్ - అను - సు - ప్రతి - అపి - నిర్ - దుర్ - అధి - వి - ఉప - అభి - ఉత్ - ఆఙ్ - వి - అతి - అవ - పరి:—ఇవి యిరువదియు నుపసర్గలు; ఇందు అప్యాఙ్ అను నిరూపణ మప్రసిద్ధము.

శా. ప్రారంభించు నశేషధర్మముల, సంపాదించు సత్కీర్తులన్
బ్రారబ్ధంబులు నిర్వహించు ఫలపర్యంతంబుగా నెప్పుడున్,
బ్రారబ్ధ ప్రతిలబ్ధ సంపదలచే రాగిల్లు నుల్లాసియై,
యీ రాజంచు నుతింతు రార్యు లిల విశ్వేశావనీవల్లభున్, ౪౭

తే. రిపుల విశసించు చోటఁ బరేతనాథుఁ,
డుర్వి రక్షించుచోటఁ బరోధ భుజుఁడు
బహుధనా వాప్తిచో ననపాయబుద్ధి,
యంతరరులకు నీ రాజపాయకరుఁడు. ౪౮

చ. స్మయరహితంబు, వైభవసమాగమ, మాహవధుర్యశౌర్య మ
వ్యయము, జయంబు విస్మయసమగ్రము, పాదవినమ్ర శాత్రవా
న్వయ పరిరక్షణం బభినవంబు, నయోచిత శాస్త్రవాచకా
న్వయనిపుణంబు చిత్త, మనయంబును విశ్వనరేంద్రభక్తకున్. ౫౦

తే. స్వర్ణగిరిచాపుఁ దర్చింపవలయు వేల్పు,
స్వంత మగుమంత్ర మాప్తపంచాక్షరంబు,
తథ్యమగుధర్మ మెపుడు ప్రత్యక్షకృత్య,
మాత్మ విశ్వేశ్వరునకుఁ బ్రత్యహముఁ దగిలి. ౫౧

సీ. రసభావశీలి నిరంతరశ్రుతిశాలి । యర్థావబోధ నిరర్గళుండు,
రాజన్యజన్య దురంతవిక్రముఁడు దు, । రవగాహవిద్యా విహారభూమి,

* లుపరి స్వవర్ణయుక్తి నుభయముఁజెల్లున్ (భారతి - జూలై 1932)

దానార్హ సంపదధ్యావాస మాయుధా । యతవేదశశ్వదధ్యయనవేది
న్యాయతర్కాది నానాశాస్త్రకుతుకి వి । న్యస్తపూతార్థ మహాశయుండు· ౨౨

ఆ. ప్రచుర ఫలిత చతురుపాయాభిరాముఁ డు
పేంద్రభూపతనయుఁ డింద్రసిభుఁడు
భీమబలుఁడు జగదభీహిత శోభనా
భ్యర్థి విశ్వనాథుఁ డవనివిభుఁడు. ౨౩

క. చంచలత లేక దానో । దంచితుఁ డగువిశ్వనాథ ధరణీశ్వరుచే
మించినసుకవీశ్వరుల దృ । గంచలముల మలయు సిరు లుదగ్రప్రీతిన్. ౨౪

చ. వ్యపగతదోషుఁ డవ్యసనవర్గుఁ డుదంచిత మంత్రపంచక
వ్యపగతశత్రుమండలుఁ డయాన్వితుఁ డూర్జిత వైరిభూవర
ద్విపవరమత్త కేసరి యతీంద్రియఖేలనుఁ దార్య చర్యుఁ డ
త్యుపచితశౌర్యశాలి సుగుణోన్నతి విశ్వనరేంద్రుఁ డెప్పుడున్. ౨౫

తే. విశ్వ విశ్వంభరాసమా పేక్షణమున
నడచు నీహిత బహుఫలావాప్తు లెల్లఁ;
బ్రజలు లోనరింతు రఖిల పర్యంతనృపులు
నర్థి విశ్వేశ్వరునకుఁ బర్యాయగతుల. ౨౬

స బిం దు వ ర్గ వ ళి ని రూ ప ణ ము

తే. ట త ప వర్గాక్షరములకు డాపలించి
మొనర మూఁదిన బిందువు లుండెనేని
వరుస ణ న మ లు వళులగు వాని కెల్ల
నవనిఁ గొందఱు సుకవులయనుమతమున. ౨౭

చ. కినుకఁ జళుక్యవిశ్వనృపకేసరి తేసినచోఁ గృపాణదం
డనమునఁ గల్గుఁ బో సురగణత్వము, తత్పదపారిజాత వం
దనమునఁ గల్గుఁ బో మనుజనాథత, తద్భటదర్శనావలం
బనమునఁ గల్గు బో గహనమధ్య నివాసము, వైరికోటికిన్. ౨౮

ద్వ్యక్షర త్ర్యక్షర ప్లుతాక్షర వళి నిరూపణము

ఆ. మొదలి వ్రాఁత రెండు మూఁడు నక్కరములఁ
గూడెనేని యదియ కూర్చు వళుల,

నంత్యవర్ణము నిడుపయి తర్క భేద ద (?)
యార్థ మయిన నచ్చు హల్లు వళులు. ౫౯

క. ప్రియకరుఁడు, సర్వలోకా। శ్రయ బిరు దోదగ్రుఁ, డుగ్రజనవర సేనా
జయలక్ష్మి సుఖకర సం। శ్రయుఁ, డీచాళుక్యవిశ్వరాజేంద్రుఁ డిలన్. ౬౦

తే. ధర్మములు నిత్య సత్య కృద్వ్యాప్తు లెపుడు,
వర్జ్యములు చిత్తమున కసద్వ్యసనచయము,
లర్థములు వర్ణ విభ్రమ ద్వ్యక్తివిధులు
పతికి ననుటయు విశ్వభూపతికి నమరు. ౬౧

క. త్రాసమతి విమతు లడుగులు। డాసిన నీసోమవంశ్యుఁడా రక్షింపం
డీ సుడిగి యుచితగతి వి। న్యాసంబునఁ గొలువవలవదా విశ్వేశున్. ౬౨

మ. కమలోత్పత్తి నిమిత్తముం గువలయాకాంక్ష్యైతపజ్జీవనీ
యము నైనంతన నభ్రవిభ్రమము నేలా సర్వలోకాశ్రయ
క్షమతం బేర్చు చళుక్య విశ్వవిభు శశ్వద్దాన ధారాజ లౌ
ఘముతో సాటికిఁ బాటిసేసెదవు క్రిక్కా చక్కఁ దర్కింపుమా. ౬౩

### ఆ దే శ వ ళి ని రూ ప ణ ము

క. ద్వీపమునకు నాకమునకు। నాపై శాస్త్రోక్తి నచ్చు లాదేశ సమా
సాపత్తి గలుగుటయు వళు। లాపాదింపుదురు కొంద ఱచ్చును హల్లున్. ౬౪

ఉ. ద్వీపులఁ ద్రుంచువిశ్వజగతీపతి యుత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయున్ బ్రసన్నుఁడై
గోపతిధేను వవ్విభునకుం దనవైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీవదాన్యగుణబుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్. ౬౫

క. నీకరవాలముపాలై। నాకంబున కరిగి రాజనారాయణ యా
భూకాంతు లెట్టిచనవో। నాక విటోత్తములఁ దూల నడుతురు లీలన్. ౬౬

క. విను మన్యోన్యపదంబున
కొనరింతురు కవులు గొంద ఱో నో లాయుం
దనుబోనియచ్చు కలుగుటఁ,
జొనుపుదు రాయచ్చు వళియు సుకవులు కృతులన్. ౬౭

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి యేఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వ సంపదల నొందిరి, దంపతు లింపు నింప న
న్యోన్యసుఖానుకూలతల నోమిరి, విప్రులు వేల్పుఁబిండు న
న్యోన్య సుపుష్టి తుష్టి కుశ లాదులఁ జెందిరి నాఁడునాఁటికిన్. ౧౮

దే శీ య వ ళి ని రూ ప ణ ము

చ. కలకరి కల్లతంబు కడుఁ గట్టిఁడి తెమ్మెర లోలమాస గ్ర
చ్ఛలు యెనలారు లుల్లలుకు లాడెడి పీఱిఁడి రజ్జులాఁడు గ్రి
క్కిఱియట నాఁ దెనుంగునకు సీయుభయంబు వళిప్రకారమై
మెఱయుఁ గవిప్రయోగముల మేల మెఱింగి రచింప నేర్చినన్. ౧౯

క. చెన్నక్కుఁ జెన్నక మా । చన్నన మాచన యనంగ నచ్చట వళి యై
చెన్నగు నకార మార్యుల । మన్నన హల్లేని గలుగు మఱియొక్కొకచోన్. ౨౦

క. కడలాలుం జవరాలును । జడుఁ డొక్కం డొకఁ డనంగఁ జనునుడువుల న
చ్చొడుటయె తగు పడి హల్లను । వడి సేయుదు రంధ్రు కవులు వలసినచోటన్. ౨౧

క. ఏకైకము సోదర నా । కొకులు ననుశబ్దములకు నొగి నేత్వోత్వా
పికము వళు లగుఁ గొందఱు । గైకొందురు వృద్ధివళులు కవు లొడఁబడికన్.*

ష డ్వి ధ ప్రా స ము లు

క. భాసురము లగుచు సుకర । ప్రాసాను ప్రాస దుష్కరప్రాసాంత్య
ప్రాస ద్వంద్వ త్రితయ । ప్రాసము లన షడ్విధములు పరఁగుం గృతులన్. ౨౩

సు క ర ప్రా స ము

క. సుకుమారము శ్రుతిసుఖదము । నకలంకము నైనవర్ణ మాద్యక్షర సృ
ష్టికి రెండవప్రాయి సుమీ । సుకరప్రాసం బనంగ సులభము కృతులన్. ౨౪

క. అరవిందహితుఁడు దీధితి । నరవిందోదరుఁడు విద్విడపహరణముచో
నరవిందభవుఁడు చతురత । ధర ధరణివరాహ విశ్వధరణిపుఁ డెపుడున్. ౨౫

అ ను ప్రా స ము

క. ఇదునెడఁ బ్రాసాక్షరములు । బడి తప్పక పాదపదవిభాగములఁ గడున్
బెడఁగైన నను ప్రాసం । బడరుం గబ్బముల నెల్ల నమరినతోడవై. ౨౬

---

* ఈపద్యము వావిళ్లవారి యానందరంగరాట్ఛందమున నిట్లు లేదు.

క. దంద్రములు సాంద్రములు ని । స్తంద్రములును గుణము లెపుడు ధరసత్యహరి
శ్చంద్రునకుఁ జంద్రవంశ్యున । కింద్రోర్జితమహిమునకు నుపేంద్రసుతునకున్.

దు ష్క ర ప్రా స ము

క. పదపడిఁ బాదాదుల ను । చ్చరణాసహ్యాక్షరముల సమకూర్చిన దు
ష్కర మనియెడుప్రాసం బగు । సరసాలంకార మనుచుఁ జను సత్కృతులన్.

క. నుర్గయి విశ్వేశ్వరుదో । రర్గళహతిఁ జన్నరిపుల నగు వినుతింపన్
స్వర్గవధూకుచకుంభ వి । నిర్గళదంబువులచేత నిర్మలు లగుటన్. ౯౦

అ ం త్య ప్రా స ము

క. మొదలిచరణంబుకడ శుభ । పద మయ్యేడిప్రాయి యన్ని పాదంబులకున్
దుదనుండి మండనం బగు । నది యంత్యప్రాస మనఁగ నమరుం గృతులన్.

క. భూజనహితనయశీలున్ । బూజింతురు నృపులు విశ్వభూమీపాలున్
రాజితకీర్తివిశాలున్ । రాజేంద్ర చ్ఛత్రచామరశ్రీలోలున్. ౯౧

ద్వ ం ద్వ త్రి ప్రా స ము

క. క్రమమునఁ బాదాదులయం । దమలము లై రెండు మూఁడు నక్కరములు చె
న్నమరిన ద్వంద్వత్రిప్రా । సము లనఁగా బరఁగు వానిఁ జనుఁ దెలియంగన్.

క. దానంబు వివిధకుశలని । దానంబు విరోధిరాజ దత్తధనచయా
దానంబు గవులసౌ మ్ముప । దానం బిత్తెఱఁగు విశ్వధరణీపతికిన్. ౯౩

క. శీలనమును దన్నవపరి । లాలనము నశేషశాస్త్ర లాలితవిద్యా
ఖేలనము ధర్మధరణీ । పాలనమును విశ్వధరణిపాలున కొనరున్. ౯౪

ల ళ డ బు క్రా ం త ప్రా స ము లు

క. *వలసినచోళములు డల । ములు మఱి బుక్రాంతవర్ణములు ప్రాసము లై
యలవడు సత్కవికృతులన్ । నిలుపందగు వానిఁ దెలిసి నియతప్రీతిన్. ౯౫

క. తాళము దాలము నాఁజనుఁ । జోళుఁడు చోడుండునాఁగ సొంపగు, నుగ్ర
వ్యాళ వ్యాడ వ్యాలము । లోలిన సమరూఢిఁ బ్రాసయుక్తిం జెల్లున్. ౯౬

---

* ఈమూఁడుపద్యములును కొన్ని కవిజనాశ్రయప్రతులలో నున్నవని ఆం. సా. ప. ప్రతి అధోజ్ఞాపిక, పుట 26.

తే. భీకరాకారు( డయ్యు నంగీకృతుండు । మేదురక్రోధు( డయ్యు ననాదృతుండు
పావనాత్మకు(డయ్యు బలావృతుండు । నా(గ(ప్రాసంబులకు సమానంబు లేపుడు.

వృ త్త ము లు

క. ఇది ప్రాసలక్షణం బిక । విదితంబుగ( బింగళాహివిరచిత మగుచుఙా
బొదలెడు ఛందోగణపం । పద యగు వృత్తప్రపంచపద మెఱు(గ(దగుఙా.౭౭

క. ఆదట నక్షర గణ నో । త్పాదిత గణసంప్రవృత్తి తంత్రముచే( గా
కోదరు(డు గరుడునిం బ్రి । చ్ఛాదించుట ఛంద మన(గ జగతిం బర(గుఙా.౭౮

౭. ఇది లౌకిక వైదిక వా । క్పద మై షడ్వింశతిప్రపంచాత్మక మై
పొదలుం; దెలియ(గవలయును । ముదమున నభిధానరూపముల చందంబుల్.

వ. ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు జగతి. అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి. ఆకృతి, వికృతి. సంకృతి, అతికృతి, ఉత్కృతి, అనం బ్రవర్తిల్లు; నందు నుక్తాదిచ్ఛందంబు లొక్కయక్షరంబునుండి యొండొంటి కొక్కొక్క యక్షరంబుగా షడ్వింశాక్షరపర్యంతంబు( బెరు(గు.

అందు నుక్తాచ్ఛందంబున( బ్రతిపాదంబున నేకాక్షరం బై శ్రీ యను వృత్తంబయ్యె.

(శ్రీ)(శ్రీ)ం – జేయుఙా.

అత్యుక్తాచ్ఛందః పాదంబు ద్వ్యక్షరం బందు స్త్రీ యను వృత్తం బయ్యె:

(స్త్రీ)రూ – పారుం – గారూ – పారుఙా.

మధ్యాచ్ఛందంబు త్ర్యక్షరంబై నారీవృత్తంబునకు జనకం బయ్యె:
నారీవృ-త్తారంభం-బారు న్మా-కారం బై.

ప్రతిష్ఠాచ్ఛందఃపాదంబు చతురక్షరం బై

క న్యా వృ త్త ము

పొత్తై మూగా - వృత్తిం గన్యా -
వృత్తం బయ్యెఙా - బిత్తం బారఙా

సుకాంతివృత్తము (జ గ.)

జగంబులం-దగుఁ సుకాం-తి గల్పిత-ప్రగల్భతఁ.

సుప్రతిష్ఠాచ్ఛందఃపాదంబు పంచాక్షరం బై

సుందరీవృత్తము (భ గ గ.)

సుందరి యొప్పం-జెంది భగా నిం-
పొంద నియుక్తిఁ-గందుకలీలఁ.

ప్రగుణవృత్తము (స గ గ.)

సగణాసక్తిం-గగసంయుక్తిఁ-
బ్రగుణాఖ్యంబై-తగు నింపారఁ.

అంబుజవృత్తము (భ వ.)

ఇంపగు భకా-రంబును వకా-రంబును జూమీ-యంబుజ మగుఁ.

విచ్ఛందోధికారము

క. ఇం దుండియుఁ గరణీయ। చ్ఛందోవృత్తముల నర్థ సంజ్ఞితములుగా
నొందింతు గ్రంథవిస్తృతి। క్రందునకుం గాక యర్థగౌరవ మొప్పఁ.

గాయత్రీచ్ఛందఃపాదంబు షడక్షరంబై

విచిత్రవృత్తము (య య.)

విచిత్రంబునందుఁ-రుచించుఁ యయంబుల్.

తనుమధ్యావృత్తము (త య.)

ఒప్పుఁ తయ యుక్తిం-జెప్పం దనుమధ్యఁ.

సురలత (న య.)

సురలతఁ జెప్పఁ-బొరిది నయంబుల్.

ఉష్ణిక్ ఛందఃపాదంబు సప్తాక్షరంబై

విభూతివృత్తము (ర జ గ)

స్వస్థ సద్విభూతి దా-రస్థ జస్థగంబునఁ,

మదనవిలసితము (న న గ.)

మదనవిలసిత-ప్రదములు నవగల్.

కుమారలలిత (జనగ.)

కుమార లలితకుఁ-సమగ్రజనగముల్.

అనుష్టుప్ఛందఃపాదం బష్టాక్షరం బై

విద్యున్మాల యను వృత్తము (మమగగ.)

శ్రీవెలఁ రాజిల్లుఁ విద్యు-న్మాలాఖ్యంబై మాగాసక్తిన్.

చిత్రపదము (భభగగ.)

చిత్రపదం బన భాగా-చిత్రయతిప్రతిపత్తిఁ.

ప్రమాణి (జరవ.)

జకారముఁ రకారముఁ - వకారముం బ్రమాణికిఁ.

సమాని (రజవ.)

ఈసమానికిఁ ర జ వ-వ్యాస మొప్పగుం గృతులఁ.

సింహరేఖ (రజగగ.)

ఈరజాగ్రగా నియుక్తిఁ-గోరి సింహరేఖ యొప్పుఁ

బృహతీచ్ఛందఃపాదంబు నవాక్షరంబై

భుజగశిశురుత మను వృత్తము (ననయ.)

భుజగశిశురుత మయ్యెఁ-బుజు ననయ ములచేతఁ.

హలముఖి (రనస.)

కామితక్రియ హలముఖీ-నామ మొప్పు రనసలచేఁ.

భద్రకము (రనర.)

భద్రకంబు రనరంబులఁ-భద్ర విశ్వనృపమన్మథా.

ఉత్సుకము (భభర.)

ఉత్సుక మౌ భభరంబులఁ-మత్సరి మాన విమర్దనా.



క. ఇట నిం దీవల విశ్రమ । ఘటనలు కల్పింప వలయుఁ గబ్బంబుల నె
చ్చట నిలుపంగాఁదగున। చ్చటఁ దగఁ బరికించి నిలుప శాస్త్ర ప్రౌఢిఁ. ౯౪

పంక్తిచ్ఛందఃపాదంబు దశాక్షరం బై

రుగ్మవతి యను వృత్తము (భమసగ. 6)

రుగ్మవతిం జేరుఁ భమసంబుల్-తిగ్మరుచిద్యుద్దీప్త గయుక్తిఁ.

మ యూ ర సా రి (ర జ ర గ. 7)

పర్వ నీరజంబు పైరగంబుల్-సర్వదా మయూరసారిఁ జెప్పుఁ.

మ త్త (మ భ స గ. 7)

శైలక్రాంతిఁ మభసగలోలిం-గ్రాలఁ మత్తాఖ్యను గనుపట్టుఁ.

శు ద్ధ వి రా ట (మ స జ గ. 6.)

సక్తం బై మసజద్గ ప్రథా-రక్తిఁ శుద్ధవిరాట నాఁజనుఁ.

ప ణ వ ము (మ న య గ. 6.)

అందంబై మనయగముల్ పొంపిం-పం దవ్వొందక పణవం బయ్యెఁ,

త్రిష్టుప్ఛందః పాదంబేకాదశాక్షరంబై

శా లి నీ వృ త్త ము (మ త త గ గ. 6.)

రాకాధీశాకార రాజన్మ తా గా - నీకప్రాప్తిఁ శాలినీవృత్తమయ్యెఁ

ఇం ద్ర వ జ్ర ము (త త జ గ గ. 8.)

ఈతాజగానిర్మితి నింద్రవజ్రా - నీతాఖ్య వర్తించు వినిర్మలోక్తిఁ.

ఉ పేం ద్ర వ జ్ర ము (జ త జ గ గ. 8.)

ఉపేంద్రవజ్రాహ్వయ మొప్పునిం పై

యుపేంద్రపుత్త్రా జతజోక్తగాలఁ.

ఉ ప జా తి

ఈయింద్రవజ్రాఖ్య ముపేంద్రవజ్ర

శ్రయంబు గాఁగా నుపజాతి మయ్యెఁ.

తో ద క ముఁ (భ భ భ గ గ. 7)

కామితభత్రయ గాయుత మై వి - శ్రామపుఁ దోదక సంజ్ఞతఁ జెందుఁ.

ర థో ద్ధ త ము (ర న ర ల గ,) 7

రక్తిఁ బేర్చి రనరంబు పై లగం - బుక్త మైనను రథోద్ధతం బగుఁ.

చ ం ద్రి క (న న ర వ 7)

సలలితముగఁ జంద్రికాహ్వయం - బలరు ననరవాంక మై కృతిఁ.

స్వా గ త ము (ర న భ గ గ 7.)

స్వాగతంబు రనభంబు గగాప్తిఁ - సాగు విశ్వనృపచంద్రకులాఢ్యా.

శ్యేని (ర వ ర వ. 7)

శ్యేనికై రవంబు చెప్పి పైరవం - బూనఁజేయు పెల్ల నొప్పు నెప్పుడుఁ

వాతోర్మి (మ భ త ల గ. 7)

తద్వాతోర్మిఁ మభతంబుల్ లగముఁ - సద్విశ్రామస్థితి సంధిల్లఁదగఁ

జగతీఛందఃపాదంబు ద్వాదశాక్షరంబై

భుజంగప్రయాత వృత్తము (య య య య. 8)

భుజంగప్రయాతంబు పొం దారు నందం

బజస్రంబుగా నయ్యయాయంబు లొందఁ.

తోటకము (స స స స. 9)

సరసం బయి సాససంభృతమై - విరచించినఁ దోటకవృత్తమగుఁ.

వంశస్థము (జ త జ ర. 8)

జతంబులం జెందిన జంబు రేఫయుఁ - నుతింప వంశస్థ మనుక్రమక్రియఁ

ఇంద్రవంశము (త త జ ర. 8)

ఈ తా జ రా కల్పన నింద్రవంశకా

ఖ్యాతాఖ్య మయ్యెఁ బరిగండభైరవా.

తోదకము (న జ జ య. 8)

సలలిత మైన నజాయగణంబుల్ । విలసిత తోదకవృత్తముఁ జెప్పుఁ.

ద్రుతవిలంబితము (న భ భ ర. 7)

ద్రుతవిలంబితరూపితవృత్తిచేఁ । బ్రతతమయ్యె నభారగణంబులఁ.

స్రగ్విణి (ర ర ర ర. 7)

స్ఫారితంబై యతూపా ర ర శ్రేణితో

పార మై స్రగ్విణీచారువృత్తం బగుఁ.

జలధరమాల (మ భ స మ. 9)

మాద్యత్ప్రీతిం జలధరమాలాఖ్యం

బ్రద్యోతించుఁ మ భ స మ భద్రవ్యాప్తిఁ.

ప్రమితాక్షరము (స జ స స. 9)

అమలక్రియాప్తిఁ బ్రమితాక్షర మై

యమరుఁ సజస్థ స స యంత్రిత మై.

విశ్వదేవి (మ మ య య, 8)

మాయావర్ణం బొప్పం గ్రమన్యాసవృత్తిన్
జేయన్ భూభృ ద్విక్రాంతిచే విశ్వదేవిన్.

క. అకలంయతిచ్ఛందో । ధికార మిది దీని నెఱిఁగి తెలియఁగవలయున్.
ప్రకటింతు విపులవృత్త । ప్రకరముఁ బ్రస్తారసరణి రచనీయంబున్

శా. ఛందశ్శాస్త్రవివక్ష, సత్కృతిపరిష్కార క్రియాదక్ష, స్వ
చ్ఛందక్రీడదురుప్రతాప, కరుణాసంపన్న సల్లాప, ని
ష్పందానందితసాధులోక, భువనప్రఖ్యాతసుశ్లోక, స
ద్వృందారుక్షితిపాల పాలనకళాధౌరేయ ధైర్యోజ్జ్వలా.

క. రాజేంద్రచరిత్రద్వయ । రాజద్విజ యేందిరాభిరా మైశ్వర్యా
రాజాన్వవాయవర్యా । రాజీవకదంబసూర్య రసికాచార్యా.

మాలిని

రభసరణ విశంకా రాజనారాయణాంకా
సభయరిపుశరణ్యా శశ్వ దాసన్నపుణ్యా
సభికహితపదార్థా సర్వలోకాశ్రయార్థా
విభవవిబుధసాథా వీరలక్ష్మీ సనాథా.

గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయ నామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణియను నలంకారశాస్త్రంబునందు
ఛందో గణ వళి ప్రాస చ్ఛందోధికార
లక్షణ సముద్దేశం బన్నది
సప్తమోల్లాసము.



# అష్టమోల్లాసము

## ఛందఃప్రకరణము

U|| - |U| - ||U - |UU - U|U - UU| - UUU - ||| - U - |
భ జ స య ర త మ న గ ల

U| |U
గలము — లగము

(గలమునకు హాగణమనియు — లగమునకు వగణమనియు నామాంతరములు)

క. శ్రీవిశ్వేశ్వర విశ్వ। క్ష్మావల్లభవంద్య పాదకమల కమలభూ
దేవీ కమలసితయశా। కోవిదనుత రాయగండగోపాలాంకా! ౧

౧౩. అతిజగతీచ్ఛందఃపాదంబు త్రయోదశాక్షరంబు—

అందుఁ బ్రహర్షిణీవృత్తము—(మ-న-జ-ర-గ-౮ యతి.)

ప్రావీణ్యప్రదయొనరం బ్రహర్షిణింపాఁ
గావించున్ మ న జ ర గ వ్రజంబుధాత్రిన్

రుచిరవృత్తము—(జ-భ-స-జ-గ ౮ యతి)

క్రమంబుతో జభసజగమ్ము లిమ్ముగా
సమర్పఁగా రుచిరసమాహ్వయం బగున్.

మత్తమయూరము—(మ-త-య-స-గ-౯ యతి.)

సంబోధార్థంబై విలసన్మత్త మయూరా
ఖ్యం బింపొప్పారున్ మతయాగ్ర్యాత్త సగాప్తిన్.

మంజుభాషిణి—(స-జ-స-జ-గ-౯ యతి)

సలయంబుగాఁగఁ సజసంబుతో జగం
బులు మంజుభాషిణికిఁ బొందు నందమై

జలదము—(భ-ర-న-భ-గురు-౧౦ యతి.)

ఈ భర నంబుల న్పగురు లెక్కఁచు నిం
పై భజియించె నేని జలదాహ్వయ మౌ.

ప్రభాతము—(న-జ-జ-ర-గ-౮ యతి.)

మొదల నజారగము ల్ప్రభాతసంజ్ఞం
బొదవఁగ జేయు నపూర్వకల్పనోక్తిన్.

౧౪. శక్వరీచ్ఛందఃపాదంబు చతుర్దశాక్షరంబు

అందు వసంతతిలకవృత్తము—(త-భ-జ-జ-గ-గ-౮ యతి.)

స్థాపించినం దభజజంబు చశుక్య విశ్వ
క్ష్మాపా వసంతతిలకంబగు గా వియుక్తిన్.

అపరాజితవృత్తము—(న-న-ర-స-ల-గ-౯ యతి.)

ననరసలగముల్ దనర్చిన సత్కృతిం
దనరఁగ నపరాజితంబు కవిస్తుతిన్.

వనమయూరము—(భ-జ-స-న-గగ-౯ యతి.)

నందయతితో భజసవ్రజగగం బిం
పొంది చదువ న్వనమయూర మగుధాత్రిన్.

సుందరము—(భ-భ-ర-స-లగ-౯ యతి.)

భారసవంబుల నొప్పుఁ బద్మజవిక్రమం
బారఁగ సుందరవృత్తమై బుధవర్ణ్యమై.

ప్రహరణకలితము—(న-న-భ-న-లగ-౮ యతి.)

ప్రహరణకలితంబయి ననభనవల్
బహువిధయతులం బ్రథఁ జెలు వడరున్.

భూనుతము—(ర-న-న-భ-గగ-౧౦ యతి.)

అందమై రననభతతి నంది గగంబుల్
పొందఁగా బదగతిఁగని భూనుతమయ్యెన్.

౧౫. అతిశక్వరీచ్ఛందఃపాదంబు పంచదశాక్షరంబు

అందు మణిగణనికరవృత్తము—(న-న-న-న-స-౮ యతి.)

సరసత ననన న సగణము లెసఁగం
గరియతిఁ గని మణిగణనికర మగున్.

మాలినీవృత్తము—(న-న-మ-య-య-౮ యతి.)
కరటివిరతి నామ క్రాంతయా యుక్తితోడన్
మరగి తిరుగఁ జెప్ప న్మాలినీవృత్తమయ్యెన్

సుకేసరము—(న-జ-భ-జ-ర-౧౦ యతి.)
నజభజరేఫలం గదియ వచ్చి దిగ్యతిన్
సుజనమతి న్సు కేసరము శోభితంబగున్

మణిభూషణము—(ర-న-భ-భ-ర-౧౦ యతి.)
విశ్వభూప మణిభూషణవృత్త మనంజనున్
శశ్వదుత్తర నభార దిశాయతిఁగూడినన్.

మనోజ్ఞము (న-జ-జ-భ-ర-౮ యతి.)
వరుస మనోజ్ఞమనంగ వచ్చు నజాభర
స్థిరగతిఁ బంకజభూయతిం బ్రతిపన్నమై.

౧౬. అష్టిచ్ఛందఃపాదంబు షోడశాక్షరంబు

అందుఁ బద్మకవృత్తము—(న-భ-జ-జ-జ-గ ౧౧ యతి)
నభజజవ్యయ గకార సనాతన విశ్రుతిం
బ్రభవమై పరఁగు సత్కృతిఁ బద్మకవృత్తమై.

ప్రియకాంతావృత్తము—(న-య-న-య-స-గ-౧౦ యతి.)
నయనయయుక్తిం దగ సగణంబున్ గురువొందున్
నియతము దిగ్విశ్రమమును విందుం బ్రియకాంతన్.

చంద్రశ్రీ—(య-మ-న-స-ర-గ-౧౧ యతి.)
అగుం జంద్రశ్రీవా హారవిరమణాయత్తమైనం
బ్రగాఢంబై యొప్పున్ యమనసర బద్ధాగ్రగాప్తిన్.

మేదిని—(న-జ-భ-జ-ర-గ-౧౦ యతి.)
నజభజరేఫగంబునఁ దనర్చు మేదినీవృ
త్తజనికి మూలమై దిగుదితస్థ విశ్రమంబై.

౧౭. అత్యష్టిచ్ఛందఃపాదంబు సప్తదశాక్షరంబు

అందు శిఖరిణీవృత్తము—(య-మ-న-స-భ-లగ-౧౨ యతి.
వివస్వద్విశ్రాంతి న్యమనసభవా విష్కృతగతిం
గవిశ్రేణీరక్తిన్ శిఖరిణియనంగాఁ దగుఁ బ్రథన్.

పృథివీవృత్తము—(జ-స-జ-స-య-వ-౧౨ యతి.)

జసంబులు జసంబులున్ యవనిషక్త రూపంబులై
పొసంగఁ బృథివీసమాఖ్యయగుఁ భూషవిశ్రాంతితోన్.

హరిణి—(న-స-మ-ర-స-వ-౧౧ యతి.)

హరిణి యనువృత్తంబయ్యెన్ శంకరాత్తయతిప్రథన్
సరినసమ రేఫా క్రాంతోపేత సస్థలగంబులన్.

మందాక్రాంతము—(మ-భ-న-త-త-గగ-౧౧ యతి.

పొందందంబై మభనతతగా భూషితంబై తనర్పన్
మందాక్రాంతాహ్వయమగు శివామందవిశ్రాంతిచేతన్.

త్వరితపదగతి—(న-న-న-న-న-గగ,౧౧ యతి.)

త్వరితపదగతి యనఁగఁ దగు ననననా గా
విరచితయు దశమయతి విలసితయు నై నన్.

నర్కుటము—(న-జ-భ-జ-జ-వ-౧౦ యతి.)

నజభజముల్ జవంబులఁ దనర్చిన నర్కుటక
ప్రజననమొప్పు దిగ్యతిని రాజకులాబ్ధిశశీ.

౧౮. ధృతిచ్ఛందఃపాదం బష్టాదశాక్షరంబు

అందుఁ గుసుమితలతావేల్లితావృత్తము—(మ-త-న-య-య-య-౧౧ యతి.)

స్వశ్రేయస్సిద్ధిన్ మతనయయయవ్యాప్తిచేఁ జర్మవాసో
విశ్రామం బొప్పగుం గుసుమితలతావేల్లితా వృత్తమయ్యెన్.

మత్తకోకిలవృత్తము—(ర-స-జ-జ-భ-ర-౧౦ యతి.)

మత్తకోకిలవృత్తమై దశమప్రవర్తిత విశ్రమా
యత్తమై రసజాభరేఫల నచ్చమై కడు నొప్పగున్.

౧౯. అతిధృతిచ్ఛందఃపాదం బేకోనవింశత్యక్షరంబు

అందు శార్దూలవిక్రీడితవృత్తము—(మ-స-జ-స-త-త-గ-౧౨ యతి.)

సంబంధించి దినేశవిశ్రమముతో శార్దూలవిక్రీడితా
ఖ్యంబయ్యెన్ మ స జంబులున్ స త త గా యత్తంబులై యుండినన్

మేఘవిస్ఫూర్జితవృత్తము—(య-మ-న-స-ర-ర-గ-౧౨ యతి)

మృదున్యస్తార్థంబై దినకరయతి న్మేఘవిస్ఫూర్జితాఖ్యం
బుదాత్తశ్రీఁ జేర్చున్ యమనసర రప్రోత గప్రాప్తిచేతన్.

చంద్రకళ — (ర-స-స-త-జ-జ-గ-౧౦ యతి)
వ్యక్తరీతి రసాతజజగ్రాయత్త గకారనిరూఢిచే
సక్త దిగ్విరమంబన నొప్పుం జంద్రకళాహ్వయమై ధరన్.

తరలము (ధ్రువకోకిల) — న-భ-ర-స-జ-జ-గ-౧౧ యతి.)
నభరసంబులు జాగవర్గము నచ్చి యీశ్వరవిశ్రమ
ప్రభవమై తరలం బనంజను రాజవంశశిఖామణీ!

భూతిలకము — (భ-భ-ర-స-జ-జ-గ-౧౧ యతి.)
భూతిలకం బగు భార సంబులఁ బొంది జా గ ము లుండినన్
భూతపతిస్ఫుట విశ్రమంబున భూప విశ్వనరేశ్వరా!

౨౦. కృతిచ్ఛందఃపాదంబు వింశత్యక్షరంబు

అందు మత్తేభవిక్రీడితవృత్తము — (స-భ-ర-న-మ-య-వ-౧౩ యతి.)
మనమారం బదుమూఁట విశ్రమముగా మత్తేభవిక్రీడితా
హ్వానమయ్యెన్ సభరంబు లన్నమయవన్యాసంబులం జెప్పినన్.

ఉత్పలమాలావృత్తము — (భ-ర-న-భ-భ-ర-లగ-౯ యతి.)
పద్మజయుగ్యతిన్ భరనభారలగంబులఁ జెంది సన్మనః
పద్మవికాస హేతువగు పద్యము నుత్పలమాలయం డ్రిలన్.

అంబురుహము — (భ-భ-భ-భ-ర-స-వ-౧౨ యతి.)
భాభభరంబులపై సవలొందుచు భానువిశ్రమయుక్తమై
యీభువి నంబురుహంబనఁగాఁ జను నింమవంశనృపాగ్రణీ.

ఖచరప్లుతము — (న-భ-భ-మ-స-స-వ-౧౧ యతి)
నభభముల్ మసనంబు లగాప్తి న్నాగవిభూషణయుగ్యతిన్
శుభదమై ఖచరప్లుత మొప్పు న్సోమకులార్ణవచంద్రమా.

౨౧. ప్రకృతిచ్ఛందఃపాదం బేకవింశత్యక్షరంబు

అందు స్రగ్ధరావృత్తము — (మ-ర-భ-న-య-య-య-౩-౩ యతులు.)
క్ష్మాభృద్భూభృద్యతిస్స్యా మరభనయయయా మాత్రమై యాదిమాద్య
క్ష్మాభృత్కీర్తీశ విశ్వేశ్వరనృపతివరా స్రగ్ధరావృత్త మయ్యెన్.

చంపకమాలావృత్తము — (న-జ-భ-జ-జ-జ-ర-౧౦ యతి.)
నజభజజార వర్గము దనర్చి దిశాయతి నర్థ యుక్తమై
బుధగతిఁ జెంది సత్కవుల కింపుగఁ జంపకమాల యై చనున్.

లాటీవిటము—(స-స-స-స-మ-త-య-౧౨ యతి.)
సససా మతయంబులు భానుయతి న్సొకంబై లాటీవిటవృత్తం
బెసకంబెసఁగుఁ విరచించిన విశ్వేశా, చాళుక్యక్షితిపాలా.

వనమంజరి—(న-జ-జ-జ-జ-భ-ర-౧౩ యతి.)
తనర నజాజజభాగ్భరకారయుత త్రయోదశయుగ్యతిఁ
వినుత మగు న్వనమంజరినాఁ దగువృత్త మింపెసలారఁగఁ.

మణిమాల—(స-జ-స-జ-స-జ-స-౧౦ యతి.)
వరుసఁ సజత్రితయము న్బ్రసక్త సగణంబుతోడ నొనరం
బరఁగుఁ దిగంతవిరతిం బ్రధానపదమై చళుక్యమదనా!

౨౨. ఆకృతిచ్ఛందఃపాదంబు ద్వావింశత్యక్షరంబు

అందు మహాస్రగ్ధరావృత్తము—(స-త-త-న-స-ర-ర-గ-౮-౮ యతులు.)
సకలశ్రీవిశ్వభూపా సతతనసరరా సక్తమై యగ్రగాప్తిం
బ్రకటింపఁ దంతిశైల ప్రచురయతి మహాస్రగ్ధరావృత్త మయ్యెఁ.

భద్రిణీవృత్తము—(భ-ర-న-ర-న-ర-న-గ-౧౧ యతి.)
భాదిరనత్రయంబు గురు యుక్తమై గిరిశవిశ్రమప్రకటమై
మేదిని నొప్పు భద్రిణికి నందు మెఱసగభీర విశ్వనృపతీ

మానిని—(భ-భ-భ-భ-భ-భ-భ-గ-౭-౭-౭ యతులు)
కామిని సప్తభకారము లొల గకారమునై పరికల్పితమై
నేమముగావడి నిల్పినఁ బెక్కులు నిల్పిన? మానిని నిక్కమగుఁ.

తురగవల్గిత—(న-న-న-న-స-జ-జ-గ-౧౪ యతి.)
మెఱయు ననననసజజగములను మేలుగా రచియించినఁ
వలు మనుయతి వలనను దురగవల్గితంబను వృత్తమై.

౨౩. వికృతిచ్ఛందఃపాదంబు త్రయోవింశత్యక్షరంబు

అందశ్వలలితవృత్తము—(న-జ-భ-జ-భ-జ-భ-లగ-౧౨ యతి.)
నజభజము ల్భజంబులకు నచ్చి భస్థలగయుక్తమై రవియతిం
బ్రజనితమైన నశ్వలలితంబు రాజకులదీప ధీజననుతా.

కవిరాజవిరాజితవృత్తము—(న-జ-జ-జ-జ-జ-జ-వ-౭-౭ యతులు.)
కలయఁగ నేక నకార షడుక్త జకార వ కారనికాయనిర
ర్గళగతిచే నలరం గవిరాజవిరాజితవృత్తము రమ్యమగుఁ.

౨౪. సంకృతిచ్ఛందఃపాదంబు చతుర్వింశత్యక్షరంబు

అందు సరసిజవృత్తము—(మ-త-య-న-న-న-న-స-౧౦-౭ యతులు.)

చాళుక్యక్ష్మాపాలవరేణ్యా శ్రయమతయననిచయయుతననసల్

చాలై యింపై ప్రాలఁ దనర్పన్ సరసిజమగు నిలఁజవులకుఁ గుదురై.

క్రౌంచపదవృత్తము—(భ-మ-స-భ-న-న-న-య-౧౪ యతి.)

ప్రాంచిత తేజఃకుంచితవైరీ భమసభననసయ పరిచితరీతిన్

అంచితమయ్యెం గ్రౌంచపదాఖ్యం బనుగతహరిదిభయతి నభివృత్తిన్

౨౫. అభికృతిచ్ఛందఃపాదంబు పంచవింశత్యక్షరంబు

అందు సింధురవృత్తము— (న-న-న-న-స-భ-భ-భ-గ ౧౨ యతి.)

క్రమమున నననన సభభభ గగణ క్రాంతిదినాధిపవిశ్రమమై

ప్రమదధలసలయభరితవిరచనన్ బంధురసింధురవృత్తమగున్

భాస్కరవిలసితవృత్తము—(భ-న-జ-య-భ-న-న-స-గ-౧౨ యతి.)

సారసహితయతి సంగతవృత్తి నంచిత భ న జ య భ న న స గ ం బుల్

పౌరవకులజలరాశిమృగాంకా, భాస్కరవిలసిత మనవిలసిల్లున్.

౨౬. ఉత్కృతిచ్ఛందఃపాదంబు షడ్వింశత్యక్షరంబు

భుజంగవిజృంభితవృత్తము—(మ-మ-త-న-న-న-ర-స-వ-ల-౧౦)

ధీపై దగ్ధశ్రీవిక్రాంతా దిగిభదశమపదవిరతిన్ భుజంగవిజృంభితం

బై పిశ్రాంతుల్ దైవాలం జెన్నగు మ మ త న న న ర స హారియై లగసంయుతిన్.

మంగళమహాశ్రీవృత్తము— (భ-జ-స-న-భ-జ-స-న-గగ-౧౪ యతి.)

శ్రీనిలయవిశ్వనృపశేఖరకృత స్తుతివశీకరణమంగళమహాశ్రీ

నా నెగడు సద్భజసనంబులతుదన్ భజసనంబులు గగంబును దనర్పన్.

క. క్రమమున నిరువదియాఱై
యమరిన ఛందంబులందు నందంబులుగా
సముచిత సమవృత్తంబుల
సమకూర్చితి నెఱుఁగవలయుఁ జతురులు మఱియున్, ౨

క. ఆలాగు గాక యుద్ధుర। మాలావృత్తములు నాఁగ మంజులతాలా
వాలములు నధికవర్ణ వి। శాలమ్ములు నగుచుఁ బరఁగుఁ జతురుల కెల్లన్. ౩

అందుఁ జత్వారింశన్మాత్రాగర్భితపాదంబు త్రింశదక్షరంబు లయగ్రాహి—(భ-జ-స-న-భ-జ-స-న-భ-య-౮ పైఁ బ్రాసయతి)

పంబినయతిఁ భజసనంబులఁ బునర్భజస
 నంబుల భయంబుల కదంబము లయగ్రా
హిం బెనుపునం బుధమతిం బరఁగుఁ బ్రాసనికు
 రుంబకము పాదముల నింబడరు చూడఁ.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు లయవిభాతియనువృత్తము—(న-స-న-న-స-న-న-న-స-న-న-స-గ)

న స న న స నా కలితన స న న స గ ం బుల వి
 లసితతర పాదములఁ బొసఁగు నలు వ్రాలం
బ్రసరితములై యలరుఁ బసలయవిభాతి యన
 రసికులకు వీనులకు నొసఁగు జవు లింపై.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు సప్తత్రింశదక్షరంబు లయహారి యనువృత్తము—(న-న-న-న-న-న-న-న-న-న-న-స-గ-౧౦ పైఁ బ్రాసయతి.

పదునొకఁడు నగణములఁ బొదలి సగణము గురువు
 మృదులపదరచనఁ దగి యొదవి మితివ్రాలఁ
ముదమొసఁగు సభల నని చదువుదురు కవివరులు
 హృదయములఁ జతురతలుగదుర లయహారిఁ.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు త్రిభంగియనువృత్తము—(న-న-న-న-న-న-స-స-భ-మ-స-గ)

లలి న న న న న న ములు ససభమములు నతిసగయుక్తిఁ.
 జరింపం బ్రసరింపం బాటివహింపం
జెలువుగనవకలి నిలుపఁగఁదగునెడ వెలయుఁద్రిభంగి
 సురక్తిం బదభక్తిం బ్రాసనియుక్తిఁ.

మఱియు ననియతపాదంబు - దండకంబు

కృతినాది న స హం బులొండెం దకారంబులొండెం బ్రకల్పించి యామీఁద
 నెల్లం దకారప్రధానంబు గుర్వంతమైత్రాల నిచ్ఛానురూపావధిం
 బేర్మి నిర్మించుచో మించి తత్తద్గణవ్రాతముఁ వృత్త్యనుప్రాసధుర్యం
 బులై యర్థవర్యంబులై మోదితార్యంబులై సాధుసారస్యహార్యం

బులై రీత్యలంకారవంతంబులై పుష్టిమంతంబులై యింపు లంతంత కింపాఱఁ గల్పింపఁగా దండకంబు న్నమన్మండలం బయ్యె రాజేంద్ర కోటీర కోటీతటీన్యస్తదాజ్ఞాగ్ర్యమాణిక్య విశ్వేశ్వరా విశ్వవిశ్వంభరాధీశ్వరా.

మఱియు నీవృత్తములు స్వస్థానార్థసమవృత్తములు బరస్థానార్థ సమవృత్తంబులు నన రెండు తెఱంగు లయ్యె నది యెట్లనిన;

క. ఛందోవృత్తంబుల సమ। సందర్భము లీడుపడఁగ సముచితనికట
చ్ఛందఃపాదంబుల సర। విం దప్పక యుభయరూప వృత్తము లయ్యెన్. ౪

క. స్వస్థానార్ధసమములుఁ బ। రస్థానార్ధసమములును రచనలచే న
ర్ధస్థూలత నిరుదెఱఁగై। సుస్థిరవృత్తములఁ గృతుల సొంపుల నింపున్. ౫

స్వస్థానార్థసమవృత్తము

గీ. మొదలిపాదంబు మూఁడవయదియు వరుసఁ
దద్ద్వితీయచతుర్థ పాదములు నట్ల
సమకవర్ణంబులైన వృత్తములఁ జెప్పఁ
స్వపదజాతార్థసమవృత్త సంజ్ఞ వడయు.

నారీప్లుతవృత్తము

దానోదారశ్రీమతా గానియుక్తిం గానంగఁదాజస్థ గగప్రసక్తిన్
మానై చాళుక్యక్షమాపాలరమ్య స్థానంబునారీప్లుత సంజ్ఞమయ్యెన్.

రతిప్రియవృత్తము

ఖ్యాతశ్రీ మనజరగంబులుండఁగాఁ ద
ద్గతంబులై జభసజగంబు లొందగా
పీతాఘప్రముదితవిశ్వ విశ్వభూపా
ధృతిం దలంప నిది రతిప్రియం బగున్ ౭

అజితప్రతాపవృత్తము

సజసాగణావలిఁ బ్రసన్ననభా। గ్రజరపంక్తి నభిరామరూపమై
యజితప్రతాపవెలువారుఁ గృతి। న్విజయవిక్రమణ విశ్వభూవరా. ౮

పరస్థానార్థసమవృత్తము

గీ. వలయుఛందంబు పాదంబుఁ దొలుతనిలిపి
యొరులఛందంబు పాదంబు నొల నిలిపి

యోలి నెడవెట్టి యీగతి నొనరఁ జెప్ప
వెసఁ బరస్థానసమకార్థవృత్త మయ్యె. ౧౧

అందు మనోహరవృత్తము

చాళుక్యనృపాల తజావములం। గలయ న్నసనావరికల్పితమై
మేలొప్పఁగ జెప్పిన మేదినిలో। విలసిల్లు మనోహరవృత్తమనన్.

కోమలవృత్తము

సలలితరీతి నజాయగణంబుల్। చళుక్యభూప జభసజస్థగస్థితిన్
మలయుచు నర్ధసమర్థతచేత। న్వెలుంగఁ గోమల మనువృత్త మొప్పగున్.

క. ఏకచ్ఛందోవృత్తా। నీకంబులు రెండు రెండు నిలుపుదు రిష్ట
శ్లోకార్థంబుల నోలి వి। వేకులు స్వస్థానవిషమవృత్తంబులకున్. ౧౨

అందు అంగజాస్త్రమనువృత్తము

దానబలేంద్రోదారభమంబుల్। పూనిసగాప్తిం బొంపిరివోవన్
జానార న్మసజంబు గస్థితం। బై నీడంజను నంగ జాస్త్ర మై. ౧౩

వారాంగియనువృత్తము

చళుక్యవంశాజతజల్ గగంబుల్। చెలంగి యర్థంబునఁ జెంది రీతిం
గ్రాలంగఁ దాయత్తజగానియుక్తిన్। మేలయ్యె వారాంగి సమీహితాఖ్యన్.

నదీప్రఘోష మనువృత్తము

భారరంబుల్మెగిం బ్రాగుపేతంబులై। చరించుచుండం జతజస్థరేఫలం
బరత్రిపాదంబులఁ బర్వనొప్పఁగన్। దిరంబుగా మూఁట నదీప్రఘోషమై,

పరస్థానవిషమ వృత్తము

క. అందముగ నుపక్రాంత। చ్ఛందఃపాదంబు లొల సాగెడునికట
చ్ఛందఃపాదంబులతో। నందఁ బరస్థానవిషమమనువృత్త మగున్. ౧౪

అందు శ్రీరమణవృత్తము

ఆరభమవ్యాయత్తసగవ్యా। పారము నాదిమ పాదముసెందన్
జారు భభాగగసంగతిచేతన్। శ్రీరమణంబని చెప్పిరి మూఁటన్. ౧౫

శరభక్రీడావృత్తము

చతుర్వర్ణాధారా యమనసరగవ్యాప్తి నాద్య
ద్వితీయాం త్యాంఘ్రి ప్రస్తుతగతి నతిస్పష్టమైనన్

ఖ్యాతాసక్తిఁ మభనయయ తృతీయాంఘ్రినొప్పఁ
బ్రతిప్రేమోత్పత్తిం బరఁగి శరభక్రీడ యయ్యెఁ. ౧౭

స్వపరస్థానవిషమవృత్తంబులలో వీణారచన యనువృత్తము

చాణక్యనయజ్ఞాత యసన్నగంబుల్। వీణారచనకొందు భవిందససావంబుల్
శ్రేణించజనస్థితభససేవిత నియతిఁ। రాణలనెలపై భస నజరంబు లోలిగఁ.

ఇది వివిధవిషమవృత్తలక్షణము

క. ఛందః ప్రస్తారక్రమ। సందృష్టంబైన వృత్తసంఘములో నొ
ప్పందము లగుపాదంబులఁ। బొందింపఁగ విషమవృత్తపుంజము లడరుఁ.

క. మాత్రాగణరచనలకుం। బాత్రములై నెగడి యంధ్రభాషాకవితా
మిత్రములై రసభావా। మత్రములౌ జాతు లెఱుఁగ మంచిది కృతులఁ. ౨౧

కందములు

క. అందును గందంబులు నా
నందంబులు భజసనలగగాఖ్యలచే వా
నిం దగు నెఱుఁగం బ్రాసము
ముందుగ నిడి మూఁడు నైదు మూఁడునైదుఁ. ౨౨

క. ఆదిమవర్ణము వళి నిడు। పై దొరకినఁ గుఱుచయైన నట్టుల తత్త
త్పాదాదుల నిలుపందగు। గాదిలిగాఁ జెప్పఁదలఁచు కందంబులఁ. ౨౩

క. నిడుదలగు పాదములకును
వడి నాలవగణము మొదల వలయు నిలుప న
క్కడలను గురువును మూఁడవ
యెడ నలజలలోన నొకటి విడ బెడఁగడరుఁ. ౨౪

క. *ఇందు పుర బాణనగముల। కందువ జగణంబు నిలుపఁగాఁ గా దెపుడుం
గందములకు నార్యాదుల। చందం బధికంబు వానిఁ జనుఁ దెలియంగఁ. ౨౫

క. కందము నర్ధంబులతుద
నందినగురు వుడుపఁ బథ్య యగు నాఱవచోఁ
జెందిన జగణము లత్వముఁ
బొందిన నది యార్యయనఁగఁ బొసఁగుంగృతులఁ. ౨౬

---

* ఇందు = 1, పుర = 3, బాణ = 5, నగములు = 7

క. క్రమమునఁ బథ్యార్యార్ధము
లమరంగా వీడుపడిన నది గాథాభే
దముగాఁగం బరఁగు ప్రపం
చము తెనుఁగునఁ జెప్పరంధ్రు చతురులు కృతులన్. ౩౧

సీ స ప ద్య ల క్ష ణ ము

క. భావరసాలంకార। ప్రావిర్భూతాంధ్రకావ్యఫణితులకును ర
మ్యావాలము లగుసీసగ। ణావళిలక్షణము లెఱుఁగనగుఁ జతురులకున్. ౩౨

క. నలనగసలభరతగణం। బులు నసహంబులును ననఁగఁ బొలుపగు సీసం
బులు గీతులు, వానఁగదా। యలవఱపఁగవలయుఁ గృతుల కందం బరయన్.

క. ఒకగురువు రెండులఘువులు। నకలంకత సమమ కాన హనములు దమలో
నొకఁడొకఁడు వీడుపడుచున్। వికటింపక చెల్లు నొక్కవృత్తము తక్కన్.

క. అమరంగ విషమసీసము। సమసీసము లనఁగఁ రెండుచందము లందున్.
భ్రమితమగు విషమసీస। క్రమ మెఱుఁగఁగవలయుఁ జతురకవిజనములకున్.

గీ. హగణనగణంబు లేడు గుర్వంతమగుచు
విస్తరిల్లిన నుత్సాహవృత్తమయ్యె;
దీనితుద గీతియొకఁడు సంధింప విషమ
సీస మిత్తెఱఁగెఱుఁగుట చెలువుమతికి.

ఉత్సాహము. ఓసరించుఁ బజ్జ లజ్జ లుజ్జగించు రాజులన్
వేసరించు గర్వపర్వవేషభూషితారులన్
వాసవానుకార వీరవర్య విశ్వభూప నీ
భాసురాసిధేనుకానుభావ మాహవంబులన్. 33

వి ష మ సీ స ప ద్య ల క్ష ణ ము

గీ. వడి దనర్పఁ బ్రాసవైభవం బలరార। నిట్ల గణనిరూఢి నెసక మెసఁగఁ
గీర్తితాతిమధురగీతియుఁ బైగల్గ। నదియ విషమసీసమంధ్రు కృతుల.

స మ సీ స ప ద్య ల క్ష ణ ము

గీ. వెలయు సమసీసములు పంచ విధములయ్యె
నరయ నవకలిసీ సాహ్వయంబుఁ, బ్రాస
సీస, మక్కిలిప్రాససీసాఖ్యసీస
ము, వడిసీస, మక్కిలివడిసీసమును ననంగ. ౩౪

క. తనపాదంబులు నాలుగు। మొనసిన పైగీతిపాదములు రెండును గా
వినుమూఁడై సీసమునకు। జను నడుగులు వ్రాలు వళ్లు సరి యిన్నిటికిన్. ౩౬

### అవకలిసీసము

క. అలవడిసీసము పాదము। నలుతునుకలు చేసి మూఁట నలనామగణం
బుల రెంటి రెంటి విడి య। వ్వలితునుక సహంబు లిడఁగవలయు న్వరుసన్.

సీ. సామంబుచేఁ దుల్యభూమీశ్వరులు దన, తోడిమిత్రతకు సత్త్వాడుచుండ,
దానంబుచే నతిమానమానవనాథు లేర్పడ నక్కఱఁ దీర్పుచుండ,
భేదంబుచేత దుర్మోదమహీశు లందంద సంక్షిప్తత నొందుచుండ,
దండంబుచేత నుద్దండమాండలికు లాజ్ఞాచక్ర మౌదల మోచియుండ,

గీ. శశ్వదనురక్తిఁ జాళుక్యవిశ్వవిభుఁడు,
వాలి వసుమతి లీలమై నేలుననుచుఁ
జెప్ప నవకలిసీస మిట్లొప్పువండ్రు,
పూని గావ్యకళావేదులైన కవులు ౩౭

### ప్రాససీసము

క. సీసమునకు నాలుగడుగులఁ। బ్రాసము లిడి యోలి సర్వపదఖండములన్
భాసురముగ వళ్ళలవడఁ। జేసిన నది కృతులఁ బ్రాససీసం బయ్యెన్.

సీ. చక్రవాళాచల చంద్రకాంతములకు సంతతార్ద్రత్వంబు జరపి జరపి,
చక్రిశలోక సంచర దురు సంతమసంబుల వడిఁ బాఱఁ జదిపి చదిపి,
శక్రేభశంకరశంకరాచలశశి చారుదీధితులపైఁ జాఁగిచాఁగి,
చక్రస్తనీకుచ సాంద్ర చందనరసచర్చలపైఁ గేలి సలిపి సలిపి,

గీ. విక్రమప్రతాప విశ్రుతమూర్తియై। విశ్వభూమివిభుని విశదకీర్తి
ప్రక్రమప్రసక్తిఁ బ్రసరించు నని చెప్పఁ। బ్రాససీస మనఁగఁ బరఁగు నెందు.

### అక్కిలిప్రాససీసము

క. తుదిగీతి నాలుగడుగులు। వదలక ప్రాసంబు నిలిపి వళ్లింపారం
గదిరినఁ గదురకయున్న। న్నది యక్కిలి ప్రాససీస మనఁగాఁ బరఁగున్.

సీ. క్రమయుక్తి విద్యల కందువ యెఱుఁగుచుఁ, గవులనే ర్పారసి గారవించి,
సమరసంక్రీడనక్షమసుభటాటోప సంచారములకు నుత్సాహమూఁది,

నమితాహితక్షమానాథులరాజ్యంబు నానాఁటి కొనర నున్నతముచేసి,
ప్రముదితారాతుల భంజించి వేలుపుం బడఁతుల కింపారుపతులఁ జేసి,

గీ. విమలకీర్తుల దిక్కులు విప్పనేర్చు । శమితవిమతుండు విశ్వేశచక్రవర్తి
సముచితంబుగ నని చాల సన్నుతింప । నమరు నక్కలిప్రాససీసాహ్వయంబు.

వడిసీసము

క. ఏపాదమునకు నేవడి । యాపాదింపంగఁబడియె నది ఖండములం
బ్రాపింపఁ జెప్పఁగ వళిని । రూపితసీసంబు నాఁగ రూఢికినెక్కున్, ౪౩

సీ. గ్రహదంష్ట్రి సోఁకని గ్రహరాజు, ప్రియవచఃకథనంబు నేర్చినకల్పభూజ,
మలరుఁదూపులు కేల నంటని కందర్పు, డమ్ముచే నింకని యంబురాశి,
కన్నులు పెక్కులు గల్గనియింద్రుండు, కళకేది వంగని కనకనగము,
తనువెత్తి క్రాలెడు ధర్మదేవత, రూపుఁ దాల్చిన రాజవిద్యావిభూతి,

గీ నయవిదుండు రాజనారాయణుఁడు విశ్వ
నాథుఁ - డనుచు వర్ణనములుసేయ
వరుస నిట్లు కృతుల వళిసీస మన నొప్పు
వసుధ వైభవాలవాల మగుచు. ౪౪

అక్కలివడిసీసము

గీ. సీసఖండంబు వళ్లిట్లు చెప్పి గీతి
ఖండవళి రెంటి కొక్కఁడుగా నొనర్ప
నదియ యక్కలివడిసీసమండ్రు కృతుల
లక్ష్యములు చూచి యెఱుఁగుఁ డీలాగు లెల్ల. ౪౫

క. సీసములకు గీతులకుం । బ్రాసములును వళ్లుఁ గలయఁబడి కవితల ను
ద్భాసిల్లఁ దఱచు నియమ । వ్యాసక్తియుఁ గలుగుఁ జెప్పవలసినచోటన్, ౪౬

గీతిభేదములు

గీ. ప్రవళినాఁ బ్రసన్న పదినాఁగ గీతులు
సీసములను రెండు చెందుఁ దుదల,
నాటవెలఁది యనఁగఁ దేటగీతి యనంగ
వానిపేళ్లు వేఱ వలయుఁ దెలియ. ౪౭

ఆ. మూఁడు నగణ హగణములు, రెండు నలనామ
కములు, హగణపంచకంబుఁ గూర్ప,
నాటవెలఁది యడుగు లంబునిధులపట్ల
వ్రాలు వళ్లఁ-జెంది వఱలెనేని. ౪౮

గీ. నగణమొక్కండు మఱి నలనామకములు
రెండు నగణంబులును దుద రెండునాలు
గడుగులను దేటగీతికి నబ్ధివిరతి
వలయు వళ్లైన వ్రాలైన వరుస నిలుప. ౪౯

మే ల న గి తి

గలము రెండునగణములును గలసి ప్రాస మెఱయఁ
జెలువు దోఁప నెత్తుగీతి వెలయుఁ గృతులయందు
నోలి నగణ మొండె హగణమొండె నేడుచేసి
నాలుగడుగులందు నిలిపి నళవుదోఁప విరతి
వాలి పంచమస్థ యగుచు వచ్చెనేని యొప్పు
మేలనాభిధాన మైన మేలుగీతి కృతుల. ౫౦

త రు వో జ

నలనామకంబులు నగణాంతములుగ నాలుగంఘ్రులయందు నాలుగుఁగూర్చి
వళులు మూఁడెడలను వరుసతో నిల్ప వలయు మూఁడవగణవర్ణంబు మొదల
విలుపంగ విధి నిర్మించి విశ్వ నృపతికి నిచ్చిన వింపుసొంపారుఁ
దలకొని తగఁబ్రాలు దంపెడిచోటఁ దరుణులచే సొంపుదనరుఁ దర్వోజ. ౫౧

ఇం ద్రా ది గ ణ ల క్ష ణ ము

గీ. ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల । నైనగణము లినసురాధిపేందు
గణము లక్షరోపకరణంబు లవి యాది । లఘుగణంబు మొదల లఘువునిలుప.

| సూర్యగణములు | ఇంద్రగణములు | చంద్రగణములు | |
|---|---|---|---|
| U I | I I I I | U I U U | I I U U I |
| I I I | I I I U | I I I U U | U I U I |
| | I I U I | U U I I | I I I U I |
| | U I I | I I U I U | U U I I |
| | U I U | U I I U | I I U I |
| | U U I | I I I I U | U I I I |
| | | U U U I | I I I I I |

### అక్కర (ల) లక్షణము

వ. ఇత్తెఱంగున రవీంద్ర చంద్రాఖ్యగణంబులలోన సప్తగణకల్పనీయంబై మహాక్కరంబు, షడ్గణకల్పనీయంబై మధ్యాక్కరంబును, బంచగణకల్పనీయంబై మధురాక్కరంబును, జతుర్గణ కల్పనీయంబై యంత రాక్కరంబును, ద్విగణకల్పనీయంబై యల్పాక్కరంబును నా నక్కర వృత్తజాతంబులు పంచవిధంబులు బరఁగు నందు. ౫౩

### మహాక్కరం బెట్టి దనిన

వారిజాప్తుండు పంచేంద్రగణములు వనజారియును గూడి వెలయుచుండ
నారయ రెండవ నాలవచోట్ల నర్కుండయిననుం దనర్చుచుండఁ
గోరి యవ్విడిపంచమగణమునఁ గూడి మొదల నిలుపంగ నగు
సారమై ప్రాసవడి సప్తగణములు సాఁగ మహాక్కర యతిశయిల్లు ౫౪

### మధ్యాక్కరం బెట్లనిన

వరుసతో దేవేంద్రసూర్యవజ్రిరవుల......
విరచించి నాలవపట్టు విశ్రాంతి సదనంబుచేసి
తరబడిఁ దప్పక చెప్పఁ దగునంద్రు మధ్యాక్కరంబు
కరవాలభైరవు పెంపు గణషట్కమున నుతియింప. ౫౫

### మధురాక్కరం బెట్లనిన

తరణి వాసవ త్రితయంబు ధవళభానుయుతి నొంద
విరతి విశ్రాంతి నాలవనెలవున నింపుమీఱ
సరసమధురార్థములఁ జెప్పఁ జను మధురాక్కరంబు
వరుసఁ బంచగణములను వాలి కృతుల వెలయు. ౫౬

### అంతరాక్కరం బెట్లనిన

కమలమిత్రుండు సురరాజగణ యుగంబు
కమలశత్రునితోఁజెంది కందళింప
నమరుఁ బ్రావళ్ల నర్థంబు నతిశయిల్ల
నమల మగు నంతరాక్కర మబ్ధిసంఖ్య. ౫౭

### అల్పాక్కరం బెట్లనిన

*సుమనఃపతియుగము సోముండును। నెమకంగఁ బ్రావళ్లు నిండిమీఱ
గమనీయవిభవంబుగాంచునెప్డు। రమణీయ మల్పాక్కరము కృతుల.

* ఇది గీతపద్యమువలె నున్నది.

షట్పది

సురపతులిరువురు సురపతులిద్దఱు । సురపయుగమ్ముతో సోముండును
బరువడిఁబెనఁగొన నదురుగ షట్పది । సరిఁబ్రాసబుంలు దనరారంగను.

చౌపది

భ స గానల ములపైని గరంబు । న్నెనఁగఁగ మూఁడవయెడ విరమంబుం
బొసఁగినఁ జౌపదిఁబొలుచు రసంబుం । గసవరముగఁదగుఁగదప్రాసంబుల్.

త్రిపది

త్రిపదికి రొకయంఘ్రి నింద్రులు నలువురు ।
ద్యుపతులిద్దఱు సూర్యులిర్వు రౌల । ద్యుపతిద్వయార్కులునౌల. ౬౧

ద్విపది - మంజరి

శక్రత్రయంబును సవితృండుఁ బాద । విక్రీడితులు మృదుద్విపదికి నెపుడు
వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని । వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి.

షట్ప్రత్యయములు

గీ. నచ్చి [1]ప్రస్తార [2]సంఖ్యాన [3]నష్టములును
నౌల [4]నుద్దిష్ట [5]లగకర [6]ణాధ్వములును
ననఁగషట్ప్రత్యయము లిందుఁదనరు వాని
నెఱుఁగనేర్చుట ఛందంబు నెఱుఁగునేర్పు. ౬౩

1 ప్రస్తారము

క. గురుపంక్తి నిలిపి మొదటను
గురువునకుం గ్రింద లఘువుఁ గొని దానిపయిన్
సరిచేసి పిఱుఁద గురులిడి
పరువడి లఘ్వంతమైనఁ బ్రస్తారమగున్ ౬౪

2 సంఖ్యానము

క. గురుపంక్తి మొదల రెండిడి
వరుసను రెట్టింపఁ దుదకు వచ్చిన సంఖ్యా
పరిమాణము తచ్ఛందో
విరచితవృత్తములుగా వివేకింపఁదగున్. ౬౫

3 నష్టము

గీ. అరసి వృత్తసంఖ్య నర్థించుచో సరి
యైన లఘువు విషమ మైన గురువు
గాఁను చు జేసి నొకఁడుగూడి యర్ధముసేయ
నవధి నష్టవృత్త మబ్బునండ్రు. ౧౨

4 ఉద్దిష్టము

క. వలసిన వృత్తగణాలి మొ
దల నొక్కఁడు నిలిపి తుదకుఁ దగ రెట్టింపం
గలలఘువుల పై లెక్కలు
నొలయఁగ మఱియొకఁడుగూడ నుద్దిష్టమగుఁ. ౧౩

5 లగక్రియ

క. ఎక్కువయొకఁడుగ వృత్తపు
టక్కరముల దొంతిపేర్చి యట మీఁదటికై
యొక్కొక్కఁడ విడిచి యెన్నిన
లెక్కలు గురులఘువిమిశ్ర లిఖితగణంబుల్. ౧౪

క. ఆలెక్క లన్ని యెన్నిన
లోలత లఘువులును గురువులును గలిగెడు వృ
త్తాలి నవి గలయఁ గూడిన
నోలిం దద్వృత్తసంఖ్యయును నొనఁగూడుఁ. ౧౫

6 అధ్వప్రక్రియ

గీ. వృత్తసంఖ్య నిడుపు వెడలుపు రెట్టించి
వాని నొక్కఁ డొకఁడు వరుస నెన్న
నెన్ని యయ్యె నన్ని యెసఁగు నంగుళ లవి
ప్రస్తరింప నిడుపు పరఁగు విప్పు. ౧౬

శా. ఆందంబై శ్రుతిమూలమై విలయసదుద్యత్సర్వలోకాశ్రయా
నందంబై సమవృత్తమై వివిధవర్ణశ్లాఘ్యమై సద్రస
స్యందంబై బహువిశ్రమంబయి భవచ్చారిత్రముంబోలె నీ
ఛందశ్శాస్త్రము పర్వు నుర్వరను విశ్వక్షోణిపాలాగ్రణీ. ౧౭

శా. * కావ్యాలంకృతికల్పనక్షమకళాకల్యాణ కల్యాణపూ
ర్ణవ్యాపారసమృద్ధ యుద్ధవినమద్రాజన్య జన్యస్థల
క్రవ్యాదావళిగీయమానవిజయప్రారంభ రంభాదిరం
తవ్యస్త్రీసుఖవృత్తి సుందరసపత్నస్తోత్రపాత్రోదయా. ౭౨

క. నిఘ్నాఖిలశోభన వృత్రఘ్న మహాత్తరవిభూతి రంజితజంఘా
దఘ్నారినవ్యజయ నిర్విఘ్నోన్నదయసదయవినుత విశ్వాసనిధీ, ౭౩

మాలిని

స్తుతహిమకరజూటా చూర్ణితద్విట్కిరీటా
ప్రతతగుణపరీణా పంచధారాధురీణా
సితకరకులదీపా స్నిగ్ధబద్ధప్రతాపా
సతతలసదభిఖ్యా సర్వలోకాశ్రయాఖ్యా. ౭౪

గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితం బైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబు
నందు ఛందోగణ జన్మశుభాశుభ నిరూపణ వివిధవళి
ప్రాస ప్రపంచలక్షణ సమవృత్తజాతికల్పన
షట్ప్రత్యయదర్శనాది సముద్దేశంబునం
దష్టమోల్లాసము.



* ముక్తపదగ్రస్తము. దీని నీకవి శృంఖలన్యాయబంధమని చె
చూ. 'ధరణీశుతంబుచే' 6-20.

# నవమోల్లాసము[1]

## వ్యాకరణము

క. శ్రీవిశ్వేశ్వర విజయ శ్రీవిక్రమహార్మ్యబాహుశిఖర బుత్కోత్తీ
శ్రీవిశ్వగహ్వారీస్తుత శ్రీవిభ్రమదాలయప్రసిద్ధవిభూతీ ౧

క. [2]భవదనుమతి సూరిసుఖ। ప్రవణం బయినట్టి యంధ్రబంధురరుచిమ
త్కవితాస్పద మగుపలుకుల। వివరింతుం దెలియఁ బెక్కువిధములు జగతిన్. ౨

క. యుక్తివిశేషము కబ్బం। బుక్తివిశేషంబు గాదు యోగ్యునకైనన్
యుక్తివిశేషము సాధ్యం। బుక్తివిశేషం బసాధ్య మూహింపంగన్. ౩

మ [3]విలసద్భావరసాద్యలంకృతులచే విప్పారి, గీర్వాణభా
షల కబ్బంబుల కెన్నిమంచితనము ల్పొందిల్లు నాచందమై,
వళియుం బ్రాసము నంత కగ్గలములై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁగంచుం జెవిఁ బెట్టలేమి యదుపం దేఁగల్గునే మందిలన్. ౪

క. ధరశ్రీపర్వతకాళే। శ్వరదాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం। బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జనుఁ గృతులన్. ౫

---

1. ఆంధ్రవిశ్వవిద్యాలయవారి భాండాగారములో M S 32906 - TO, 1 P 32 సంఖ్య గల తాళపత్ర ప్రతి ఈ నవమోల్లాసముమాత్రమే గలది కొన్నివ్యత్యాసములతో దొరకినది. అందలి పాఠములను కొన్నిఁటిని సూచించుచున్నాఁడ. వే. వేం.

2. పద్యములు ౨, 3, ౪, ఈ ప్రతిలో కానరావు.

3. తొలి తెలుఁగు కావ్యములు గీర్వాణ కావ్యానుకరణము లనుట స్పష్టము. నాఁటి కింకను ఆంధ్ర కావ్యములపై ఆదరణ తక్కువే.

గీ. తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ
దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె,
వెనుకఁ దెనుఁగుదేశమును నంధ్రుకొందఱ
బ్బాస పంచగతులఁ బరఁగుచుండు. ౬

గీ. తెలుఁగు దేశభాష తెలియఁ బొమ్మనఁబోక । తెలియవలయు మించు తేటపడఁగఁ
దొడవు గాక పసిఁడిఁ దొడిగిన నొప్పునే । కనక మింత నెంత కలిగెనేని. ౭

గీ. విశ్రుతులు హేమచంద్రత్రివిక్రమాదు
లొనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ,
నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయమ కాన
వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ. ౮

క. స్వరములు నచ్చులు ననఁగా । నరయ నకారాదిసంజ్ఞ నయ్యక్కరముల్
దిరముగ హల్వ్యంజనములు । వరుసఁ గకారాదిపంచవర్గాక్షరముల్. ౯

క. యరలవ లంతస్థలు నా । నురవగు శషసహలు వొలుచు నూష్మ లనంగాఁ
బరువడిఁ బ్రయోగములయెడ । విరచింపుడుఁ దెలియవలయు వీని తెలుంగుల్. ౧౦

క. భువిలోఁ దత్సమమును ద । ద్భవమును సహజాంధ్రదేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యము నాఁ బం । చ విధములై తెలుఁగుఁబలుకుజాతము పరఁగుఁ.

తత్సమలక్షణము

గీ. పరఁగ సంస్కృతంబుపైఁ దెనుంగువిభక్తు । లునుపఁబడి పొసంగి యుండెనేని
తత్సమంబు నాఁగఁ దగునంధ్రు సుకవులు । తద్విహీనకావ్యతతియు లేదు. ౧౨

చ. పరమవిశేషిమంతు లగుపార్థివకోటికి విశ్వమేదినీ
వరుదెస నాగ్రహంబుఁ జిరవైరము సత్యవిహీనవృత్తముఁ
బిరుదమదంబుఁ గైతవము భేదవిధానము దుర్ణయంబు మ
త్సరమును వర్జనీయ మనఁ దత్సమమై చను నంధ్రభాషకుఁ. ౧౩

తద్భవలక్షణము

క. వదలక సిద్ధాక్షరములఁ । బొదివినవర్ణములఁ దూలిపోఁ బలుకఁగ న
ర్థదమై ప్రాకృతసిభ మగు । నది తద్భవపదము నాఁగ నభినుత మయ్యెఁ. ౧౪

సీ. యజ్ఞంబు జన్నంబు యతనంబు జతనంబు
 చంద్రముఁ డనుపేరు చందమామ,
యోధులు జోదులు [1]యోగులు జోగులు
 భేదంబు బిందంబు పృథివి పుడమి,
విష్ణుండు వెన్నుండు వెజ్జు నా వైద్యుండు
 పుస్తంబు పొత్తంబు ప్రోడ ప్రౌఢ,
కుబ్జుండు గుజ్జుండు కుక్క కుర్కురమగు
 శయ్యయు సెజ్జ నా జాది జాతి,
యనెడు పల్కులు తద్భవాహ్వయము లండ్రు
వీని నిన్నిటి నెఱిఁగి వివేకబుద్ధి
గబ్బములు చెప్పుకవుల చక్కదనము మెచ్చు
విపులవిద్యుండు చాళుక్యవిశ్వవిభుఁడు. ౧౫

[2] దేశ్యలక్షణము

క. శ్రేయములై బహుదేశా। నేయములై చక్కఁదనము నెఱదనములు నై
యాయానెలవులఁ జెవులకుఁ। దీయము లగుపలుకులెల్ల దేశ్యము లరయన్. ౧౬

సీ. వాలాయ మాలంబు వంగడ [2]మంగడ
 సోలంబు చొక్కులు సోయగంబు
విన్నను వెన్ను వావిరి వంత వాగెంబు
 డెందంబు డిప్పాడి డిల్ల పాటు
నెమ్మోము నెత్తమ్మి నెలఁత క్రొన్నెల [3]కొమ్మ
 లావడి యొయ్యార మారజంబు
పొక్కడు నెవ్వఁగు పొచ్చెంబు మచ్చిగ
 యక్కజం బచ్చెరు వక్క నిక్క
గీ. వెలఁది చిగు రెల్లి వేనలి వేనవేలు
నాఁగఁ జనుశబ్దములు దేశినామకములు,

---

1. యోగంబు జోగంబు, 2. ఈ ప్రతిలో అచ్చతెలుఁగు లక్షణము తర్వాత దేశ్యలక్షణము ఉక్తము. 2. మంగడ సోలుట చొక్కట. 3. క్రొమ్ముడారడి,

వీనఁ జెప్పినకవితల వినుచు మెచ్చు
జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి. ౧౩

అచ్చతెలుఁగులక్షణము

( ఈకవి జాను తెనుఁగను పేరెత్తఁడు, ఏలనో! )

క. ఈమూఁడు తెలుంగులలో। నేమిటనున్ దొరలకున్న నెల్లజనులకున్
లో మిగులఁ దేటపడియెడు। నామాటల యచ్చతెనుఁగు లన నెగడొందుజా.

ఉ. ఎనుములు గుఱ్ఱము ల్మొదవు లెద్దులు బండులు పందు లుప్పు బి
ప్పనుములు [1]కొల్లు లాముదము లాకులుఁ బోఁకలు నేయి నూనె యే
పునఁ బెనుపొందు విశ్వవిభుప్రోల ననం దగ విన్న వారికిజా
మనమునఁ దేటగాఁ దెలియుమాటల యచ్చ తెనుంగు నాఁ జనుజా. ౧౯

గ్రామ్యలక్షణము

క. ఈసడములు గోరడములు। గాసరబీసరలు నైనకట్టిఁడిపలుకుల్
ఖాసిల్లు గ్రామ్యములు నా। హాసోక్తులఁ దెగడుచోట [2]నవియును నొప్పున్.

సీ. ఊసలు వేసలు వేసాలు దోసాలు దోసలు వేదాలు గానడాలు,
బొందలు [3]గుద్దలు బొక్కలు గుండలు గంతలు మొదలైనకారకములు,
దాని గొంచారమ్మి దీని గొంటూ బోకు మేనూను నీవూను యేగవలయు,
[4]పాడేము సూసేము పైలురా గాసేము వాసేవు సేసేవు లేసిరాకు,

గీ. మనెడు క్రియలును మొదలైనయట్టిగ్రామ్య
శబ్దములు [5]శబ్దములుగాఁగ జనవుమెఱపి
కవుల మనుకొను నయ్యూరఁగవుల కైపు
వివిన నగకున్నె చాళుక్య విశ్వవిభుఁడు. ౨౧

తత్సమశబ్దపరిజ్ఞానము

గీ. వెలయుసంస్కృతంబు తెలిఁగించుతెలుఁగు సం
ధులు విభక్తిచయ విధులు సమాస
తద్ధితములుఁ గ్రియలు తగుభంగి నెఱిఁగింతు
నమరశాస్త్రసరణి ననుసరింప. ౨౨

---

1. కొఱ్ఱు. 2. నవియున్వ్యలయుజా. 3. గొందులు బొందలు గుంటలు.
4. పారేవు మూసేవు పైలారగాసేవు డాసేవు. 5. గాంగ నెప్పుడు.

అ జ ం త ప్ర క ర ణ ము

క. నిడు పుడుపవలయు సంస్కృత। మెడపక లింగములు మూఁట నేకాక్షరముల్
విడిచి యజంతాదుల కీ। నడక యవశ్యప్రయోజనము తెనుఁగునకున్. ౨౩

క. బిందువిసర్గంబులు గడ। నందిన పొల్లులను దక్కి యంధ్రవిభక్తుల్
పొందుగ సంస్కృతపదముల। ముందటిదెస నిలుప నందముగఁ దెనుఁగయ్యెన్.

క. స్థావరతిర్యక్పదములు। దేవమనుష్యాదికములుఁ దెనిఁగించునెడన్
వావిరి నజంతములతుదఁ। [1]గావించు ముకారమును డుకారము ననికిన్ ౨౫

గీ. దానకల్పకుజము దర్పోగ్రసింహమ్ము। రజనికరుఁడు కాంతి విజయుఁ డాఁడు
దనరు విశ్వనాథుఁడన నకారాంతశ। బ్దములఁ దెనుఁగుపఱుచు భంగులయ్యె.

క. రవి యరితిమిరాపహతిం। బవి పరగిరినిహతి, రసవిభావప్రతిభం
గవి, విశ్వేశ్వరుఁ డనగా। భువిసీద్వయమునకు నిదియపో తెనిఁగింపన్. ౨౭

గీ. ఇల నుకారాంతపదములఁ దెలుఁగుసేయఁ
గడ వుకారంబునుండు డుకారముండు,
రాజనారాయణుఁడు నృపప్రభు వనంగ
విశ్వనాథుం[2]డు నృపులకు విభుఁడనంగ. ౨౮

క. మను కటు పటుశబ్దాదుల। నొనరింప డుకార మెపుడు నుండదు కవితం
దెనిఁగిం[3]చి చెప్పుచోటం। దనరు వుకారంబ యర్థదాయక మగుచున్. ౨౯

గీ. మనువు ధర్మ శాస్త్రమతమున, మిక్కిలి। కటువు బిరుదవినుతి కర్ణములకుఁ
జాలఁ బటువు ధరణి సంగీతసాహిత్య। [4]సరణి విశ్వనాథచక్రవర్తి. ౩౦

క. వెలయు ఋకారాంతపదా। దులఁదెనుఁగుగఁ జేయుచోటఁ దుదినిడుపులు గు
జ్జులు పేయందగు, నృపులకుఁ। జలుక్యపతి కర్త భర్త సంహర్త యనన్.

క. [5]స్త్రీలింగంబుల నిడుపులు। వాలాయము నుడుపఁ దెనుఁగువచనములగు నం
దాలోలస్త్రీహ్రీశ్రీ। ధీ లనులపితములు దక్కఁ ద్రిక్కనవెల్లన్. ౩౨

క. స్త్రీలకు మదనుఁడు, విజయ। శ్రీలకు రఘురాముఁ డెపుడు, హ్రీలకు నుచితా
వాలము, నిజపాలితభూ। ధీలకుఁ దగుపదము రాజదేవేంద్రుఁ డిలన్. ౩౩

---

1. గావింపు. 2. డెధారుణీ. 3. చుచోటదుదలం. 4. విద్యలకు జళుక్య శ్వవిభుఁడు. 5. పద్యములు ౩౨, ౩౩, ౩౪, ౩౫ ను ౩౭ వ తర్వాత నున్నవి.

క. శ్రీవిష్ణువర్ధనాఖ్య। క్ష్మావరుభూమిరవెపుడును మాకు ననంగా -
భావగు నేకాక్షరశ। బ్దావలి యప్పిఱుఁద నొకరుఁ డంటకయున్నన్. ౩౪

క. వనితా యనుచో వనితయు। జననీ యని పలుకుచోట జననియును వధూ
యనుచోట వధువు తెనుఁగున। జనునాయీయూలుతుదలఁ జను పలుకులకున్.

క. ఐకారాంతము లోకా। రౌకారాంతములుఁ దెనుఁగు లైనప్పుడు పూ
ర్వాకృతితోడన యుండును। నోకారాంతంబుపై బహుత్వము నొందున్, ౩౬

క. రై వరగును నడుగోవున। గోవులు విదుకంగ గ్లౌనికులనృపతులు ధ
ర్మావిష్కృతిఁ బడయుదు రనఁ। గా వెలయుఁ గవిప్రయోగగతిఁ దెలియంగన్.

వ. ఇది యజంతంబులు తెనిఁగించు తెఱం; గింక హలంతవిధియు నెఱిఁగింతు.

## హలంత ప్రకరణము

క. భూభుగ్విరాట్పదంబులు। శోభితముగఁ దెనుఁగుపఱుచుచోఁ దుదపొల్లుల్
ప్రాభవమతివర్ణములగు। భూభుజులు విరాజు లఁగఁ బొలుపై యునికిన్. ౩౯

క. బలవన్మతిమత్పదముల। తలనున్ననకార మెడలుఁ దగ దెనుఁగగుచో
బలవంతుఁడు మతిమంతుఁడు। చణుక్యపతి యనఁగ సర్వశాస్త్రములందున్. ౪౦

గీ. ద్విట్పదంబు వేదవిత్పదంబును దిక్ప। దమును బూర్వవర్ణతను భుజించు,
విద్విషుండు నాఁగ వేదవిదుండనఁ। దూర్పుదిశ యనంగ నేర్పరింప. ౪౧

క, చేరు నకారాంతముల డు। కారముఁ దెనిఁగించుచోటఁ గరినాత్ముఁ డనన్
దారుణకర్ముఁ డనంగను। మేరుమహాధన్వుఁడన నమృతధాముఁదనన్. ౪౨

గీ. వలసినపుడు శర్మవర్మశబ్దంబుల। పైడుకార మెక్కుఁ బాసిపోవు
రామశర్ముఁ డనఁగఁ గామవర్ముఁడనంగ। వసుధశర్మయనఁగ వర్మ యనఁగ.

## సంధిపరిచ్ఛేదము

వ. ఇది సంస్కృతపదంబుల కాంధ్రీకరణం బింక నజంత హలంతసంధు
లనంగ రెండుదెఱంగు లయ్యె నందు నజంతసంధి యెట్టి దనిన. ౪౪

గీ. ఆదిశబ్దాంతవర్ణంబు నంత్యశబ్ద, పూర్వవర్ణంబుతోఁ గూడఁ బొత్తుచేత
సంధియగుఁగారకక్రియాసంగతములు। పెక్కురూపంబు లవి గానిపింతుఁదెలియ

గీ. తెలుఁగుబలుకులు వెలిగాఁగ దివిజభాష। లమరఁదెనిఁగించునప్పుడు నచ్చుతోడి
వ్యక్తులై యుండునయకాని వానితోడి। వర్ణవర్ణైకభావంబు వలనుగాదు. ౪౬

క. అచ్చుతుదియచ్చు పట్టున। వచ్చి యకారంబు నిలుచు వలసినయెడఁ దా
నచ్చయి యిత్వోత్వంబుల జొచ్చు। బ్రచితార్థవాదసూచక మగుచుఁ. ౪౮

క. వేయిచ్చుట యావులయెడఁ,
జేయుడుపమి యరుల యెలమి సిదుముట యిలయుం
బాయకయేలుట యేచుట
యీయధిపతి కొనరు నాఁగ నివి లక్ష్యంబుల్. ౪౯

క. బోయితి వపుడప్పుడు నీ। వీయని కేతెంచి తేయు మేయు మనంగాఁ
బాయక యేయేయనఁగా। నీయుభయముఁ జెల్లుఁగ్రియల నిడ నొక్కొకచోఁ.

గీ. ఒనర సంబుద్ధి నోతండ యనఁగ నోతఁ,
డనఁగఁ బూనిన వీని కనర్థ మగున
యర్థ మిమ్మిమ్ము కొమ్మమ్ము మనెడుచోట
నూఁదు జెప్పుడుఁ దెనుఁగున కుచిత మరయ. ౫౦

గీ. అట నుకారాంతషష్ఠిపై నచ్చు మొదల
నొనరఁ బొల్లనకారంబ యుండవలయుఁ
[1]బోతునూ రేతునాలు నాఁబోలుఁగాని
నగియుఁ బోతూరు నేతాలు నాఁగఁ జనదు. ౫౧

గీ. అచ్చికారాంతషష్ఠిపై నడఁగుఁ బొడము। [2]నింటి దింటిది యనఁజెల్లు నెల్లకడల
[3]నర్థిదర్ధిది యననొప్పు నంధ్రకవితఁ। గవులయనుమతి నిదియును గానవలయు.

క. అచ్చులపై హల్లుండిన। నచ్చుండినఁ దద్ద్వితీయ కపుడు నకారం
[4]బచ్చుడిగి హల్లులుండిన। మచ్చికమైఁ బోవువచ్చు సుఱియొక్కొకచోఁ. ౫౩

[[5]క. భువి నైనికెగంటి ని కెగురువునకు సంధునకు బిరుదదూరునకారం
బివి అంతంబులపైనిం దవిలిన బహువచనయుక్తిఁ దనరకయున్నఁ.

1. కొడుకునాల్గూఁతు నొడమినాఁగూడు, కూంతొడ మెకొడుకాలనంగ గూడ డెందు. 2. నింటికింటికి. 3. నర్థికర్థికి. 4. బచ్చోచ్చబాయక నిల్చును. 5. ౫౪–౫౮ వఱకు ఐదుపద్యములీ ప్రతియందు లేవు, ౫౩ తర్వాత ౫౯ అతుకుచున్నది. ఈ పద్యము లిందులేక పోవుటయు 'కవిత్రయానుమతిని' అని మఱియొచటను కవిత్రయము పేరెత్తక ఇట మాత్రముండుటయు చూడనివి ప్రక్షిప్తములని తోఁచుచున్నది.

క. ...... ..........................................................

....ంటికి సంధినకారం బుంట యసన్మార్గమందురుట్టుంతములన్.

క. నిడుపున జకారభావము। వడసియు హ్రస్వమున నెల్లపట్టున నుత్వం బడరు నకారపుఁ బొల్లకు। నిడఁ దగుఁ బూర్వప్రయోగ మెఱిఁగి కవీంద్రుల్.

క. నేను బచరింతు నీవలెఁ। గానము విశ్వావసీశు కడ నునుపేనిం దానాకును నభిమత మగు। నానగుఁగా దేను నేను గా నేకోక్తిన్. ౫౭

గీ. అచ్చు పరమైనపట్టునఁ బ్రాణిపదము। కర్మ మగుచోటఁ దక్కఁ నుకారయుక్తి వాడుకొనరు చకారభావమున దాని। ననుచరింపుదురు కవిత్రయానుమతిని. ]

క. రిపు నోర్చె రిపుని నోర్చెను। రిపునాజి జయించె నుగ్రరిపుని జయించెన్ నిపుణతఁ జళుక్యవిశ్వా। ధిపుఁ డనఁగాఁ దెనుఁగుసంధితెఱఁ గొప్పారున్.

గీ. తద్ద్వితీయావిభక్తి పొంతలఁ జరించు
[1]కద్దిగల సున్నసోఁకునఁ గచటతపలు
గజడదబలగు నూఁదుటగలుగుఁ గవుల
యనుమతంబున నొక్కొక్క యవసరమున, ౬౦

గీ. జడులఁగరుణించుఁ జతురులజాలఁ బ్రోచు। [2]వాజిపదకాయనంబున వశముసేయు భటులఁ దనియించుఁ బ్రజలకుఁ బాడినడపు। [3]శస్త్రవినయుండు చాళుక్యచక్రవర్తి.

క. అలఁతులఁ దుదహల్లులకును। నలవడ వామమున నుండి యచ్చోటులచేఁ బలుమఱుఁ దేలచు నూఁదుచు। విలసిల్లుట గలుగు లక్ష్యవిధి నెఱుఁగఁదగున్.

క. తనుఁబొగడుఁ దన్నుఁబొగడును
జనుఁడు జనుండనఁగఁ దెనుఁగుజాడలు గలుగున్
[4]మనవాఁడు వీఁడు నాఁగాఁ
జను నిడుపులు వలవ దూఁద సరళతకొఱకున్. ౬౩

క. మొల్లమ్ముగ నెల్లెడలను। హల్లులపై నిడుపు లగుచు నాయీయేయో [5]లుల్లసితాకృతి నిలుపం। జెల్లుం బ్రశ్నానునయవిశేషములందున్. ౬౪

---

1. కడనుగల. 2. వాజులగడించు నేర్పున వశముసైన. 3. శస్త్ర. 4. మన వాండు వీండు. 5. లుల్లసితకృతుల.

క. రారా నాగారీ ము। స్నిరే కర్ణాదిదాత, లిట్టివదాన్యో
దారత విన మందఱు నట। పోరో విశ్వేశు వేఁడ బుధులన నెపుడున్. ౬౫

క. రుచిరముగఁ బిలుచుచోటను। బ్రచురంబుగఁ బ్రథమపొంతఁబడియుండెడున
క్కచటతపంబుల పట్లను। బ్రచురించుం గసడదవలు పరిపాటిమెయిన్, ౬౬

గీ. విశ్వవిభుఁడు గడిది పీరుండు సతురుండు,
దక్కఁద్రిక్కలేని చొక్కలాఁడు,
దత్త్వవిదుఁడు వరవిదారణశీలుండు,
ననఁగఁ దెనుఁగు సంధి యలరునిట్లు. ౬౭

క. డులు రునులను నీవర్ణత
తులు మొదలుగఁ గొన్ని గొన్నితుదహల్లులతోఁ
గలయునెడఁ గూడు విడుచుం
దెలుఁగునకగుసంధి దీనిఁదెలియఁగవలయున్. ౬౮

గీ వేఁడ్క వేడుక వ్రేల్మిడి వ్రేలుమిడియు
మార్మలసె మాఱుమలసెమ మాన్పు మాను
పుము [1]విరోధము సంక్రాంతిఁ బొలుచు నిట్టి
సంధిలక్షణ [2]మెంతయుఁ జనునెఱుంగ. ౬౯

క. ఇది సంధిక్రమ మరయఁగఁ
దదుచిత సంధాన[3]విధులు తఱచెఱుఁగు డిలన్
విదితవిభక్తులగతిఁ జె
ప్పుదుఁ దెలియన్వలయుఁ బూర్వబుధకృతసరణిన్. ౭౦

విభక్తి ప్రకరణము

వ. ప్రథమయు ద్వితీయయుఁ దృతీయయుఁ జతుర్థియుఁ బంచమియు షష్ఠియు సప్తమియు సంబోధనంబును నన నెనిమిది తెఱంగుల విభజింపం గారణంబు గాన విభక్తులనం బరఁగుఁ దత్ప్రకారంబెట్టి దనిన.

క. తెలుఁగుం బ్రాకృతభంగిన। బలియుటచే నేకవచన బహువచనపదం
బులెకాని ద్వివచనంబులు। గలుగవు తత్క్రియలఁ గారకంబులయందున్. ౭౧

1. విరోధమనంగనుబొల్చు తెనుఁగు 2. ములు పెక్క 3. యుక్తిఁదగ నెఱుఁగు

క. ముదులు తుదఁగలుగుశబ్దము। లడరుం బ్రథమావిభక్తు లవి కర్తలగుం,
గడు నొసఁగు నిష్టములు ధర। బొడమినకల్పకము విశ్వభూవిభుఁ డనఁగన్. ౨౩

క. నునివర్ణంబులు తుది నొం। దిన కర్మపుఁబదము దా ద్వితీయ యనంగాఁ
జనుఁ, జాళుక్యధరిత్రీ। పుని విశ్వేశ్వరుని సిరులు పొందు ననంగన్.

క. చేత ననుపలుకు తుదలఁ బ్ర। తీతం బగునేని యది తృతీయ యగుం, బ్ర
ఖ్యాతంబుగ విశ్వేశ్వరు। చేతం బ్రభవిల్లు నెల్లసిద్ధు లనంగన్. ౨౫

క. పలుకులతుదఁ గై శబ్దం। బలవడ నిలిచినఁ జతుర్థియగు విశ్వమహీ
లలనునకై యలఘునకై। చెలువారం గృతులు కవులు చెప్పుదు రనఁగన్. ౨౬

క. పదముతుద వలన ననియెడు। పద ముండినఁ బంచమీవిభక్తియ పుష్ప
ప్రదరుఁ డగు విశ్వభూవర। మదనువలనఁ దొలఁగు సతులమానం బనఁగన్.

క. అమరి కుశబ్దము పాదాం। తమునం దున్నేని షష్ఠి తప్పదు విద్యా
సముదయము విశ్వవసుధా। రమణునకుం బొలుచు నిల నిరంతరము ననన్.

క. పలుకుతుద నందు ననున। ప్పలు కుండిన సప్తమావిభక్తియగు న్ని
శ్చలితచతుర్దశవిద్యా విలసన। ములు పొలుచు విశ్వవిభునం దనినన్. ౨౯

గీ. ప్రథమగావించు ముదులను బాయఁబెట్టి। కట్టెదురఁబల్కు సంబుద్ధి కడుఁదనర్చు,
విక్రమాటోప చాళుక్యవిశ్వభూప। పటుగుణావాల గండగోపాల యనిన. ౩౦

క. కోరి ము కారముమీఁద డు। కారముపట్టునను దగ లు కారము విడఁ బెం
పారున్ బహువచనంబులు। హారము లంగములు విబుధు లమరు లనంగన్.

క. కడల ముకారదుకారము। లుడుపఁగఁబడు నచ్చ తెనుఁగుటుక్తులయందుం
గడ గడలు గొడుగు గొడుగులు। బడుగు బడుగు [1]లేకవచనబహువచనములన్.

క. చింతింపఁగ నివ్విధిని హ। లంతంబులు చెల్లు నిలఁ గ్రియావంతులు శ్రీ
మంతులుధీమంతులు గుణ। వంతులు భూభుజులు వైరివధవిదులనఁగన్.

క. ధర [2]బాలుమీఁది డుత్వము। పరువడి రుత్వంబునొందు, బహువచనము బా
లురు భూపాలురు కరుణా। దరలోలు రనంగఁ దగునుదాహరణంబుల్. ౩౪

గీ. వాఁడు వీఁడను నవి బహువచనములను
వారు వారలు వాండ్రును వీరు వీండ్రు

---

1. అనఁగ నేకబహువచన... 2. బ్రథమమీఁది లుత్వము.

వీరలును నాఁగ నెందును విస్తరిల్లు
గాఁడునకు గారు గాంద్రును గలుగు నంద్రు. ౮౫

గీ. కొఱను నెఱను మ్రాను కొల నను నివియెల్ల
బహువచోనియుక్తిఁ బరఁగుచోట
వెలయుఁ దత్పదములఁ గులు జనియించుఁ బై
వరుస నచ్చతెనుఁగు వచనములకు. ౮౬

క. కొఱఁకులు నెఱఁకులు మ్రాఁకులు
జిఱుఁగొలఁకులు నయ్యెఁ బేను జేనును మీనుం
గొఱపేలుఁ జేలు మీలన
సుఖవగు నిల నచ్చతెనుఁగు లూహింపంగన్. ౮౭

గీ. పల్లు విల్లిల్లు నాఁ జనుపలుకులెల్ల
బండ్లు విం డ్లిండ్లు నాఁజను బహుత నొడువఁ,
బాడుఁ గుండేలు గో రనుపలుకులెల్లఁ
బాళ్లుఁ గుందేళు గోళ్ళు నాఁబడు ధరిత్రి. ౮౮

గీ. వరుస నేయి చేయి వా యనుపలుకుల। తుదలఁ బెక్కుఁజెప్పఁ దులు జనించు
బ్రీతి నేతు లనఁగఁ జేతులు వాతులు। నాఁగఁజెల్లు నెల్లనాట నంద్రు. ౮౯

గీ. పేయి ఱాయి దో యనియెడి పీనిబహుత
నోలిఁ దుద లుత్వ మొనఁగూడు పేలు ఱాలు
దోలు నా దుత్వమబ్బు నెద్దునకు వరికి
నెడ్లు వడ్లుననాఁ జను నెఱుఁగవలయు. ౯౦

క. కే లేకవచన మరయఁగఁ। బాలును దెమ్మెరలు సహజబహువచనంబుల్
మూలాఖ్యమున్నగాఁ జే। ర్కొలోవడు నిట్లు ధాన్యకులములకెల్లన్. ౯౧

గీ. కొఱ్ఱి లాళ్ళు వడ్లు గోదుమ లనుములు। కొల్లు లనెడు వీనికెల్లనిట్ల
ప్రకటితంబులయ్యె బహువచనంబులు। నేకవచననియతి యెపుడు లేదు.

గీ. ప్రాణిపదములు వెలిగాఁగఁ బ్రథమలైన
నరయ నొక్కొక్కచో ద్వితీయార్థము లగు
రా జలంకారములు పూనె రాచకొడుకు
వస్త్రములు బాల్చెనన నెందు వఱలెఁగాన. ౯౩

క. ఒనరఁ దృతీయయుఁ బంచమి। యును సప్తమియును దలంప నుచిత నిజైకా
ర్థనియతిఁ జెల్లుం దెలియఁగ। ననిరి విభక్త్యర్థవేదు లైనకవీంద్రుల్. ౯౪

గీ. విశ్వవిభునిచేత విలసిల్లు సిరి, కర। వాల భైరవాంకువలనఁ గలుగు
భూరిసిద్ధి, రాజనారాయణునియందుఁ। బొడముఁ గవుల కతివిభూతి యనఁగ.

క. వీక చతుర్థీషష్ఠులు। నేకార్థమునందుఁ బలుక నిత్తురు విశ్వ
క్ష్మాకాంతున[1]కుం గృతు లరి। భీకరునకు నిత్తు[రి]గవులు పృథు[2]నీతు లనఁ.

వ. మఱియు నంధ్రభాషావిభక్తులకుం గల నామాంతరంబు లెఱింగింతు,
స్థావర తిర్యఙ్మనుష్య [3]పదవర్తియగు ప్రథమావిభక్తికిం గ్రమంబున
ముకారంబును డుకారంబును, ద్వితీయకు నుకార నికారంబులును,
దృతీయకుఁ జేత తోడ యనునవియుఁ, జతుర్థికిం గై కొఱ [4]కనునవి
యుఁ, బంచమికి వలన పట్టి యుండి [5]కంటె యనునవియును షష్ఠికిం
[6]గికుకారంబులును యొక్క లోపల యనుపదములును, సప్తమికి నందు
[7]న యనుపదంబులు నయ్యెఁ దత్ప్రకారంబునకు విభక్తినిరూపణంబు
లలవరింతు. ౯౭

[ఏకవచనము:—]

క. ద్రుమమేచె ద్రుమముఁ జూ(బూ ?) చెను,
ద్రుమమ్ముచేనొప్పె నరుగు ద్రుమమునకై యా
ద్రుమమువలన ఫలమబ్బెను
ద్రుమమున కెనలేదు పువ్వు ద్రుమమం దొప్పుఁ. ౯౮

వ. ఇది యేకవచనవిధి. ౯౯

[బహువచనము:—]

క. ద్రుమములు ద్రుమములఁ గదిసెను
ద్రుమములచే నీడగలిగె ద్రుమములకై గం
ధ మమరె ద్రుమములవలనఁ
ద్రుమముల కలరారెఁ దాను ద్రుమములయందుఁ. ౧౦౦

వ. ఇట్లు తిర్యక్పదంబులకు యోజించునది. ౧౦౧

---

1. కై. 2 గీతు. 3 పదంబులందు. 4 కు లనునవియు. 5 'కంటె' ఇందులేదు.
6 గికారకుకారయొక్కనునవియు. 7 నందునిందు ననునవియును.

[ఈ ప్రతిలో నిది అధికపాఠము:—

దేవమనుష్యపదమ్ములకు ఏకవచనము:—

క. ఇంద్రుఁడు యింద్రుని నెనయును
ఇంద్రునిచేఁ బృథివిబండు నింద్రుని కొఱకుఁ
ఇంద్రునివలన జయంబగు
నింద్రునికిని శుభములొదవు నింద్రుని యందుఁ.]

[1][క. తనయుఁడు తనయునిగనియెను। దనయునిచేఁ దనయుకొఱకుఁ దనయునివలనఁ
దనయునకు ధనముదొరకెను। దనయునియందెల్ల మంచితనములు గలుగుఁ.

క. తనయులు తనయులఁ బడసిరి
తనయులచేఁ దనయులకయి దనయులవలనం
దనయులకు మేలుగలిగెను
దనయులయం దనఁగ నివి యుదాహరణంబుల్.] ౧౦౩

[ఏకవచనము—]

క. కవి యొప్పుఁ గవి [2]భజింతురు
కవిచేఁ [3]గృతు లొదవు సిరియుఁ గవియుఁ గవులకై
కవివలనఁ గల్గుఁ గీర్తులు
కవితతికిం బేరువెలయుఁ [4]గవివరునందుఁ. ౧౦౪

[బహువచనము—]

క. కవులు నుతింతురు కవులం। గవులచేతఁ గవులకొఱకుఁ గవులవలనఁ ద
త్కవులకుఁ బ్రసిద్ధి యలవడుఁ। గవులందుంగాక కావ్యకల్పన గలదే. ౧౦౫

[5]క. గురుఁ డధికుఁడు గురుఁ దలఁపుము। గురుచేతం దెలిసి భక్తి కొలుు గురునకై
గురువలన మేలు చేకుఱు। గురునకు సరిలేదు విద్య గురునం దుండుఁ.

---

1. ఈరెండు పద్యములును ఈప్రతిలోకానరావు. 2. భజించును.
3. గృతిరొదవు సిరియుఁగవియునుఁగవికై. 4. గవితతియందుఁ.
5. పద్యములు 106, 107కు బదులు ఈప్రతియందు ఈయొక్క పద్యమే కలదు.
క. గురుఁడధికుఁడు గురుగొలుతును। గురువులచే గురులకొఱకు గురువులవలనఁ
గురులకుభక్తిదనర్చును। గురువులయందుండు సకలగుణములు నెపుడుఁ.

క. గురువులు గురులను గొల్తురు। గురువులచే గురువులకొఱకు గురువులవలనన్
గురులకు భక్తి దనర్చును। గురువులయందుండు సకలగుణములు నెపుడున్.

వ. ఇత్తెఱంగున ననుక్తపదంబులయం దొడఁగూర్చునది. ౧౦౮

క. స్థావరతిర్యక్పదములు। వోవిడిచి తృతీయమొదలు పురుషాఖ్యలపైఁ
బైవర్ణములో నుత్వము। నావల నిత్వము విభక్తు లైదును జెందున్. ౧౦౯

క. సుతుచేత సుతునిచేతను
సుతుకొఱకును సుతునికొఱకు సుతువలనం ద
త్సుతునివలన సుతుకొదవును
సుతునికొదవు సుతునియందు సుతువం దనఁగన్. ౧౧౦

గీ. పరఁగఁ [1] గూఁతురుశబ్దంబుపై రుకార
మొక్కపలుకున పైనైన నుండుఁ బాయుఁ
బెక్కుపలుకులపైనైనఁ దక్కి పోవుఁ
గూఁతురుగఁ బొందెఁ గూఁతుఁగాఁ గోరె ననఁగ. ౧౧౧

క. కూఁతులచేఁ గూఁతురిచేఁ। గూఁతులకై కూఁతుకొఱకుఁ గూఁతులవలనం
గూఁతులకుఁ దగవు లొసఁగెను। గూఁతులయందుండుఁ బ్రీతి గుణవంతులకున్.

క. ఓయాదిపదంబులతుదఁ। బాయని నిడు పుడిపి తగవిభక్తు లునుప ము
న్నోయనువునఁ బుంలింగని। కాయమునకుఁ జెప్పి రట్ల కవివరులోలిన్.

గీ. కడ[2]డుకారమున్న నొడు[3]లెల్ల సంబుద్ధి। హ్రస్వమైన దీర్ఘమైన నగును;
వీరవరుఁడ సమరశూరుఁడాయనఁగ మా। నినియనంగ మానసీయనంగ.

క. డులు బహువచనంబులయెడఁ। దొలఁగు న్సంబోధనమున దుర్జనులారా
బలిభోజనవిధులారా ఖ। లులారా మిమ్ము జముఁడు గావఁ డనంగన్. ౧౧౨

గీ. ఒనర యుష్మదస్మదుక్తుల కేకవ। చనబహువచనములు సంభవించు,
మెఱయు నీవు నేను మీరు మేమనెడునా। దేశములు ధరిత్రిఁ దెలియవలయు.

క. నియతుఁడవు నీవు నిన్నును। నియమింతురు శుభము లొలయు నీచే నీకై
జయమగు నీవలన దయో। దయమున సిరి నీకు శుభము దగు నీయందున్.

---

[1] 'కూఁతురు' 'వాఁడు' అని యిందు పూర్ణానుస్వారమే అంతటను కలదు.
డకారమున్న, [3] వల్ల.

క. [1] మీ రనఘులు మిముఁ గొలుతురు। సేమము మీచేత నతులు చెలువగుమీకై
హేమమొదవు మీవలనను। శ్రీమీకలరారి యుల్లసిలు మీయందున్. ౧౧౮

[ ఇది యుష్మదుక్తవిధి. ]

క. నేరమ్మ్యేఁడ నముఁ దలఁతురు। నాయలు నాచేత నెగడె నాకై ప్రియమౌ
ధారుణి నావలనం బెం। పారెను నాకొనఁగుఁ బ్రియము లవి నాయందున్.

క. మేమెఖ్ఖఁగము మము మఱచిరె। భామలు మాచేత బ్రదుకఁబడి మాకైము
న్నేమీరు మావలన వల। దా మక్కువసేయ మాకుఁ దగ మాయందున్.

[ ఇది అస్మదుక్తవిధి ]

స మా స ప్ర క ర ణ ము

క. మొదలిపదాంతవిభక్తిని। [2]వదలుచుఁ దుదిపదము మొదలివర్ణముతోడం
గదిసిన నదికినశబ్దము। జదువులను సమాస మనఁగఁ జనునంద్రు బుధుల్.

వ. అది తత్పురుషంబును, గర్మధారయంబును, బహువ్రీహియు నన మూఁడు తెఱంగులం బ్రవర్తిల్లు, నంధ్రభాషాప్రయోగంబుల నందుఁ దత్పురుషంబులకు నొక్కతెఱం గెఱింగింతు. ౧౨౨

క. రాచిలుక[3]లు విరజాజులు। రాచకొడుకు లంపగములు రాయంచలునా
రాచినయట్టి సమాసము। లేచుం దత్పురుష మన ననేకం బగుచున్. ౧౨౩

క. వెలిదమ్మి కమ్మఁ దూపులు। వలకే లెడకాలు నీలవర్ణము నవపా
టల[4]రుచులచే సమాసము। లలవడియెం గర్మధారయములు దెనుఁగునన్.

గీ. పూవుఁబోఁడి తలిరుఁబోడి పూవిల్తుండు। వాలుఁగంటి వాతవాఁడి మించు
మొలక మచ్చెకంటి ముక్కంటి యన బహు। వ్రీహిపెక్కువిధుల విస్తరిల్లు.

వ. మఱియు వీనికి సాధారణలక్షణంబు లొకకొన్ని యెఱింగింతు, ౧౨౬

గీ. గుణిగుణంబుచెప్పఁ గొఱలు విశేషణ। పదముపై నికార మొదవుఁ బాయు
నాతికెల్లనాఁడు నల్లనికనుఁగవ। నల్లకన్నుఁగవ యనంగ వరుస. ౧౨౭

---

[1] సాములుమీర్మిము......( ఇది ప్రాసభంగములేని సరియైన పాఠము ).

[2] వదలకఁదుదపదము. [3] అడవిజాతులు. [4] చేలమను.

క. విదితవిశేషపదాంతము। గదిపి వుకారంబు నిలుచుఁ గడ హల్లున్నం
బదపడి యచ్చుండినఁ బటు। లొదవు ముకారంబుఁ ద్రోచి యోలింగ్రుతులన్.

క. గూఢపుమంత్రంబులు నతి। గాఢపుఁగర్మములు సోయగపుటాటలు నా
రూఢపుటాలాపంబులు। ప్రౌఢములగు నీసమాసఫణితులయందున్. ౧౨౯

క. ఇలఁ బల్లు ముల్లు విల్లను। హలాదులను నదుకుచోట నడఁగును జడ్డల్
పలువరుసయు ములుమోదుగు। విలుకాఁడు ననంగ నెందు విశ్రుతమగుటన్.

గీ. వెన్ను కన్ను చన్ననియెడు వీనిజడ్డ
లుడుపుటొప్పు సమాసనియోజనములఁ
దనర వెనుగాఁడి కనుదోయి చనుమొలకలు
నా సమాసంబులొప్పు నానావిధముల. ౧౩౧

క. ఆదట నా నీ తన యను। చో దుత్వము గలుగు షష్ఠి చూపెడునెడలన్
నాదు కళాసంపదయును। నీదువివేకంబుఁ దనదు నిపుణతయు ననన్. ౧౩౨

క. నా నీ తన యనుపలుకుల। తో నదుకు దుకార మపుడు దొలఁగినఁ దొలఁగుం
బూని సమాసము సంస్కృత। మైనను షష్ఠ్యర్థహేతువై సత్కృతులన్.

మ. తనసత్యవ్రత కౌశలంబుఁ దన విద్యాతంత్రనిర్మాణమున్
దనవిశ్రాణనకీర్తనంబుఁ దనసత్ప్రస్తుత్యసంతానముల్
తనతేజోమహిమోదయంబుఁ దనయుద్యత్కీర్తివిస్ఫూర్తియుం
దనరం బేర్చుఁ జళుక్యవిశ్వనృపమందారంబునా నెల్లెడన్. ౧౩౪

క. క్షీరార్ణవకూఁతురు సం
సారార్ణవయోడ శుభమొసఁగు మీకనఁగా
వైరిపదం బగుఁ దెనుఁగున
గూరని సంస్కృతముఁ దెనుఁగుఁగూర్చుటచేతన్, ౧౩౫

గీ. అరయ నానీలు హల్లుతో నదుకుచోట
నొనర[1]మగ్గును నిడుపయియున్ననుండు
గవులయనుమతి [2]నిది కృతిఁ గానవలయుఁ
జాలవర్ణంబుగదిసిన జడ్డయగును. ౧౩౬

---

[1] బొల్లును. [2] నదియును.

క. ఆకరి యక్కరి యనఁగా। నాకర మక్కరము నాఁగ నక్కికసకం
బాకీకసకం బన ఖా। షాకరము సమాసముల కుదాహరణంబుల్. ౧౩౭

గీ. సంస్కృతము లయ్యుఁ దెనుఁగులై చాఁగు గొన్ని
శబ్దములు వానిచందంబుఁ జను నెఱుంగఁ
బనసపండును గుండులోపల ననంగఁ
గందదుంపలు నాజీరకట్టయనఁగ. ౧౩౮

క. సుమతి నికారోకారాం। తముపై సంస్కృతపదంబు తగుఁ గూర్పఁగ, వే
డిమరీచులు, వాఁడిశరం। బమరు మనుష్యుండుఁ, బేర్చు నశ్వంబనఁగన్.

క. తగుఁగూర్ప నికారాంతం। బగు సంస్కృతపదముమీఁద నచ్చతెనుఁగున
న్నిగుడారు దంతికొమ్ములు। జగమెఱుఁగు నరాతిపోరుచందంబనఁగన్. ౧౪౦

గీ. అత్తమామ నాఁగ నాలుమగం డనఁ। గొడుకు గోడలనఁగఁ గొఱనుజేలు
నాఁగ రాత్రిపగలు నాఁగ నిట్టి సమాస। ములును గలుగుఁ గవులు దెలియవలయు.

త ద్ధి త ప్ర క ర ణ ము

క. అరి యిఁడికాఁడాఁడఅయన। ధరలో నొకకొన్ని చెల్లుఁ దద్ధితపదముల్
పరువడి వాని నెఱుంగుట। పరమపరిజ్ఞాన మంధ్రభాషాకవితన్. ౧౪౨

సీ. సూఁదరి ముండరి తూఁదరి కల్లరి కాలరి ప్రేలరి కష్టుఁ డనఁగ,
నుప్పెఁడి ప్రాయిఁడి చప్పిడి గ్రేసిడి తన్నిడి చిక్కిడి దాతయనఁగ,
నీటుకాఁ డెడకాఁడు పోటుకాఁ డుదురులాఁ డించులాఁ డెప్పుడు నీతఁ డనఁగఁ,
దక్కులాఁ డెక్కువ నిక్కులాఁ డదరులాఁ డెపుడు దురాత్మకుం డీతఁడనఁగఁ,

గీ. దనరు దబ్బఱ చింద అందఱ యనంగఁ
బరఁగు పలుకులు తద్ధితపదములయ్యుఁ
దెనుఁగునను వీనిచందంబుఁ దెలియుకవుఁ
నాదృతులఁజేయు రాజనారాయణుండు. ౧౪౩

క్రి యా ప్ర క ర ణ ము

గీ. అరయవాక్యకదంబోత్తమాంగమునకు
నమితదృష్టులుజగతిఁ గ్రియాపదములు
వాని తెఱఁగులు కవులకు వలయుఁ దెలియఁ
గడఁగి కాలత్రయ ప్రసంగముల వలన. ౧౪౪

క. ధర, బ్రథమమధ్యమోత్తమ। పురుషాఖ్యలఁ గ్రియలు మూఁడు పొలుచుం గాల
స్ఫురణలును వర్తమానాం। తర భూత భవిష్యదర్థతలఁ ద్రివిధంబుల్. ౧౪౫
గీ. ప్రథమపురుషాఖ్యయన్యార్థఫణితిఁజెప్పు। నగ్రసంస్థితుఁజెప్పు మధ్యమపురుషము
దగిలి యుత్తమపురుషంబు తన్నుఁ జెప్పు। నేకబహువచనంబుల నెల్లకడల.
గీ. అగుచునున్నకర్తయగు వర్తమానంబు। భూతమనఁగ నయినపూర్వకృతము
కడఁగి యంత మీఁద గానున్నయదియ భ। విష్యదర్థమనఁగ విస్తరిల్లు. ౧౪౭
క. ఉచితవిధి విధియు నాశీ। ర్వచనము నను క్రియలు రెండుఁ బ్రథ నొక్కటియై
ప్రచురించుం బురుషత్రయ। వచనంబుల వీనితెలుఁగు వలయుం దెలియన్.
క. తెలుఁగు క్రియాపదములకును। దలకొను ధాతువులు జనపదవ్యవహారో
క్తులుకాన వానిఁబేర్కొన। వలదు ప్రయోగములఁ దెలియవలయుఁ దెలుపుదున్.
వ. ప్రథమపురుషంబునకు వర్తమానార్థంబునందు నేకవచన బహువచనంబు లందు
నెడి, నెదరులును మధ్యమపురుషంబున కెదవెదరులును, నుత్తమపురుషంబున
కెదనెదములును గ్రమంబున నాదేశంబులయ్యెఁ దన్నిరూపణంబు లెఱింగింతు.
క. అరిగెడి నరిగెద రనఁగాఁ। నరిగెద వరిగెద రనంగ నధిపతిపురికై
యరిగెద నరిగెద మనఁగా। బరువడి నిది వర్తమాన ఫణితార్థమగున్. ౧౫౧
వ, ప్రథమపురుషంబునకు భూతార్థంబునందు నేకవచనబహువచనంబుల[1] నెన్నిరు
లును మధ్యమపురుషంబునకు తివి తిలులు, నుత్తమ పురుషంబునకు తిని
తిములును నాదేశంబులగుఁ దన్నిరూపణంబు లెట్లనిన. ౧౫౨
క. చేసెం జేసి రనంగాఁ। జేసితి చేసితిరి మీరు సిరి మా కనఁగాఁ
జేసితిఁ జేసితి మనఁగా। భాసురభూతార్థకథనభజన మ్మయ్యెన్. ౧౫౩
వ. ప్రథమపురుషంబునకు భవిష్యర్థంబునందు నేక వచన బహువచనంబులకు
నుదురులును మధ్యమపురుషంబునకు వుదువురులును, నుత్తమపురుషంబునకు
దునుదుములు వరుస నాదేశంబులయ్యెఁ దన్నిదర్శనం బెట్టిదనిన :— ౧౫౪
క. చేయుం జేయుదు రనఁగాఁ। జేయుదు చేయుదురు మీరు చిత్తంబలరం
జేయుదుఁ జేయుదు మనఁగా। నాయతముగ నివి భవిష్యదర్థముఁ జెప్పున్. ౧౫౫
క. మొదలం జెప్పిన [2]యది తుద। యది యాదేశంబు విధికి నవ్వచనములం
బొదలి ప్రథమమధ్యమలకుఁ। దుద నుత్తమపురుషమునకుఁ దొంటట్లయగున్.

[1] కుఁ జేసి జేసి తిరులగును.   [2] యుందుతుద.

క. చేయునది బుధుఁడు ధర్మము। సేయునది బుధులు విశేషసిద్ధక్రియలం,
జేయునది నీవు దర్పము। సేయునది తపంబు మీరు శివునకుననినన్. ౧౫౭

గీ. ఉనుదురులకుమీఁద నొగిఁ గాఁతయున్న నా
శీర్వచనమునకును జెల్లునదియు
శివము చేయుఁగాఁత శివుడు శోభనము చే
యుదురుగాఁత మీకుఁ ద్రిదశులనఁగ. ౧౫౮

క. కారయిత సేయుకృతి నల। రారు ణిజంతంబు దాని కాదేశంబుల్
ధారిణి నింపును నించును। సారముగా నేకవచనసరణికి నయ్యెన్. ౧౫౯

క, తుదబహువచనమునకు నిం
పుదురును నింతురును నయ్యెఁ బుడమియెడల నిం
చుదురును గలుగు బ్రయోగా
స్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్. ౧౬౦

సీ. శ్రీవిశ్వభూపతి చేయించు గ్రతువులు
సేవింపుదురు తదాశ్రితులు సురలఁ,
బండంగ నింద్రుండు పరఁగించు వానలు
హాలికులు పరిగింతు రర్థచయము,
నెసఁగించు ధర శ్రీల నేపారు తద్వృత్తి
వరభటు లెఱింగింపుదురు జయంబు,
వెలయింపుకీర్తి యవ్విధి నెలయింపుదు
రర్థులెల్లెడఁ బ్రతాపాతిశయము

గీ. ననెడు పల్కులచేత ణిజర్థములకు
నేకవచనబహువచనపాక మెఱుఁగ
వలయు నవి పెక్కువిధముల వసుధఁదెలియ
నిఖిలభాషావివేకులై నెగడుకవులు. ౧౬౧

క. మహితసావరతిర్య। ఙ్మహిళాదిక్రియలవర్తమానార్థమున
న్విహితమగు నెడు డుకారము। సహజంబుగ నేకవచనసంజ్ఞలచోటన్. ౧౬౨

క. [1]పండును భూజము తరువులు
పండెదు రాచిలుఁక యొప్పుఁ బలికెడుఁ జిలుకల్

---

[1] పండెదు.

[1]గండాడెడు సతిపతిపైఁ
బండెడుఁ బెక్కింట సతులు [2]వండెడు ననఁగన్. ౧౬౩

క. నిగుడదు భూజము. సింగము। బెగడదు, విటు వారవనిత పిలువ దనెడుచోఁ
దగుభూతార్థంబున నదు। లగు నాదేశంబు గ్రియల నయ్యెయెడలన్. ౧౬౪

గీ. ఒనర నింపు వింపు ననియెడు వీనిపై
నుటతలొందెనేని నొక్కచోటఁ
బరఁగుఁగారకాఖ్యపదములై తెనుఁగున
వాని తెలుఁగు లెఱుఁగవలయు బుధులు. ౧౬౫

క. కోపింపుట కోపించుట। కాపించుట పసుల నొప్పఁ గాయించుట నా
నేపారు నిట్టిపలుకులు। లోపుగ బహుళములు జగతిలో నెఱుఁగదగున్, ౧౬౬

గీ. తెలుఁగుబలుకులు పునరుక్తిఁ బలుకుచోట
గదిసి రెండవపదమున మొదలిఁవ్రాఁత
దనరు గిత్వంబు ప్రాసంబు దప్పకుండ
వర్ణములు దీర్ఘహ్రస్వప్రవర్తులగుచు. ౧౬౭

క. పులిగిలి యనఁ గరిగిరియన
నలిగిలియన నోడగీడ యనఁగా బరఁగున్
నలులు గిలు లనఁగ బలవం
తులు మఱి గిలవంతు లనఁగఁ దుద సరియగుచున్. ౧౬౮

క. స్మర ధర చర వర పదములు। పరఁగుఁ గ్రియాపదమునొందుపట్టులనెల్ల
న్వరుస రకారములోపలఁ। బొరినిత్వమడంగుఁ [3]గాక పొడమినఁ బొడమున్.

క. స్మరియించె సంస్మరించెను। ధరియించె ధరించెఁ బూవుదండఁ, జరించెం
జరియించె వల్లభునిసతి। వరియించె వరించెనాఁగ వలనైయునికిన్. ౧౭౦

క. ఇది తెనుఁగున కెల్లను జన। పదవిదితం బైనతెలుఁగుప ట్టించుక యొ
ల్లిదముగఁ జెప్పితి నంతయు। మది నెఱుఁగుం డరసి బుద్ధిమంతు లితరముల్.

---

[1] గొండాడెడు. [2] బండెడదరనఁగన్ (దీనిం జూడఁగా 'సతిపతికై బండెడుఁ బెక్కిండ్లసతులు వండెదరనగన్' అని యుండునని తోచుచున్నది.)
[3] దరుగఁబో.

[1][మ. లలినన్యోన్యముఖావలోకనము లీలం జేయఁగాలేని యా
విలసత్కావ్యకళాచతుష్టయము లుర్విం బర్వ నేకస్థలిం
గలిగించెం బదవాక్య వేదియు సలంకారజ్ఞుఁడుణా భూవరో
జ్జ్వలవిద్యావిభవోన్నతుండు నగువిశ్వక్ష్మావిభుం డిమ్ములన్. ౧౩౨

మ. కవివాత్సల్యకళాచరిష్ణుఁడు జగత్కల్యాణవర్ధిష్ణుఁ డు
త్సవసంపుష్ట సుపర్వగర్వుఁడు జయశ్లాఘాప్తగంధర్వుఁ డా
ర్జవశీలాదివిశుద్ధవృత్తుఁడు విరాజద్విక్రమాయత్తుఁ డ
చ్ఛవిశాలామలకీర్తిపూరుఁడు సుతేజస్స్ఫారుఁ డెల్లప్పుడున్. ౧౩౩]

[2]క. శ్రీమచ్చళుక్యవిశ్వ। క్ష్మామండలవిభుఁడు సకలసంగ్రామజయ
శ్రీమంతుఁడు సంతతనత। సామంతుఁడు కామినీవసంతుఁడు లీలన్. ౧౩౪

తరల. బిరుదమిత్రుఁడు భిన్నశత్రుఁ డుపేంద్రపుత్రుఁడు యామినీ
శ్వరకులేశుఁడు మానవేశుఁడు వాహినీశుఁడు విక్రమ
స్ఫురణరాముఁడు నూత్నకాముఁడు పూర్ణసోముఁడు కీర్తులం
బరఁగుచుండెడు నాసుధాకరభానుతారకవిశ్రుతిన్. ౧౩౫

## గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితం బైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబునందు
నంధ్రభాషావిశేష సంధి సమాస దేశీయ
ప్రయోగక్రియానిరూపణలక్షణ సముద్దేశంబన్నది
నవమోల్లాసము.



---

1 ఈ రెండు పద్యములును ఈ ప్రతిలో లేవు. 2 ఈ పద్యమైనంతనే కేతన యాంధ్రభాషాభూషణ మందలి 'కంచి నెల్లూరు మతియోరుగ' ల్లను పద్యముకలదు. వెనువెంటనే 'శ్రీరామచంద్రార్పణమస్తు శ్రీ సదాశివగురు చరణారవిందాభ్యాం నమః' ఇత్యాదితో గ్రంథాంతము.